శ్రీ

# పాండురంగమాహాత్మ్యము

(పరమభాగవతచరిత్రము.)

ఇది

## తెనాలి రామకృష్ణకవిచే

రచియింపఁబడినది.

తణుకు

శ్రీ సౌదామినీ ముద్రాక్షరశాల

యందు ముద్రింపఁబడినది.

1913.

వెల ప్రతి 1 కి 0-12-0 మాత్రమే

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి
రాజమ్ముం

శ్రీరస్తు.

# పాండురంగమాహాత్మ్యము.

## ప్రథమాశ్వాసము.

శా. శ్రీకాంతామణిఁ గన్నెఱింగి మదిధా ♦ త్రిన్ మంచినన్ దద్ధ్రుతిన్
శ్రీకాదంబినిమీఁదికిన్ బ్బెనసఁగా ♦ శ్రీవత్సముం దాల్చి ము
ల్లోకంబుల్ వదలించు కృష్ణుఁడు దయా ♦ ఢ్యుం డేలు శ్రీవైష్ణవ
స్వీకారార్హు విగూరి పట్టణపతిన్ ♦ వేదాద్రిమంత్రీశ్వరున్.

సీ. అవతారమందె నే ♦ యఖిలైకజనయిత్రి
కలశరత్నాకర ♦ గర్భసీమఁ
దోఁబుట్టువయ్యె నే ♦ తులితకాంచనవర్ణ,
వెలఁది వెన్నెలగాయు ♦ వేల్పునకును
బాయక యుండు నే ♦ పరమపావనమూర్తి
చక్రిబాహామధ్య ♦ సౌధవీధి,
నభిషేకమాడు నే ♦ యభివర్ణితాచార
దిగ్గజాసీతమా ♦ తేటనీట

గీ. నవ నిధానంబులే దేవి ♦ జవణిసరకు
లమ్మహాదేవి శ్రీదేవి ♦ యాదిలక్ష్మి
సరసశుభదృష్టి రామాను ♦ జయ్యసుతుని
[illegible]రించు విగూరివే ♦ దాద్రినాథు.



ఉ. మాదిరికిమీఱు నంచవెలి ♦ మావుపయిన్ మురువై సజోదుచే
భద్రమయాత్మచే భువన ♦ పాలన ఖేలనుచే సరస్వతీ

ముద్రితవక్షస్త్రీచేత నలు • మోములవేలుపు చే విగూరివే
దాద్రిచమూవిభుండు గను•నాయువు శ్రీయునిరంతరాయముల్.3

శా. కద్రూజాంగదుతోడబుట్టువు శర • త్కాదంబినీచంద్రికా
చిద్రూపాంచిత పద్మగర్భముఖరా• జీవాళిహంసంబు వ
ర్ణద్రాక్షాఫలకీరి శారద కృపన్• రామానుజామాత్యు వే
దాద్రిస్వామికి నిచ్చునిచ్చలును వి•ద్యా బుద్ధి వాక్సిద్ధులన్ 4

ఉ. ఈచిగురాకు నీపసివ • మీఁపువుఁదేనియ యెంతయొప్పెడిన్
జూచితిరే! యటంచుఁదన• చుట్టు శుకాదులుగొల్వఁగాఁగప
ర్దాచితచంద్రగాంగజల• మైనశివాహ్వయకల్పశాఖ వే
దాచలమంత్రికీర్తికల• శాబ్ధిని వెన్నెలమాడ్కిఁ జూచుతన్. 5

ఉ. చిద్ఘనవేదియోంకారదమ• చిల్కకు విష్ణుసహస్రనామముల్
ముద్రతి మోము మోవినిడి•మున్కచు గోరున మేనుదువ్వుచున్
భద్రనిధానమై వెలయు • పర్వతకన్య విగూరిమంత్రివే
దాద్రికి విష్ణుభక్తిమహిమాతి • శయం బనయంబునీవుతన్. 6

సీ. సూత్రవతీదేవి • సొబగుపాలిండ్లపై
మలుపచ్చిగందంపు • వలపుతోడ
శిరసులువంచు ని • ర్జరకోటిఁ బనిగొను
తపనీయవేత్రహ • స్తంబుతోడఁ
బనియేమియని విన్న • పముసేయు సుమనోర
థములైనదివ్యాయు • ధములతోడ
బ్రహ్మాండకోటుల • పారుపత్తెములెల్లఁ
గనియున్కిసిద్ధంపు • మనసుతోడ

గీ. శార్ఙ్గి రెండవమూర్తియై • జగములేలు
మునిమనోహారి శ్రీసేన • మొదలియూరి
చేయుపనులెల్ల సఫలముల్ • సేయుఁగాత
మలరి రామానుజయ్యవే • దాద్రిపతికి.

శా. మీఁదం దారధరాధరంబుగల యా ♦ మేరు న్నగంజాలి త
త్త్రాదృక్ఖండరుచి న్దలిర్చు ఖగయా ♦ ధస్వామి హేమప్రభా
పాదుర్భావశుభప్రభుండు మనుచు ♦ నాప్రమానుజామాత్యు శ్రీ
వేదాద్రీశు విరూరిమందిరు జగ♦ ద్విఖ్యాతకీర్తి శ్వరుఁ. 8

సీ. ధరణీభరముదాల్చు ♦ తనచేవయంతయు
భుజపరిఘంబులఁ ♦ బొంకపఱిచి
మునుమిన్నకనియైన ♦ తనప్రజ్ఞయంతయు
మతివిశేషమునందు ♦ మస్తరించి
దైత్యారిసఖ్యమైన ♦ తనచిత్తమంతయు
నినుచు గౌరవమున ♦ నివ్వటించి
తనువువెన్నెలగాయు ♦ తనమూర్తియంతయు
గీర్తివైభవమునఁ ♦ గీలుకొలిపి
గీ. శేషుఁ డఖిలప్రపంచవి ♦ శేషశాలి
నిత్యముక్తుల కాద్యుఁడై ♦ నిలుచు మేటి
చారుచారిత్రు రామాను ♦ జయ్యపుత్రుఁ
గరుణ వేదాద్రిమంత్రిశే♦ ఖరుని మనుచు. 9

క. పుట్టకుఁబుట్టెడు వేళం
దిట్టపునునుపచ్చిపుట్ట ♦ తేనియచవితోఁ
బుట్టె నన నమృతముట్టెడు
పుట్టనిసువుసత్కవిత్వ ♦ ములువర్ణింతుఁ 10

క. ఇట్టాడరానియాగమ
ఘట్టమునకునడవ యచ్చు ♦ కట్టినముని రా
ట్పట్టాభిషిక్తుఁ దపముల
పుట్టిన నెలవయిన వ్యాస♦ముని వర్ణింతుఁ. 11

తే. వ్యాస వాల్మీకి ముఖసూక్తి ♦ వైభవముల
నేర్పుమీరంగ నిజకావ్య ♦ దర్పణముల

సరసమానసముల నేలు • పలుచుకీర్తి
ధవుల నన్నయభట్టాది • కవులఁ దలఁతు. 12

ఉ. చాటుకవిత్వతత్త్వరస • సాగరపారగులయ్యు సత్కవుల్
పాటిగఁ బట్టివిందు రొక • పాటివిగావున కన్యకావ్యముల్
కైటభవైరియావతశి • ఖామణి శ్రీసతిఁ బేరురంబునన్
మాటియు నీటికెంపుబహు • మానముగం బదకంబుఁ జేయఁడే. 13

తే. తప్పగలిగినచోటనే • యొప్పుఁ గలుగు
నరసి కావలె కవితల • యవగుణములు
సరసకవి తావశోక్తుల • సరణియందు
నమృతధారా ప్రవాహంబు • లడరుగాదె 14

తే. కాన దోషాత్ములైనదు • ష్కవులకతన
గరిమవహియించుఁ గవిరాజ • కావ్యమహిమ
బహుళపక్షంబుచీఁకటి • బహుళమగుట
జాయవెన్నెలతరి తీపు • సేయుకరణి 15

వ. అని నిఖిలభువనప్రధానధన్యంబులగుమాన్యదైవతంబులం గొని యాడి గాఢిమెఱయు కవివృషభుల నభినుతించి యుదంచితంబగు కవిత్వ తత్త్వంబునంగలగరిమంబు బరిశీలించి వంచకులగు కొంచెపుం గవులరవళి యదలంచి పంచాశత్కోటివిస్తీర్ణం బగునర్ణవమేఖలా వలయంబునంగలపరమవైష్ణవరత్నంబులకుఁ బ్రయత్నపూర్వకంబుగ నభివందనంబాచరించి 16

క. వాక్కాంతాశ్రయభట్టరు
చిక్కాచార్యుల మహాత్ము • శ్రీగురుమూర్తిన్
నిక్కపుభక్తి భజించెద
నిక్కావ్యకళాకలాప • మీడేఱుటకున్ 17.

క. తవశింతు నొక్క-శ్రీభా
గవతచరిత్రంబుఁ బరమ ♦ కల్యాణసము
ద్భవభవనంబుఁ జతుర్దశ
భువనమహారత్నసూత్ర♦ ముగఁ దగునరణిఁ 18

వ. అని యిట్లభినవ ప్రబంధనిర్మాణ కౌతూహలాయత్తచిత్తుండ
నయి యేనున్న సమయంబున 19

సీ. తనకులాచారవ ♦ ర్తన నైష్ణవాచార
పర్యాయముల కొజ్జ ♦ బంతియనఁగఁ
దనసూనృతము పురా ♦ తనసత్యనిధులయు
న్నతికెఁబునఃప్రవతి ♦ ష్ఠితము గాఁగఁ
దనబుద్ధి నీతిశా ♦ స్త్రరహస్యములు తెల్ల
ముగఁ దెల్పువ్యాఖ్యాన ♦ ముద్రగాఁగఁ
దనప్రాయుగంటంబు ♦ మొనవాఁడి విశ్వంభ
రాపరిజలకుఁబ్రాణ ♦ రక్షగాఁగ
గీ. వెలయుమంగయగురువభూ ♦ విభుని పెద్ద
సంగభూపాల మణిప్రాయ ♦ సప్రవర్తి
సఖయుతెంద్యైన రామానుజ♦ జయ్యసుతుఁడు
భద్రగుణసీరి విరురివే ♦ దాద్రిశౌరి 20

మ. కవులుం బాఠకులుఁ బరిధానులు నలం♦ కారజ్ఞులున్ బ్రాజ్ఞులున్
ధవళాక్షు ల్భజియింప నిండుకొలువై ♦ తారేందుతారావళీ
ధవళంబైనసువర్ణకుంభయుత సౌ ♦ ధంబందు నావాసమై
వివిధామ్నాయపురాణగుంభనకథ♦ల్వించున్ బ్రమోదంబునన్ 21

క. నను రామకృష్ణకవిఁ గవి
జనసహకారావళీవ ♦ సంతోత్సవనూ
క్తినిధి బిలిపించి యర్హా
సనమునఁ గూర్చుండఁబనిచి ♦ చతురత ననియెన్ 22

సీ. జగతి సొబగుల నె ♦ న్నఁగఁగావ్యధారల
ఘనుఁడ వాశువునందుఁ ♦ గరము మేటి
వఖిలభూమీపాల ♦ కాస్థానకమలాక
రోదయతరుణసూ ♦ ర్యోదయుఁడవు
శైవ వైష్ణవ పురా ♦ ణావళీనానార్థ
రచనాపటిష్ఠైక ♦ రమ్యమతివి
లౌకిక వైదిక ♦ లక్షణచాతుర్య
ధైర్యప్రభారూఢ ♦ కార్యచణుఁడ
గీ. వరయ భూమికుచాగ్రహా ♦ రాభమైన
శ్రీతెనాల్యగ్రహారాని ♦ స్ణేతవ్యగ్ర
శాఖికా కోకిలమవీవు ♦ సరసకవివి
రమ్యగుణకృష్ణ! రామయ ♦ రామకృష్ణ! 23

క. కౌండిన్యసగోత్రుఁడ వా
ఖండలగురునిభుఁడ వఖిల ♦ కావ్యరససుధా
మండనకుండలుఁడవు భూ
మండలవినుతుఁడవు లక్ష్మ ♦ మావరతనయా! 24

క. యశముగలిగించు నీవ్మృదు
విశదోక్తులఁ బౌండరీక ♦ విభుచరితఁజతు
ర్దశభువనవినుతముగ శుభ
వశమతి నాపేరనుడువు ♦ వరతత్వనిధీ. 25

ఉ. స్కాందపురాణనీరనిధి ♦ కౌస్తుభమై ప్రభవించు దేవకీ
నందనుసత్కథోద్యమము ♦ నవ్యకవిత్వకళాకలాపమర్
కుందనముఁ ఘటించి కడుఁ ♦ గ్రొత్తగు సొమ్మొనరించి విష్ణుసే
వందిలకించు నప్పరమ ♦ వైష్ణవకోటి నలంకరింపుమా. 26

మ. ఉదయం బస్తనగంబు సేతువు హిమ♦వ్యూహంబు సం జుట్టిరా
విదితంబైనమహిన్ మహాంధ్రకవితా♦విద్యాబలప్రౌఢి నీ
కెదు రేరీ? సరసార్థబోధఘటనా♦హేలాపరిష్కారశా
రద నీరూపము రామకృష్ణకవిచం♦ద్రా! సాంద్రకీర్తీశ్వరా! 27

వ. అని సంభావించి కనకాంబరాభరణంబులం బ్రసాదించి యాప్రధానపంచాననుండు. 28

మ. పలుకుందొయ్యలిమాళికాంతి కెనయా♦ బాగాలు నయ్యింతిచె
క్కులఁబోలుం దెలనాకు లయ్యువిదప♦ల్కుల్వంటికప్రింపుఁబ
ల్కులతోఁగూడినవీడియం బొసఁగె నా♦కుం బద్మనాభార్చనా
కలనాపావనహస్తకంకణఝణ♦త్కారంబు తోరంబుగన్. 29

వ. ఇట్లు లోకోత్తరగుణోత్తరుండగు నాప్రధానశేఖరుండు పరమపురుషపరికరచరిత్రంబునకు నధీశ్వరుండగుట తీర్థంబును స్వార్థంబును జాదులుం దేవరప్రసాదంబును పుణ్యంబునుం బురుషార్థంబును నన్యోన్యాభ్యుదయంబునకుం గల్యాణాచారంబుగాఁ గృతిపతివంశావతారం బభివర్ణింపఁబూని. 30

సీ. మిగులఁ గన్నొదవిన♦బిగువ మెక్కుడుగాని
కరుణాకటాక్షవీ♦క్షణమువాడు
దంష్ట్రావిటంకవ♦ర్ధనమ మెక్కుడుగాని
ముద్దుఁజందురునేలు♦మోమువాఁడు
నరమృగదేహవి♦స్ఫురణ మెక్కుడుగాని
బహుకోటిమదనరూ♦పంబువాఁడు
దైత్యుదండించును♦ద్ధతియె మెక్కుడుగాని
శ్రితజనావళులర♦క్షించువాఁడు
నాఁగ గరుడాద్రిసింహాస♦నమున నుండి
మెల్లజగములనేలు ళ♦క్ష్మీశ్వరుండు

శ్రీయజ్ఞేశ్వరబలనరసింహ ♦ నాయకుండు
శరమరనగోత్రమంత్రి ర ♦ క్షణమొనర్చు. 31

చ. జరర వసత్ప్రపంచసుర ♦ సత్తమతుల్యుఁ డశేషయోగిరా
ణ్మత్రహృదయుండు మానిజన ♦ మాన్యుఁడు ధన్యుఁడు ముక్తికామినీ
కఠినకుచద్వయీనిహిత ♦ కాంచనమాలిక హేళికల్పుఁ డా
శరమరణార్చి శేఖరుఁ బ్ర ♦ శంస యొనర్పఁదగుం జగంబులన్ 32.

శా. ఆవాచంయమవంశసాగరమునం ♦ దవ్యాహతైశ్వర్యల
క్ష్మీవంతుండు విరూరికర్త సచివ ♦ శ్రేష్ఠుండు విద్యాహయ
గ్రీవుం డన్నయమంత్రి యవ్విభుని స ♦ త్కీర్తుల్విజృంభించు నీ
ద్యావాపృథ్వ్యవకాశ పుంఖితనిజ ♦ వ్యాపార పాకీణతన్. 33

ఉ. ఆసచివావతంసము కు ♦ లాంగిన చెల్వగులక్ష్మమాంబ గౌ
రీసతియో యరుంధతియొ ♦ రేవతియో యల యాదిలక్ష్మియో
వాసవు రాణియో యనఁగ ♦ వాసియు వన్నెయుఁ గల్గికీర్తులన్
జేసిన మూర్తి మేలు పతి ♦ చిత్తము వచ్చినసచ్చరిత్రలన్. 34

ఉ. అన్నయ లక్ష్మమాంబ సుతు ♦ లర్థినిధానము తిప్పరాజు సం
పన్నుఁడు రంగరాజుఁ బ్రతి ♦ భానిధి గుండమరాజుఁబోల్చి రా
సన్నుతభాగ్య వర్ధనుల ♦ సన్మతి శౌర్యము ధైర్యము న్నయా
భ్యున్నతి నీతిరీతి జయ ♦ మొప్పును నేర్పును నెన్న శక్యమే! 35

క. ఆముగ్వురిలో రంగసు
ధీమణి దీపించె వంశ ♦ తిలకంబగుచున్
శ్రీమహిత గంగమాంబా
రామా రమణీయరాగ ♦ రసరంజితుఁడై 36

క. ఆరంగరాజు కీర్తులు
శ్రీరంగ నివాసహాస ♦ శివకరలక్ష్మిం

జేరంగ దిగుచునహితులఁ
బారంగా నెగుచునతని ♦ బాహాసి యనిన్ 37

సీ. శ్రీమదష్టాక్షరీ ♦ సేవైకనిపుణుండు
గీతార్థసారసం ♦ కేతవేది
పరిచితదివ్యప్ర ♦ బంధసంధానుండు
మహితసౌదర్శన ♦ మనువిదుండు
వితతప్రభాసిత ♦ విజ్ఞానకోవిద
నిజసమయావన ♦ నిపుణబుద్ధి
సరసరామాయణ ♦ సప్తకాండజ్ఞాత
యాళవందారుస్త ♦ వాభిశోభి

గీ. సలిలనిధిజాల జంఘాల ♦ జలవిశాల
ధూళిపాళీభరాళీక ♦ ధూమభూమ
శంకితాత్మప్రతాపవై ♦ శ్వానరుండు
గంగమాప్రాణవిభుఁడొప్పు ♦ రంగరాజు. 38

తే. దశరథేశ్వరు భార్యయై ♦ ధన్యమహిమ
మున్ను కౌసల్య శ్రీరాముఁ ♦ గన్నకరణి
రంగయామాత్యు సతియైన ♦ గంగమాంబ
మతిమరుసన్మంత్రి శ్రీరామ ♦ మంత్రి గనియె. 39

క. ఆరామరాజు వాహిని
వారాన్నిధులేదు దాఁటె ♦ వసుమతి మున్నే
శ్రీరామరాజు వాహిని
వారాన్నిధులేదు దాఁటి ♦ వర్ధిలునవలన్ 40

సీ. పుడమిపై నడనేర్చి ♦ యడుగుబెట్టెఁడునాఁడె
ధర్మంబునాల్గుపా ♦ దములనిలిపె
బిలిబిలిపలుకులు ♦ పలుక నేర్చిననాఁడె
సత్యభాషాహరి ♦ శ్చంద్రుఁడయ్యె

వరుసమీఁదటివార్లు ✦ వ్రాయనేర్చిననాఁడె
కమిచి దిక్కులజయాం ✦ కములు వ్రాసె
ముఖ్యవర్తనస్ఫూర్తి ✦ ముంజిఁ గట్టెడునాఁడె
కవులఁబ్రోచుటకుఁగం ✦ కణముఁగట్టె

గీ. సంబమాంబిక గళ్యాణ ✦ మైననాఁడె
వాసిగలకీర్తిలక్ష్మికి ✦ సేసవెట్టె
ధైర్యహేమాద్రిప్రజ్ఞశాం ✦ తనవుమాద్రి
రంగయామాత్యవరుని శ్రీ ✦ రామమంత్రి.

సీ. సంహృతాంహస్స్ఫూర్తి ✦ సింహాసనుండు నృ
సింహవిక్రముఁడు నృ ✦ సింహశౌరి
త్రయ్యంతవాసనా ✦ గ్రహబుద్ధి నొయ్యారి
యొయ్యారిరామాను ✦ జయ్యగారు
గంగాతరంగసా ✦ రంగలాంఛనదీప్తిఁ
బొంగుకీర్తికి రాజు ✦ రంగరాజు
శరణాగతత్రాణ ✦ కరుణాచరణకేళి
వరదరాజులఁబోలు ✦ వరదరాజు

గీ. ననఁగ శ్రీరామవిభునికి ✦ సంబమకును
గలిగి రాచంద్రతారార్క ✦ గతిఁబ్రశస్తి
నలువురాత్మజు లౌదార్య ✦ సలిలనిధులు
భుజగశాయికి నాలుగు ✦ భుజములట్లు. 42

గీ. అందు నగ్రజుఁ డఖిలవి ✦ ద్యావినోది
శ్రీనృసింహాఖ్యసన్మంత్రి ✦ సింహమలరు
లీల లక్ష్మమ్మ తనకుని ✦ ల్లాలుగాఁగ
జెలఁగె లక్ష్మీనృసింహు వి ✦ శేషముద్ర. 43

క. శ్రీనరసింహుని లక్ష్మీ
మానవతికి వెంగళాఖ్య ✦ మంత్రీశ్వరుఁడున్

గోనప్పయు నవఁదగువి
ద్యానిధులిరువురును బుత్రు • లై మని రవనిన్. 44

క. నయ వినయంబుల కైవడి
జయతేజములట్లువిభవ • శమముల క్రియ న
వ్యయయశులు వెంగళయు కో
నయ లిరువురు వెలసి రవని • నాథార్చితులై. 45

క. ఆవెంగళ మంత్రీశ్వరు
దేవికి శ్రీయాభశాఖ్య • తిలకవతికి రా
ఘావిభుదేవేరియు నల
కావేరియు నీడుజోడు • గౌరవ కళలన్. 46

క. గానకళాతుంబురుఁ డనఁ
గా నయవిద్యావివేక • గౌరవలక్ష్మీ
జాని యనంగా నిద్ధరఁ
గోనప్రభుఁ డొప్పుమంత్రి • కులతిలకంబై. 47

తే. ఆ విదేహాధిపతిపుత్రి • యాత్మభార్య
గాఁగ విఖ్యాతిఁబొందు రా • ఘవునికరణి
రాఘవాంబాధినాథుఁడై •శ్లాఘమీరు
శ్రీనృసింహునికోనప్ప • సిరులకుప్ప. 48

ఉ. సామజరక్షణుం గొలిచి • సన్నుతికెక్కినభాగ్యశాలి శ్రీ
రామచమూపశేఖరుని • రంగనమంత్రి ననంతమాంబికా
స్వామి నుతింతు మన్మథభు • జానతపుష్పధనుర్మహాళిధా
రామధురోక్తిగుంభనభ• రస్ఫురణాపరిణాహచాతురిన్. 49

చ. ఉరుమతి రంగమంత్రితన • యుల్ విలసిల్లిరి ఫుల్లమల్లికా
హారదరహాసహీరహిమ • హారపటీరయశోధురంధరుల్
వరదయగల్గువారు గుణ•వంతులు శాంతులు కాంతిచంద్రముల్
వరదయమంత్రిపుంగవుఁడు• వాసవతుల్యుఁడు రాఘవయ్యయున్

క. రంగయవరదామాత్యు వి
హంగమవిభు గమనభజన • హంసధ్వజు సా
రంగధరహారనిభవా
గ్గంగాశృంగారితాస్యు • కమలు నుతింతున్. 51

సీ. సమకూర్పఁగా నేర్చు • సకలవైష్ణవశాస్త్ర
సిద్ధాంతశుద్ధాంత • సిద్ధిగరిమ
హావణింపఁగా నేర్చు • నఖిలావనీచక్ర
సామ్రాజ్యపూజ్య వి • శాలలక్ష్మి
వలపింపఁగా నేర్చు • వాలారుఁజూపుల
కోపులు చూపు చ • కోరదృశలఁ
బాలింపగా నేర్చు • బాంధవకవిగాయ
కార్థార్థినివహంబు • ననుదినంబు
గీ. దండనాథునిమాతృఁడై • దశదిశావ
కాశసంపూర్ణవిజయప్రకాశశాలి
రంగయామాత్యువరదయ్య • ప్రకటశౌర్య
ధారి వాచా ధరాధర • ధారిశయ్య. 52

క. తిమ్మాంబ యక్కమయు వర
దమ్మయు వరదప్పభార్య • లై వెలసిరి తే
జమ్మున శక్తిత్రయమువి
ధమ్మున సకలోన్నతప్ర • ధాప్రథితమతిన్ 53

ఉ. మున్నొకరాఘవుండు తల • మోచిభజించు విభీషణాదులన్
మన్ననఁబ్రోచె గాఁచెవను • మాటలె కాని గుణప్రసన్నతన్
బన్నదనంబుఁ జూపఁగల • రంగయరాఘవమంత్రి నిచ్చలున్
వన్నెకుఁదెచ్చునిచ్చు నభి • వాంఛితవస్తువు లర్థికోటికిన్. 54

క. తేజమున రాఘవునియం
భోజేక్షణతిమ్మమాంబ • పోల్పందగునా.

రాజీవవదనశారద
రాజాగ్రకిరీటపూర్ణ ♦ రాజనిభాస్యన్. 55

క. శ్రీరామమంత్రివరద సు
ధీరత్నము కులవధూటి ♦ దీపించుయశో
దారమణిరమణవిష్ణు
శ్రీరంజితకొండమాంబ ♦ చిరపుణ్యమునన్ 56

క. ఆదంపతులకుఁ గలిగిరి
గాదిలిసత్పుత్రవరులు ♦ గనుగొండనయున్
శ్రీదనరు నౌబళయ్యయు
వేదస్మృతిజాయమాన ♦ వినయనయగతిన్ 57

క. కనుగొండ యితనిధైర్యము
పెనుగొండగు నవనినెదిరి ♦ భీతిఁబరఁగ వే
చనుఁ గొండల కనగాఁ దగు
కనుఁగొండయె నాగమాంబ ♦ కావల్లభుడై. 58

ఆ. అతనిసోదరుండు ♦ మతికళాజంభారి
గురుడు బంధులోక ♦ సురభి వెలయు
నౌబళాఖ్యమంత్రి ♦ యౌబళా! యీతని
జయమునయమునంచు ♦ జనులు బొగడ 59

ఉ. ఇమ్మనవద్యహృద్యసము ♦ దీర్ణగుణాళికిఁ గల్పవృక్షపుం
గొమ్మనవీనదానగుణ ♦ గుంభనసంభృతిఁబద్మనాభుఁగ
న్నమ్మన రామరస్తుతజ ♦ యస్థితి కౌబళమంత్రిభార్య యౌ
నమ్మమ యమ్మదద్వరద ♦ యానకు నేసతు లీడుధారుణిన్ 60

వ. ఏవంవిధాన్వవాయ పయఃపారావారంబునకుఁ దారకాళమనాకృతియగుకృతిపతి తెఱంగెట్టిదనిన 61

ఉ. మానితరాజితద్యుతిస ♦ మంచితమోహనమూర్తి వైష్ణవ
జ్ఞానపరాయణుండమృత ♦ సాగరరాజగభీరుఁడర్థిసం

తానసురద్రుమంబతఁడు • దానన నానత శాత్రవుండు రా
మానుజమంత్రి వర్ధిలు మ • హామహుఁడై నిజవంశకర్తయై. 62

సీ. కతపత్రమిడవచ్చుఁ • గలఁగాంచునపుడైనఁ
గోరికఁ బరకాంత • గోరఁడనుచు
ముడియవైవఁగ వచ్చు • మొనదారసించిన
శూరత్వమున వెన్ను • చూపఁడనుచు
దిబ్బె మెత్తఁగవచ్చు • నుబ్బురంబగుకల్మి
మేరమీఱినరీతి • మెలఁగఁ డనుచుఁ
జేసాఁపఁగావచ్చు • శివుమీఁద నేనియు
బూనిక తోఁబల్కి • బొంకఁడనుచు

గీ. జలధివలయితవసుమతీ • స్థలవతంస
భాసురాంశ సమాశ్రిత • ప్రౌఢకీర్తి
శరమఠనగోత్ర భవమంత్రి • చక్రవర్తి
యైనరామాను జయ్యకు • నైకడంగి. 63

శా. రాధానాథపదాబ్జభృంగ మగు నా • రామానుజామాత్యుతే
జోధారావళి భానుభానుపమం • జూపట్టు మిత్రాంబుజో
ద్బోధంబుం బ్రతిపక్షకైతవనిరు • ద్బోధంబు నిర్వాంక్రియా
సాధుత్వంబు వహింపదుర్గమతమ • స్సంబాధముల్ జూఱఁగన్ 64

క. కామగవీ సురతరువులు
వేమాఱును నిచ్చుఁ దవులు • విడిబేరముగా
రామానుజయ్య దాన
పామాఁశికముదరి కొంగు • బంగారమగున్ 65

శా. ఆర్యామానుజమంత్రిచంద్రుఁడు వివా • హంబయ్యెనెయ్యంబుతో
భారద్వాజ పవిత్రగోత్రనిధికిన్ • బల్పాటి కన్నయ్యకున్
గారామైన కుమారికాతిలకమున్ • గౌరీధరాశారదా
మారామాపర మప్రసిద్ధమతి న • మ్మాక్షజమ్మఁ దేజంబునన్ 66

సీ. తోడవులు పెక్కులు ♦ దోడవియుండెనేకాని ♦
సత్యంబు తనకు ని ♦ జాలతోడవు
చుట్టాల సురభియై ♦ సొబగు నొందెనేకాని
నెనరైన చుట్టంబు ♦ దనకుఁ గీర్తి
కులదైవతం బహో ♦ బలనాధుఁ డనేకాని
పతిమూర్తి పరమదై ♦ వతము తనకుఁ
జక్కఁదనంబులు ♦ సహజంబు లనికాని
తనచక్కఁ దనము వ ♦ ర్తనమునంద
గీ. యనఁ గవిలసిల్లె నిఖలవి ♦ ద్యారహస్య
పరమవిజ్ఞాన పాండిత్య ♦ భద్రమూర్తి
విప్రసురశాఖ రామాను ♦ జప్రధాన
మౌళి యర్ధాంగలక్ష్మియ ♦ మ్మాజయమ్మ. 67

క. ఇమ్మహి రామానుజవిభు
నమ్మాజమ్మకు జనించి ♦ రబ్జభవముఖా
బ్జమ్ములఁ బోలినసుత ర
త్నమ్ములు నల్వురునుదార ♦ తాజిత శరధుల్ 68

సీ. మదేభశనిభసము ♦ న్నిద్రశౌర్యోద్రేక
విద్యావితారి వే ♦ దాద్రిశౌరి
విష్ణుపదధ్యాన ♦ నిష్ణాతవిజ్ఞాన
కృష్ణుండు శ్రీరామ ♦ కృష్ణమంత్రి
శరశరచ్చంద్రికా ♦ హారహీర హిమహీర
కరకీర్తి వర్షశయ్య ♦ తిరుమలయ్య
పక్ష్మలితత్యాగ ♦ లక్ష్మీకరోద్యోగ
లక్ష్మలక్షిత మూర్తి ♦ లక్ష్మణుండు
గీ. ననఁగ వెలసిరి రామాను ♦ జయ్యసుతులు
దశరథక్షోణి పాలనం ♦ దనసమృద్ధి

ద్వైనతేశమ దావళ ♦ దంతరేఖ
నురగిపర్యంక నిజచతు ♦ ర్వ్యూహలక్ష్మి. 69

ఉ. ముద్రితనైరి నప్త్రులగు ♦ ముప్వురుతమ్ములుఁ బంపు సేయ వే
దాద్రివిహారి మందిరుఁ డ ♦ హర్పతితేజుఁడు రాజిలుఁ యశో
భద్రుఁడు రామభద్రుని ప్ర♦భావనయుఁ గురుభక్తియుఁ బ్రతా
పద్రవిణప్రసిద్ధి యును ♦ బంధుజనంబు ప్రియంబు సేయఁగా 70

సీ. పట్టైవటుప్రియును ♦ బరిపుష్టి తలకట్టు
గుడిసున్నకియ్యయు ♦ సుడియుముడియు
నైత్వంబు నెత్వంబు ♦ నందమందంబు
గిలకయు బంతులు ♦ నిలుపు పొలుపు
నయమునిస్సందేహ ♦ తయు నొప్పమురుపును
దిద్దివేసినయట్ల ♦ తసరుటయును
షడ్వర్గశుద్ధియు ♦ జాతియోగ్యతయును
వృద్ధిప్రియంబును ♦ విశదగతియుఁ

గీ. గీలుకొన వ్రాయసంబులు ♦ వ్రాయువ్రాయ
గొంకుకొనరును జేతప్పు ♦ గొనకయుండు
లలితముక్తాఫలాకార ♦ విలసనమున
మతిమరుచ్ఛాంత్రి వేదాద్రి ♦ మంత్రివరుడు. 71

తే. మాద్రిమీరువిరూరి వే ♦ దాద్రిరాజు
దానధారార్ధ మఖిలప్ర ♦ ధానసదుల
వెచ్చపెట్టుటఁదలఁకియో ♦ విబుధతటిని
తరుణశశిమాళి జడలలో ♦ డాగియుండు. 72

ఉ. చేతులఁదిప్పుచుఁ బ్రభుల ♦ చెంతల నూరక దుర్వినీతులై
యేతులఁజోవుచుఁ దిరుగు ♦ నిప్పటిమంత్రులుతంత్రులిందఱుఁ
భూతలకల్పవృక్షముఁ బ్ర ♦ భూతగుణాఢ్యుని సర్వలోకవి
ఖ్యాతు వినీతు వేదగిరిఁ ♦ గాతరచిత్తులుపోలనేర్తురే. 73.

సీ. కరుణించి చూచెనా ♦ కవిగాయకార్థార్థి
నివహగేహంబుల ♦ నెరయు సిరులు
కోపించి చూచెనా ♦ కొండతో నెనవచ్చు
ననవచ్చునతఁడైన ♦ నవని దూఱు
మెచ్చి మన్నించెనా ♦ మెదుకపాలసుఁడైన
దొరతనంబున నిల్చి ♦ పరిభవించు
బొందుగావించెనా ♦ భువి నెట్టిఖలునకు
నాదటకరుణాప్తి ♦ పాదమొసఁగు
గీ. మంత్రిమాత్రుండె దుర్మంత్రి ♦ మథనకథన
చారుచర్యాచమత్కార ♦ చక్రవర్తి
యగ్రనిభుఁడు విగూరివే ♦ దాద్రి రామ
భద్రపాదసరోరుహ ♦ బంభరంబు. 74

మ. జలజాక్షాంఘ్రిసరోజషట్పదము వి ♦ శ్వామిత్రగోత్రోద్భవుం
డలఘుప్రాభవుఁ డర్థిలోకసులభుం ♦ డై కీర్తిఁ జెంపొందు నా
కలకాళాస్తితనూభవక్ సుగుణల ♦ క్ష్మీక్ దిరమ్మలాంబస్ప్రభల్
వెలయంగా కులకాంతఁజేసి వెలసెక్ ♦ వేదాద్రి భద్రోన్నతిక్. 75

సీ. వృషభేంద్రగమనుఁ డీ ♦ వేదాద్రినాథుండు
గిరిరాజతనయ యీ ♦ తిరుమలాంబ
వేదనిశ్వాసుండు ♦ వేదాద్రినాథుండు
ధృతి శారదాంబ యీ ♦ తిరుమలాంబ
విహగేంద్రగమనుఁ డీ ♦ వేదాద్రినాథుండు
శరధితనూజ యీ ♦ తిరుమలాంబ
విబుధాధినాథుఁ డీ ♦ వేదాద్రినాథుండు
ధర శచీదేవి యీ ♦ తిరుమలాంబ
గీ. యనఁగ ననుకూలదాంపత్య ♦ వినుతమహిమ
మారువుదీపించె నౌర వే ♦ దాద్రివిభుఁడు

హరియశుఁ డైనకలకాళ • హస్తితనయ
తిరుమలాంబయు నిత్యవ • ర్ధిష్ణులక్ష్మి 76

సీ. వేదమార్గప్రతి • ష్ఠాద్వైతజ్యేష్ఠుఁ
డభ్యస్తషడ్దర్శ • నార్థరాశి
యతిరాజరచితభా • ష్యగ్రంథనిష్ణాత
యఖిలపురాణేతి • హాసకర్త
బంధురదివ్యప్ర • బంధానుసంధాత
పంచసంస్కారప్ర • పంచచణుఁడు
వాధూలమునిచంద్ర • వంశవర్ధనమూర్తి
సకలదేశాచార్య • నికరగురువు

గీ. పట్టమేనుంగు శ్రీరంగ • పతికి నణ్ణ
గారిగర్భాంబురాశినీ • హారరశ్మి
సారసాహిత్యసర్వస్వ • శయ్య నేటి
యాళవందారుకంగాళ • యప్పగారు. 77

శా. తత్తాదృగ్విభవప్రభావనిధిఁ గం • దాళప్పగారి న్దయా
యత్తస్వాంతు నితాంతశాంతియుతు లో • కాచార్యవర్యు న్సుధీ
చిత్తాంభోరుహభానుఁ గొల్చుచుఁ దదా • శీర్వాదలబ్ధోన్నతిన్
హత్తిన్ దానువిగూరి మంత్రిమణి వే • దాద్రీశుఁ డుద్యద్రుచిన్ 78

వ. వెండియు నవ్వేదాద్రిమంత్రీశ్వరుండు రవికులతిలకుండును రణరంగధీరుండును నంబునిధిగంభీరుండును భట్టరభావాంకుండును నకలంకుండును నవత్తారుమాండలీకరగండుండును నుద్దండభుజాదండుండును నైన పరనారీసహోదరుండయ్యును నితరసముపార్జితవధూవల్లభుండును గోపికాగోవిందుండయ్యు నీశ్వరలక్షణలక్షితుండును బొన్నాంచారుదేవి దివ్యశ్రీపాదపద్మారాధకుండయ్యును బ్రతిష్ఠాపిత పరమవైష్ణవకుటుంబవిశేషుండును నైన ఘనుని. 79

గీ. గుఱుతుగలరాజు మంగయ • గురవరాజు
పుత్త్రి పెదసంగభూపాల • శత్రుజైత్రు

భానుసమతేజు విద్యావ ♦ ధానభోజుఁ,
గొల్చి వేదాద్రి నిత్యల ♦ క్ష్ములఁ దలిర్చు. 80

మ. విభవేంద్రుఁడు వీరూరిశాసనమహా ♦ విఖ్యాతి రామానుజ
ప్రభు వేదాద్రి లిఖించువ్రాయసము లా ♦ రా! పెద్దసింగావనీ
విభుచిత్తంబు నెఱింగి గంటమురవల్ ♦ విద్యావధూనూపుర
ప్రభవప్రౌఢఝుళంఝుళారభటిసౌ ♦ భాగ్యంబుఁ గల్పింపఁగన్. 81

చ. అతనిసహోదరు ల్వెలసి ♦ రార్యగుణాఢ్యులు రామకృష్ణుఁ డా
యతభుజశౌర్యుఁడౌ తిరుమ ♦ లయ్య విచక్షణ భవ్యసత్కళా
చతురుఁడు లక్ష్మణయ్యయు ర ♦ సాతలనూతనకామధేనువుల్
చతురపథావిధాననయ ♦ సాంద్రులు చంద్రులు కాంతిసంపదన్. 82

గీ. ధర్మనిర్ణేత వేదాద్రి ♦ కూర్మితమ్ముఁ
డైన శ్రీరామకృష్ణప్ర ♦ ధాని వెలసె
లక్ష్మమాంబాధినాథుఁడై ♦ లక్ష్మితోడ
నాదినారాయణునికృప ♦ ననుదినంబు. 83

క. ఇంతిం దిరుమలమంత్రియు
నంతమఁ గొనియాడవలయు ♦ హరిహయనగర
ప్రాంతోపవనలతాంతా
నంతమరందస్రవంతి ♦ కాంచితసూక్తిన్. 84

క. ఆలక్ష్మణమంత్రీశ్వరు
లీలావతి వెంగళాంబ ♦ లేఖవిభువధూ
పాలితనానావిధల
క్ష్మీలక్షణశోభి విభవ ♦ కీర్తుల వెలసెన్. 85

క. సోదరులు సుతులు సతులును
వేదోదితమార్గచర్య ♦ వినయము నయమున్
శ్రీదాంపత్యము నెసఁగఁగ
వేదాద్రి మహాప్రధాని ♦ వెలయుం గృతులన్. 86

## షష్ఠ్యంతములు.

క. ఏవంవిధగుణమణిఖని
కావిర్భవదురుకృపాక • టాక్షజనికి ల
క్ష్మీవల్లభచరణాంబుజ
సేవాహేవాకశీల • శీలనమునికిన్. 87

క. అంధకరిపుగంధద్రుమ
గంధాంధద్విపవిపక్ష • గరుడత్త్రోటీ
బాంధవబంధూకీర్తిసు
గంధిలభువనత్రయునకు • ఘనవినయునకున్. 88

క. చతురుదధివలయవలయిత
కుతలభరణకరణభుజున • కును సుజనునకున్
నుతిశాలికి జితశౌరికి
హితకారికి సమదగమన • హేలాకరికిన్. 89

క. వాణీనఖముఖ ముఖరిత
వీణానిక్వాణ పల్ల • వితనూత్నసుధా
ప్రాణసఖ లేఖనీకల
రాణున కాచరితభూసు • రత్రాణునకున్. 90

క. సంధారఘుపతికి వృష
స్కంధున కైదండయొసగిన • కర్ణునకు సమి
న్మాంధాతకు బాంధవశుభ
సంధాతకు ధాతకును వృ • షభగమనునకున్. 91

క. భీమక్రోధాంధవిమత
సీమంతవతీలలామ • సీమంతమణి

స్తోమాపాకరణపటు
శ్యామల తరవాలజయన ♦ హయభుజునకున్. 92

క. రవికి రణరుచికి మతిభా
రవికి విమతసచివ గళిత ♦ రవపదభూషా
రవికి భుజాంతరమణిహా
రవికిని రుచిరాకృతికి ధ ♦ రాశ్రుతికృతికిన్. 93

క. రామానుజార్య సుతునకు
శ్రీమంతున కర్థిసార్థ ♦ జీమూతహయ
స్తోమోన్నతికి విరూరి
శ్రీమద్వేదాద్రి మంత్రి ♦ సింహంబునకున్. 94

---

## కథాప్రారంభము

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన పౌండరీక మాహాత్మ్యంబునకుం గథావిధానం బెట్టిదనిన. 95

మ. తులితోక్షధ్వజసూతుఁడై వెలయుసూ ♦ తుంగాంచిమునుల్ శౌనకా
దులు క్షేత్రంబును వేల్పుఁదీర్థము బుధ ♦ స్తుత్య ప్రభావంబులై
దళితైనస్తిమిరంబులై యిహపరా ♦ ర్థ ప్రాప్తి మూలంబులై
యిలపై నొక్కెడఁగల్గనే ననఘమూ ♦ ర్తీ! తెల్పవే! నావుడున్. 96

క. ఆఋషుల ప్రశ్న మంగీ
కారంబొనరించి పలుకుఁ ♦ గథకుఁడు శ్రీనా
థారాధనహితచర్యుం
బారాశర్యుం దలంచి ♦ ప్రాంజలియగుచున్. 97

వ. మహాత్ములారా! యీపురావృత్తంబు తిరిరావృత్తంబుగా నుత్తమశ్లోకుండగు కృష్ణద్వైపాయనునవలన మున్నెఱింగిన యది కల దత్తెఱం గఖిలంబును మీయంతరంగంబులకువచ్చునట్లుగావిన్నవిం చెదవినుండని సూతుండిట్లనియె. 98

శా. శీతాహార్యసుతాళిసీ వికచరా • జీవంబు విశ్వేశ్వర
జ్యోతిర్లింగ విశుద్ధరత్నఖని మో • క్షోపాయదుగ్ధాబ్ధివే
లాటీరావనిమండి నామకగజా • లానంబు గంగామృత
స్రోతోనిస్సృతి చంద్రగోళమన మిం • చుఁగాశి శ్రీరాశియై.99

శా. ప్రాలేయాచలకన్యకావదనశుం • భత్పద్మసౌరభ్యముఁ
గ్రోలంగల్గియుఁ దృప్తిలేక మునిహృ • త్క్రీడాబ్జసౌగంధ్యలీ
లాలౌల్యముఁ గోరునొక్కసితరో • లంబంబు నైజాకృతిఁ
డాలొందించుఁబరాసులఁ భ్రమరకీ • టన్యాయరీతిఁ బురిఁ.100

సీ. ఒకనాఁడు తీర్థోప • యోగిగానిశరుండు
నౌదల ధరియించు • నభ్రగంగ
నాప్రొద్దుపోయిరాజ • నట్టినిర్వేదయు
భోగించు నైశ్వర్య • ము లెనిమిదియుఁ
బుష్కరాక్షులపొంతఁ • బోని వస్త్రధరుండు
దేహార్ధమునఁదాల్చుఁ • దీఁగఁబోఁడి
నాయుధపరిభఁ గాంచి • యలఁగుభీరువుఁ బూను
వాఁడిమొనల • వేఁడియలుఁగు
గీ. మలినవర్తనుఁడును సుధా• లలితమూర్తి
మించి వర్తించుమతి లేని • మేదకుండు
మానివర్యులఁ జదివించు • మట్టినీడఁ
బంచముఖుపీఠ మే నోస • రించెనేని. 101

క. ఆనంద కాననంబున
నానందకపాణి కేశ • వాహ్వయమునఁ బెం

పానం దగుము క్త్రప్రమ
దానందిత హారనీల ♦ తరళోపముఁడై. 102

సీ. శ్రీకరోదయ వధూ ♦ లోకాననప్రభా
నాటిత బహుచంద్ర ♦ నాటనంబు
సమ్మార్గగళితభూ ♦ షణరత్న మంజరీ
యోజితరథ్యా ప్ర ♦ పూజనంబు
కైలాస శైలసంకాశ ♦ సౌధనివేశ
కౌముదీకవచిత ♦ గగనతలము
విస్తీర్ణవిపణివి ♦ న్యస్తవస్తువ్రజ
ప్రకటిత రత్నాగ ♦ ర్భాజఠరము

గీ. విపుల పవమాన తాండవ ♦ వేపమాన
లాంఛనధ్వజ పట్టప ♦ ల్లవ లలామ
మాళిరచితకశాకృత్య ♦ హేళిహయము
దీపితంబగు శ్రీకాశి ♦ కాపురంబు. 103

చ. జలజపరాగ రాగరస ♦ సంగతమౌ పరిఖాజలంబులోఁ
పలఁబ్రతిబింబితంబులగు ♦ బంగరుకోటకుఁ బెట్టినట్టికొ
మ్మలచెలువంబునన్ బురిర ♦ మారమణీమణియొప్పురావియా
కులమొలనూలు పెట్టెననఁ ♦ గోరి కనుంగొనువారు మెచ్చఁగన్. 104

క. పెరిగినత్రివిక్రమేశ్వరు
చరణతులాకోటి యతఁడు ♦ సంప్రాప్తదేహా
స్ఫురణుండగునపు డూడిన
కరణిం బురికోట యొప్పు ♦ గనకమయంబై. 105

చ. పరిఘునిజాశ్రయంబుపరి ♦ పాటిఁ దలిర్పఁబదారువన్నెబం
గరుపున నైనరాజగృహ ♦ కల్పనకగ్నికగాఁగ గంధసిం
ధురములు తేటులై మొరయఁ ♦ దోరపుఁగొమ్మలు తేకు లట్లుగా
ధరయనుకొల్మిలో మెలఁచు ♦ దామరపూవనఁగోట మీటగున్. 106

క. పురి రాకొమరుల కీర్త్యం
బరవాహిని భుజగపురికిఁ ♦ బలువిడి జని యం
దిరవుకొన నెడముచాలమి
మరలినతటి బుగ్గలన న♦ మరు సౌధంబుల్. 107

ఉ. నాకనదీప్రదీప్తపులి ♦ నంబుల నిచ్చలు నిల్చినమ్మనుల్
సైకతలింగపూజనము ♦ సల్పుతరిన్ రవణించుతత్పతా
కాకలకింకిణీరవము ♦ ఘంటలుమ్రోఁగుట ధూపధూమముల్
పైకొలుపు న్నమర్త్యగతి ♦ బర్వెడుగుగ్గులుధూపధోరణిన్. 108

చ చదువులపుట్టినిండ్లు శమ ♦ సంపదయిక్కలు పుణ్యలక్ష్మికిన్
మొదలిదివాణము ల్సురస♦ మూహమునాఁకటిపంట లంచితా
భ్యుదయనిసర్గబంధువులు ♦ ప్రోడతనంబులతాణము ల్పురిన్
బొదలెడిభూసురోత్తముల ♦ భూరిపవిత్రిశరీరవల్లరుల్. 109

ఉ. పుట్టిననాటనుండియును ♦ బుఃఖ్యలు సత్యలమొందునంతకున్
బట్టినకార్యమీశ్వరుఁడు ♦ పట్టిన నీనిదృఢప్రతిజ్ఞ తే
పట్టున ధర్మముల్విడని ♦ ప్రాజ్ఞులు తద్జ్ఞులపాలివేలుపుం
జెట్టులుపోరనైదుపది ♦ సేయనిశూరులు వీటిరాసుతుల్. 110

గీ. బలయురత్నాకరములు సం ♦ చుఃబుగఁ జేసి
పొదివినిధులెల్లఁగొని సంచి♦ మొదలుచేసి
బేరమాడెడిపాటియు ♦ దారలక్ష్మి
బచ్చు లప్పురినున్నారు♦ పెచ్చుపెరిగి. 111

క. హారమాళిహీర మచ్యుత
చరణాబ్జమరందధార ♦ జాహ్నవి లోకే
శ్వరి త్రమసోదరి యానఁట
పురి వెలమలభాగ్యమహిమ♦ పొగడఁగ వశమే. 112

ఉ. భూమియునాకసంబుఁ దమ♦ పొంకమున న్బిగియించుతత్పురీ
ధామజకోటియున్నతికి ♦ సర్వజగంబులగల్గునున్నతుల్

భూమము డింది వామనతఁ ♦ బూనఁగలేదె ధరాదిశుల్ సేనఁగ
వామనమంచునాడఁ దగ♦వా? తగవాడరుగాక భూజనుల్. 113

చ. కెరలక క్రిమ్మరింప నడు♦ గెంటనె నిల్చినోకింత నూకినన్
శరనిధు లేదుదాఁటు మెయి♦ చాఁచి చివుక్కున నుక్కుమీరి సం
గరమున గాయమైనపతిఁ♦ గాచుఁ జలింపక తత్పురీహరుల్
హరిహయుమావుముండిగిన♦యంబుధి రేవునవచ్చెనో సుమీ. 114

ఉ. సారథి ఛాందసుండు బడి సాగదు ♦ చక్రియుగంబు ప్రాఁతపం
చారపుగుజ్జుము లగ్నియు ♦ శౌర్యముసం దరమాని సాత్త్వవి
స్తారము ఖండఖండములు ♦ తానటు మాసరియంచుఁ దత్పురిం
దేరులు నవ్వ శంకరుని♦ తేరని గేతపకింకిణీస్వనిన్. 115

క. వేటారుతునియలుగ నరి
పాటన మొనరించుబాహు ♦ పాటవగరిమన్
మేటులగుపోటుమగ ల
వ్వీటన్ విహరింతు రుగ్ర ♦ విక్రములగుచున్. 116

సీ. మొలకచీఁకటి జల♦ జలరాల్పఁగా రాదె
నెరులు మించినవిరి ♦ కురులయందు
కెరలించి యమృతంబు ♦ గిలకొట్టఁగాఁ రాదె
ముగ్ధచూపెడివీరి ♦ మోవులందు
పచ్చబంగారు కు ♦ ప్పలుసేయఁగా రాదె
గబ్బుమీరినవీరి ♦ గుబ్బలందు
పండువెన్నెల తేటఁ ♦ బరిఢవింపఁగ రాదె
నగవుగుల్కెడివీరి ♦ మొగములందు

గీ. నౌర! కరవాఁడిచూపుల ♦ యాఘుశంబు ,
బాపురే! భూరికటితటీ ♦ భారమహిమ
చాఁగుమదమందగమన ల♦ క్షణము లనఁగ
నేరు మించెద రప్పురి ♦ వారసతులు. 117



సీ. మాఘతాహతి రాలు ♦ నారికేళఫలాళి
నిడిసి జల్లించు పుం ♦ డ్రేక్షురసము
చిలుకపోటులచేతఁ ♦ జిరిఁగిన సహకార
ఫలములఁ దొరఁగెడి ♦ పచ్చితేనె
చిక్కిన దంష్ట్రిలు ♦ చెక్కు సుగంధియ
నంటిపండ్లను గాఱు ♦ నవ్యసుధయుఁ
శాకవేళారంభ ♦ పరిపాటిఁ దమయంత
బగిలినపనస కొ్రం ♦ బండ్లచేన
గీ. మేకమై కాలువలుగట్టి ♦ యేకహేలఁ
బఱవ సందలికిర్యాట ♦ పసిమితేటఁ
బండు నవ్వీటి ముక్కారుఁ ♦ బసిఁడి గారు
సరస ధాన్యంబు మంచిరా ♦ జనపుఁజేల. 118
చ. తెలతెలవార నొయ్య నరు ♦ దెంచి నిశాంతరతాంతతాంతలా
చెలువలకింపుగా మెలఁగి ♦ చెక్కులఁ గూరిన చూర్ణకుంత లా
వళి సరళంబుగా జడిసి ♦ వాడిన సెజ్జలమీఁదిపావిరుల్
దొలఁగఁబ్రభాతవాయువులు ♦ దోఁచుఁ బురింబరిచారికాకృతిన్ 119
సీ. ఏవంవిధఖ్యాతి ♦ నెసఁగు శ్రీవారాణ
సీపట్టణంబున ♦ సిద్ధతటిని
పొంత సిద్ధాశ్రమం ♦ బు ఘటించి యందు లో
పాముద్రయును దాను ♦ బ్రభయుఁ దరణి
యనుభోగెఁ బాయని ♦ యనుకూలదాంపత్య
మునఁబొల్చి మునికోటి ♦ తను భజింపఁ
దారకబ్రహ్మవి ♦ ద్యారహస్యజ్ఞాత
చులుకితాంభోరాశి ♦ కలశసూతి
గీ. బ్రహ్మనిభమూర్తి పెక్కుక ♦ ల్పంబులుండి
విబుధయూథంబు ప్రార్థింప ♦ వింధ్యశిఖరి

విక్రమాటోప మడఁప న♦వ్వీడు వెడలెఁ
బరవిపత్ప్రతికార త ♦ త్పరులు ఘనులు. 120

గీ. అబ్ధితోఁగూడ మునుగ్రోలు♦ నౌర్వవహ్ని
యుదరబిలమున నొకచోట ♦ నుండియుండి
జటిలవరునకుఁ గద్రూజ♦ కటకకటక
విరహతాపమిషంబున ♦ వెడలె నపుడు. 121

చ. పుడిసిటఁబట్టె నేతపసి ♦ పొంగుపయోనిధి నిల్వలానుజున్
గడుపున వేల్చె నేతపసి ♦ గాఢతపోనిధి నయ్యగస్త్యునిన్
బొడగని వింధ్యభూధరము ♦ పొంకము బింకము దక్కి నేలలో
నడఁగెఁబిలాంతరస్థలిభ♦యాహతిఁజొచ్చుకుళీరమోయనన్. 122

శా. ఆవింధ్యాచల మట్లు వంధ్యనిజగ♦ ర్వారంభమై యుండ న
గ్గోవిందాభుఁ డభంగురోదయనిధిం♦ గొల్లాపురీలక్ష్మి ర
క్షోవిద్వేషి భుజాంతరాళపదవీ ♦ శుద్ధాంతసైరంధ్రికన్
సేవించెన్ నుతియించె నాగమకథా ♦ సిద్ధాంతశుద్ధోక్తులన్. 123

క. ఆపరమేశ్వరి తను నా
జ్ఞాపింపఁగ సామిమలకు♦ షణ్ముఖపదసే
వాపరతఁ జనియె నమ్ముని
లోపాముద్రయును శిష్యు ♦ లును సేవింపన్. 124

వ. ఇట్లుచనునవసరంబున. 125

సీ. కొనలఁజుట్టినతీఁగె ♦ పెనచేఁ జమరవాల
పరికరంబులఁ జుట్టు ♦ పట్టి తిగిచి
కమ్మసంపెఁగలమొ ♦ గ్గల నిరుగడరాయు
జేగురుఁదిరికలు ♦ చెంపఁబెట్టి
లేడికి నొడియుశి♦ లీముఖశ్రేణిచే
మేలిపూఁగుత్తులు ♦ రాలరువ్వ

కబళనత్వరమాణ ♦ కరటితుండములచేఁ
గదళికాతరువులఁ ♦ గాల్లఁదాఁచి
గీ. నెత్తికురులుఁ జారునానలు ♦ నిబ్బరంపు
గుబ్బచన్నులుఁ దొడల పై ♦ కుచ్చుమయుఁగలుగు
మృగవధాజీవ శుద్ధాంత ♦ మీనసయన
లర్చనలుచేసి కొలిచి ర ♦ య్యాలుమగల. 126

వ. ఇట్టులనుదినప్రయాణంబుల నమ్మిథునంబు కుంతల దేశప్రాం
తంబు గదిసిన. 127

క. సంపాతరంగరింఖణ
ఝంపా సంపాత్యమాన ♦ జలకణరేఖా
సంపాతశీతలానిల
సంపద వొదలించెఁబరమ ♦ శైవోత్తంసుః. 128

సీ. నఖరాగ్రలూ నాన ♦ నస్వేదకరకర
బద్ధకపాయ ద్ర ♦ గంచలంబు
ప్రబలనిశ్వాసనసౌ ♦ ఖతర్పితమరాళి
శోషితశ్రవణశి ♦ రీపయుతము
దర్శితమధ్య వ్ర ♦ త్తస్తమృదునీవి
యుపరియత్నపయోధ ♦ రాంబరంబు
సంతప్తశర్కరా ♦ సహపదన్యాసంబు
నచలరజోధూమ ♦ లాలకంబు
గీ. సరఃశిఁ దరుణతరుచ్ఛాయ ♦ శమితఖేద
మలసమృదులాంగకంబు నై ♦ యుహగుదెంచు
నన్నిజపరిగ్రహముఁ గూర్మి ♦ నాదరించి
పలుకు వింధ్యాద్రినిర్బంధ ♦ బాంధవుండు. 129

మ. వనితా! చూచితె మాల్యవంతముఁ బ్రభా♦వంతంబు నా
... సామగ్రము మరు ♦ త్సంపూర్ణచంద్రా

జన కేళీపదచంద్రకాంతము నభ ◆ స్సంబాధకృత్కాటవ
ర్ధినదుగ్ధాంతము సర్వపర్వతకథా◆ప్రాగ్వర్ణితోదంతముల్. 130

సీ. ఇవె యూపవృతశాఖ ◆ లివె లూనముఖదర్భ
సందర్భవేశంత ◆ సైకతంబు
లివె శబ్దసహామ్రగ ◆ యువయుగంబులు వీరె
చలకాకపక్షమ◆ స్కులు బ్రహ్మ
చారులు నిజహోమ ◆ సౌరభేయీతర్ణ
కములనీడలనిల్చి ◆ కాచియున్న
వారు సామోదిత◆ స్వరసంశయము నొంది
చిలుకకోయిల నిదె ◆ తెల్పియ నడిగె
గీ. భసలకలభకు లాస్పృష్ట◆ కుసుమవిసర
మస్సనామకరందమయమ్మైన ◆ మావిమోక
కిసలయుచ్ఛ్వవిపునరుక్తి ◆ నసలు మసలు
బుసులచెంగావివలువందు ◆ నిందువదన. 131

క. నిర్ధూతపాతకములు హ
విర్ధూమలతాగ్రలాస్య ◆ విలసనశిక్షా
ధూర్ధరములు నిజభజనవి
వర్ధితసుకృతంబు లిచటి◆ వాయువు లబలా! 132

ఉ. ఓలలితాంగి! యిందు సుఖ◆ ముండు మృకండు కణాద గాధి వా
ధూలముఖాతిరిక్తచరి ◆ తుండు మతంగమహాతపస్వి ని
ష్కాళగళుండు నిర్వ్యవతి◆ గాత్రుఁడు నిర్నిటలేక్షణుండు ని
ర్వ్యాళవిభూషణుండు నగు◆నంబరకేశుఁడనంగఁ బెంపగున్. 133

గీ. హోమధూమాసితప్రభ ◆ నీమహాత్ము
నాశ్రమంబొప్పు నీయద్రి ◆ యంతికమున
వలుదయై మించునప్పంట ◆ వలఁతినెలఁత
చంటికడ నంటు మృగనాభి ◆ చర్చవోలె. 134

ఉ. భూరితరాభ్రవిభ్రమము • పుష్కరరమ్యకరంబు దానల
క్ష్మీరుచిరంబు సత్వగుణ • కీర్తితమూర్తియు వాలిసాలసం
హారవిహారకారణము • నౌ రఘుకుంజరభర్త మున్ను సం
చార మొనర్చె నీయచల • సానుతలంబున నంబుజాననా!. 135

సీ. పదిమ్రానిపదార్కత • పత్రంబు శిథిలప
 తాగ్రమై రాయంచ • యాశ్రయించెఁ
దాల్రసనత్సేన • జాలంబుతో ఘూర్ణి
 పంచల రొంపిఁగ• లంచి యాడె
దూరోద్గమద్దావ • ధూమ మంబుదబుద్ధి
 నెమ్మి లోపాదనుండి • నిక్కిచూచె
జరఠసక్షజలము నా • సానాళమునఁ బీల్చి
 సామజం బిరుపక్కఁ • జల్లుకొనియె

గీ. సరసిపై నీరు సలసల • దెరలె విపిన
సకలవీథులు నిర్మృగోచ్చయము లయ్యె
మట్టమధ్యాహ్న మిది సుధా • మధురవాణి!
యక్క మిచ్చోఁ బథశ్రమ • నపనయింప. 136

వ. అనుచు సభార్యుండై వింధ్యాహార్య స్తంభయిత సంభృతాను
రాగంబున నిగిడిచని, 1.7

క. నటనోద్భటుఁడై నమహా
నటునిజటాజూట మురిలి • నఁ దొరఁగుమరు
త్కటకనది యిది యనుచుఁ జని
యటఁ గనియెం దుంగభద్ర • నఘముఖ ముద్రన్. 138

శా. గంగాసంగమ మిచ్చగించునె మది౯ • గావేరి దేవేరి గా
నంగీకార మొనర్చునే యమునతో • నానందముం బొందునే
రంగత్తుంగతరంగహస్తముల నా • రత్నాకరేందు్రిండు నీ
యంగం బంటి సుఖించు నేని గుణభ•ద్రా!తుంగభద్రానదీ!139

క. ఓపును భూపరిధిం గల
యాపగ లవి బాహ్యతాప • మాపఁగ నీవే
యోపుదు గా యంతర్గత
తాపత్రయ మడఁప నోయు • దన్వన్మహిళా! 140

చ. అని కొనియాడి యన్నది మ • హానియమంబునఁ దీర్థమాడి బో
రన భవరోగజాడ్యములు • గ్రాఁగఁ దదుజ్జ్వల కర్బురాబ్జగం
ధనిచితమా రసౌషధము • ద్రావి తటస్థితపూజ్యపూజనం
బు నడపెఁ గాశికావిరహ • భూరివిషాదము సాదమొందఁగన్ 141

వ. ఇవ్విధంబునఁ ద్రిభువనపవిత్రీకరణ సమర్థ చరిత్రంబగు నయ్యుదధి కళత్రంబున సనతీఛాత్రుండై యంచిత కృత్యంబు లాచరించి నీవారముష్టిం బచవారంబులుండి తద్వారిపూరంబు వినిర్గమించి మించుఁబోఁడియునుం దానును బంచాక్షరీ గుహా హర్యక్షంబగు విరూపాక్షు నుక్షధ్వజు దాక్షాయణీవిభు వళక్షమయూఖరేఖామకుటు భ్రుకుటిమాత్ర విద్రావిత పురనిశాటు హేమకూటనివాసు వాసుకివలయు వలయు తెఱంగునం బ్రస్తుతించి సమస్త కలుషనిరసనలలితమూర్తులై చనిచని ముందట నమందమణికందళ దంతురంబయి మహీమందగమన కేళీకందుకంబునుం బోలె నుత్తాలంబగు స్వామిశైలంబు నధిరోహణంబుచేసి యక్కుధరమ్మునందు. 142

క. షణ్ముఖు శిఖిసంతప్త హి
రణ్మయనిభవర్ణుః నేకి • రాడ్ధ్వజుఁ గొలిచెన్
షాణ్మాతురుఁ దపసి తురా
షాణ్ముఖసుఖదప్రభావు • సతియుం దానున్. 143

క. కొలిచి నుతించెం గ్రౌంచా
చలవిదళననిపుణబాహు • సారుఁ గుమారున్
గలశసుతుండుం బలుకుల
మొలకలు పుష్పోపహార • ములచెలు వొనఁగన్. 144

సీ. కావుళ్కా వనుట ర ♦ క్కసులమూఁకనెకాని
ననిచె నీమొద సింహ ♦ నాదవిహృతి
పొత్తులు తొలువేలు ♦ పులగంట్లనేకాని
హత్తె నీమేన వ ♦ జ్రాంగిజోడు
వసవల్వ దైత్యుల ♦ వ్రయ్యగుండెనెకాని
నినుఁగప్పె వీరచం ♦ దనపుఁదావి
యంగుళీచర్వణం ♦ బసురులందునెకాని
గెలుపుఁజిందము మోవి ♦ నిలిచె నీకు
గీ. నీవు తలమావి పీడని ♦ సిసువువయసు
నాఁడె జేజేలదళవాయి ♦ నాయఁకరవుఁ
బట్టమున నిల్చి తారకుఁ ♦ గిట్టి ప్రౌఢ
తరరణక్రీడయొనరించు ♦ తతి మహాత్మ! 145

ఆ. అహితగోత్రహృద్వ్య ♦ థాకోపకృతి నీదు
శక్తి కుఁగబాహు ♦ శక్తికిఁ దగు
ఘనవివృద్ధిఁ బేర్చి ♦ గర్వించుటలు నీదు
శిఖికి సత్ప్రతాప ♦ శిఖికి సమరు. 146

వ. అని యమ్మునికులచక్రవర్తి వెండియుం గార్తికేయుం డార్తి తార్తిహారుండనియును, శరవణభవుండు పరమపురుషార్థ ప్రవణుం డనియును, మహాసేనుండు దీనజనమందారుండనియును, శర్వద్వా లుండు కృపావిశాలుండనియును, షడాననుండు కీడునలనఁ బాచి ప్రోచుప్రోడయనియును, నీలదంష్ట్రుండు జయశ్రీలాభంబునకు మూలంబనియును, గాంగేయుండు పెన్నిధానంబనియును, కుక్కుట ధ్వజుండు మొక్కుటకుం దగిన వేల్పనియును, బ్రహ్మగర్భుండు నిష్కరబ్రహ్మవిద్యోపదేశదేశికుండనియును, విశాఖుఁడు కుశాగ్ర బుద్ధి యనియును, సుబ్రహ్మణ్యుండు దదభ్రగుణరత్నఖనియనియును

శిఖివాహనుండు సాధుసఖుండనియును, పార్వతీనందనుండు సచ్చిదానందుండనియును, బాహులేయుండు మోహామహీధరవ్యూహా మేఘవాహనుండనియును, తారకారాతియకారణసుకృతి యనియును, శక్తిధరుండు భుక్తిముక్తికరుండనియును, స్వామి యోగక్షేమభూమియనియును, స్కందుండు జగత్సందోహావనపరిస్పందుఁడనియును, క్రౌంచదారణుండు పంచవద నాపరావతారుండనియును, గుహుండు నిరవగ్రహాశు భావహుండనియును, కుమారుం డమరచమూసముద్ధరణనిర్వాహుండనియును, షాణ్మాతురుండు తురాషాణ్ముఖసుఖప్రదుండనియును, బ్రిమదరసనిమగ్న మనస్కుండై యగ్నిభవుం బ్రణుతించి యసాదంబగు తదీయ ప్రసాదంబువడసి కతిపయదివసంబు లుచితగతింగడపి తద్విరచితమహాస్కాంద గ్రంథసందర్భంబునం బూర్వభాగంబు విని తదాశయావబోధ సుధాధునీ వినిమజ్జనంబునం గాశీవియోగ జనితక్లేశంబు దీసివైచి యందలియుత్తరభాగంబున. 147

సీ. మిన్నేటిపాటియుఁ • బెన్నయున్నతియు వి
పాశవాసియుఁ జంద్ర • భాగచేగ
యును శరావతిభూతి • యును వేత్రవతిచరి
తయును బాహుదయుదార • తయును గృష్ణ
వేణియగణ్యాభి • వృద్ధియుఁ గావేరి
కీవియుఁ గపిశలీ• లావిభవము
వంజీరమంజువా • రైవభవంబును భవ
నాశనిక్లేశని • ర్నామకృతియుఁ

గీ. దుంగభద్రప్రసంగ ము • తుంగభద్ర
రాజిరాజిల్లుగౌతమి • యోజ మరియు
వార్తకెక్కినతీర్థపు • వర్తనములు
స్వామి వినిపించె వింధ్యసం • స్తంభయితకు. 148

క. ఆకుంభజుతో మఱియుం
గేకిధ్వజుఁడనియె మౌని♦ కేసర! విను మిం
కేకథ వినియెదు సకలము
నీకెఱిఁగించితిని కాధు ♦ నీచరితంబుల్. 149

క. ఈ గంగాదికతీర్థము
లీఁగంగానీవు దమన ♦ మిద్ధాంబువులన్
దోఁగెడువారల గనగనఁ
గాఁగెడు నంగారసింధు ♦ కల్లోలమునన్. 150

క. వివిధక్షేత్రచరిత్రలు
వివిధసుపర్వానుభావ ♦ విలసనములు దీ
ర్థవిశేషశ్రవణముతఱిఁ
జెవికిం జీవియొసఁగనే! వి♦ శిష్టవిచారా!. 151

చ. అనుడు నగస్త్యుఁడిట్లనియె ♦ హైమవతీసుతుతోడఁ దోడిస
న్మునులరంగ నోయనఘ♦మూర్తి!సమస్తముఁగ్రిందుజేసి మిం
చినబలుపేర్మిఁ దీర్థమును♦క్షేత్రము నొక్కెడఁ గూడియుండెనే
ని నిరుపమాద్భుతింబెలిపి♦నీవు మముం గరుణింపఁగాఁ దగున్.152

క. అని పలుకుకలశభవముఖ
మునిజనముల ప్రశ్నవాక్య♦ ములు విని పురభి
త్తనయుఁడు తత్త్రివిధము నొ
క్కనెలం గుమిగూడి యునికిఁ♦ గనజాలమికిన్. 153

వ. ముహూర్తమాత్రవిచారడోలారూఢ నిజస్వాంతుండై యా
యాశ్రమవిశ్రాంతులం గూర్చి యిట్లనియె. 154

క. ఏతత్త్రితయము నొకచో
భూతలమున మేళవించి ♦ పొగడొందుట మ

స్ఫేతోగతిఁ దోఁపదు సము
పేతావృతిముకురకుక్షి • నిభమును బోలెన్. 155

గీ. చిత్తమాశ్చర్యరసమున • జొత్తిలంగఁ
జేయు నీప్రశ్న మక్షికా • క్షేయుచేత
నిందుధరుచేత హరుచేత • నెఱుఁగవలయు
రండు పోదము మునులార! • రజతగిరికి. 156

క. పొడమినసందేహంబులఁ
జడిసిన మందేహులం బ్రబ • సన్నులఁ జేయన్
మృడునకుఁ బని గావున మన
మడిగినయర్థంబు నతఁడ • యాదేశించున్. 157

క. అని కృతనిశ్చయమతి స
న్మునులంగొని రజతశైల• మున కేఁగఁదలం
చినగుహుఁ బొగడెడుక్రియ బో
రన మ్రోసెఁ బ్రియాణభేరి • ప్రసభారభటిన్. 158

ఉ. ఆసమయంబునన్ ధృతని• జాయుధు లాధృతభూషణు లమ్రహో
ల్లాసలసన్ముఖు ల్వివిధ • లాంఛనలక్షితు లాసురాన్వయ
త్రాసకరుల్ విమానగులు • దైవతవీరులు తారకారిపె
న్నోమ్రసలమ్రోలనిల్చిరొక•ముప్పదికోటులుమూఁడుకోటులున్.159

మ. పనితప్రక్రియ నద్దెఱంగులెసఁగన్• బ్రస్థాననైపథ్యశో
భనముం గైకొని బ్రహ్మగర్భుఁడు వహ • త్కల్యాణకల్యాణమై
ఘనగర్జ న్నకిలించువారువము నెక్కం•బోవుచోఁ బర్వె సం
జనితాశాకరికర్ణసంజ్వరభ రాం • చత్కంచుకీధ్వానముల్.160

సీ. ఆటకుమెచ్చి బం• లారి యీఁ గొనుమరు
త్ఫలమిది యన బర్హ• భార మమర
హరుఁ గుత్తుకన కాక • శిరసునఁ బోలఁ దా
ల్చినజటాచ్ఛటలీలఁ• శిఖ వెలుంగ

క్షితిశిరోభూషావి ♦ శేషనిర్మితికిఁ బా
ల్పడు పడియచ్చుల ♦ ట్లడుగులు దగ
ధాతృవాహము భుక్తిఁ ♦ దా నభ్యసింప బి
సము మ్రింగుభంగి ద ♦ ష్టఫణి గ్రాలఁ
గీ. గంఠగంభీర నినదంబు ♦ ఖచరయువతి
గానవిద్యకు షడ్జసం ♦ ధాన మొసఁగ
నెసఁగుదెలికన్ను గోనల ♦ మెక్కిరింత
నెక్కె బలుకొండఁ దూఁటువో ♦ నేయు మేటి

క. అది సజ్జస్యందనమై
మదకరియై తత్తదుచిత ♦ మార్గంబుల నే
ర్పొదవ నొకకొంతచని పా
రదనిభశుభమూర్తి నశ్వ ♦ రత్నంబగుడున్. 162

క. శితికంఠసుతుఁడు ఖచర
స్తుతుఁడై రయూయచ్చరూపు ♦ తురికి న్నాస్కం
దిత ధౌరితక ప్లుత రే
చిత వల్గిత గతులఁ దఱుటు ♦ చేసిన నదియున్. 163

క. మురళిఁ గొనియు రవణమునన్
బరువడి గోమూత్రికాది ♦ భంజళులఁ గడున్
గరలి చతుర్విధధావిత
పరిపాటీపాటవమునఁ ♦ బతి మెప్పించెన్. 164

సీ. బలుపాఁపతలచుట్ట ♦ లలవరించినవారు
లేఁతచందురులఁ దా ♦ లిచినవారు
పునుకతమ్మంటులఁ ♦ బొలుచుపీనులవారు
నొసలమిక్కిలిచూపు ♦ లెసఁగువారు

బూఁదుపారఁగ మేన ♦ బూదిఁబూసినవారు
తిృముఖాస్త్రములు కేలఁ♦ద్రిప్పువారు
పులితోలుహొంబట్టు ♦ పుట్టముఁగ్గలవారు
కొమ్ముటేజులనెక్కి ♦ గునియువారు
గీ. ఘోరతపముల హరుఁ దక్క ♦ గొన్నవారు
కరటి దైతేయకుంభము ♦ క్రాలలామ
హారిభుజమధ్యములవా రు♦ దారయశులు
ప్రమథవీరులు గొల్చి రా ♦ బాహులేయు. 165
శా. శ్రోణీరేణుకృతంబు లంజనరజో ♦ గుచ్ఛాసితంబుల్ తమ
శ్శ్రేణుల్ దూషిత పూషభీషణగతిన్ ♦ జృంభించియుం దూలె న
క్షీణోత్తంభితశక్తిభృద్భటశిర ♦ స్సీమాకిరీటస్ఫుట
న్మాణిక్యాతప పల్లవ స్తబకసా ♦ మగ్రీహ్యతాగ్రింబులై. 166
క. సమ్మర శశి తటిదజపవమా
న రవి సుధా సలిల మునిజ♦న తొమ్మరిష్టా
సురమృత్యుజ్వలనఁ జెలఁగు
సురవేశ్యలు గొలిచి రపుడు ♦ సుబ్రహ్మణ్యున్. 167
క. దైవతభటభుజశిఖర
వ్యావల్గన్నవకృపాణ♦ వల్లిక లలరెన్
దైవపదవారినిధిసలి
లావిష్కృతవిషమహిమ ♦ హార్చులు వోలెన్. 168
క. నయనత్రిభాగవృతహా
సయుతంబుగ సాధ్యసతులు♦ చల్లినలాజల్
నయనాయుధ తనయాయుధ
చయలతికావళులఁ గుసుమ ♦ సమత వహించెన్. 169

సీ. వివిధదివిసద్వధూముక్త • దివిజవిటపి
కుసుమ కేసర లసదంస • కూటుఁడగుచు
వేల్పుఁబడవాలు కడువాలు • విరియఁబడిన
కందమునఁబొల్చుదుర్గ కం • ఖాణ మనఁగ. 170

సీ. విబుధమధురాధరాభుజా • వీజ్యమాన
విమలచామరబహుసహ • స్రములు వాలిచె
స్వామియిరుగడఁ బుష్పవ • ర్షములఁ దలఁకి
సురవిమానమరాళము • ద్దెరలె ననఁగ. 171

సీ. స్వామిమలనుండి రాజతా • చలముదాఁక
సేతువెత్తినగతి మహా • సేనసేన
రోదసీరంధ్రనీరంధ్ర • రూప మగుచు
నడచె గిరి సింధు వనసృష్టి • పుడమి నడఁగ. 172

ఉ. పుట్టిన మోము లై శిఖర • ముల్వొలుఁగొంద నితంబమండలిం
గట్టినకృత్తియై నిబిడ • కానన రేఖ దలిర్ప లోనఁజూ
పట్టిన విశ్వమై వెలుఁగు • పాత్రికులం బలరన్ గిరీశుఁ డ
ప్పట్టికిఁగానిపించినప్ర • భం గలధౌతనగంబుఁ దోఁచినన్. 173

క. జైవాతృకబింబము నిజ
జీవాతువుఁ గాంచి ప్రాప్త • జీవములగుచున్
జీవంజీవము లలరెడు
భావంబున బాహులేయు • బలములుపొదలెన్. 174

సీ. పద్మరాగ మణీమయ • పాదలబ్ధి
స్ఫురిత గైరిక శిఖరచం • చూసమృద్ధి
గంధవతియను నొక్కరూపం • కజమునడుమ
మించునకొండ కొదమరా • యంచఁ బోలి. 175

సీ. నీలగళవాహ రింఖాఖ • నిత్రనిహతి
నింగికెగసిన వెండిరానేల • దుమ్ము

ప్రాంతవర్తిష్ణు సప్తర్షి • పరివృఢులకు
నొసఁగు నిర్యత్న భసితవి • లసితమచట. 176

వ. ఇట్లు నిజబల నిఖిలనిరీక్షణ నిస్తంద్ర చంద్రికాధీనంబగు సగ్గట్టుజేని వైమానిక సేనాని మానధనుండగు నధికుండు నిజపురు షాకారంబునుంబోలె నధిరోహించి. 177

క. వాహనము డిగి గగనచర
వాహినిఁ దత్కుధరసవిధ • వనవిహరణకాం
క్షాహూతహృదయ నటనట
యోహో! నిలుమనుచు నిలిపి • యుల్లంబలరన్, 178

ఉ. ఆ రవి వాలఖిల్యయుతుఁ• డైవిధుగర్భముఁ దూఱెనోయనన్
దారకవైరి సంయమి క • దంబయుతంబుగ నేగుదెంచి ము
క్తారుచిరుంద్రమైన వసు• ధారధుగేహముఁ జొచ్చినట్లు మా
రారియునిష్కుటాంతరవిహార ము•మాన్వితుఁడై యొనర్పఁగన్.179

గీ. మందిరోద్యాన ఖేల నా• నందవిభవ
మవధరించెదు తారా వి • టార్ధమాళిఁ
జివురుగుత్తుల విరులఁబూ • జించుటకునొ
యాఱుఋతువులు సన్నిధి • యయ్యెనచట 180

సీ. మరువంపువలపుఁ బ• ల్మఱు క్రోలి క్రోలి క
మ్రాల్చి యూరక మేను• మఱచుఁగొన్ని
యరవిచ్చు తెలిమొల్ల • విరులు మూతులుసాచి
పొదిగూడి తెక్కలఁ• బొదువుఁ గొన్ని
గురువింద పూఁదేనె • పెరలకై తమలోనఁ
బొత్తువోవక సారెఁ • బోరుఁగొన్ని
పక్వంబులగుదాఁకఁ • బాటించి మల్లికా
కలికానికాయంబుఁ • గాచుఁగొన్ని

గీ. భోగివశమైన గేదంగి ♦ పూవునకును
వగచు మదిఁ గొన్ని బంధుజీ ♦ వకలతాంత
గుచ్ఛములలోన నొకకొన్ని ♦ కొలువు సేయు
దేఁటు లఖిలర్తుమయవనీ♦ వాటిఁగమిచి. 181

గీ. పూవుఁదేనియఁ దడిసిన ♦ మావిచిగురు
మీఁద నంటి చరించుతు♦మ్మెద దలిర్చు
సమయమాటయు మసి నెయ్యి♦ సమరి మరుఁడు
త్రుప్పవోఁ దోముసీలంపుఁ ♦ దునుక యనఁగ. 182

గీ. గంధవిరహితమనుబుద్ధిఁ ♦ గనక తేఁటి
పూఁతి విచ్చినమోదుగు ♦ మొగ్గఁదగిలి
సౌరభాకాంక్షఁ జొచ్చి చె ♦ న్నారెఁ గీర
తుండవశమైన నేరేడు ♦ పండుఁబోలె. 183

క. ఖరకర కరహతిసలసలఁ
దెరలెడు మల్లీమరంద ♦ దీర్ఘికచుట్టున్.
దిరుగు నళి యనుభవమునకుఁ
జొరదతిలోభాంధబుద్ధి సొ ♦ మ్మరయుక్రియన్. 184

క. నలువదితొమ్మిది రూపం
బులుగొనియున్ బుష్పగంధ♦ములు మోవఁగలే
కలసియుఁ దెమ్మెరలానుం
బలుమఱు యువజనము మేని ♦ పలుచనిచెమటల్. 18

చ. విమలమయూఖరేఖయు న ♦ వీనతరోత్పల పత్రమున్ బ్రవా
ళమణియు నొక్కతీవియ బ♦ లాదృతి దాల్చెనటన్న వించు
భ్రమశిథిలాంగియయ్యుఁ గుచ ♦ భార నితంబ కపోల గోపన
క్రమగమనాకులాకృతియు♦ కన్నులనీళు నదల్చె గౌరియున్. 18

గీ. ప్రావృషేణ్య పయోధర ♦ పటలిచేత
గాడ్పు నీహారకర రేఖఁ ♦ గప్పు కరణి

ధరణీధర కార్ముకుఁడు శైల ♦ తనయఁబోదివే.
బచ్చడంబునఁబొల్చుపూఁ ♦ బచ్చడమున. 187

చ. పొదువుపరాగవృష్టి మొగి ♦ మున్ శ్రమవారిని మేను భానుదీ
ప్తి దవులహెచ్చు జన్గడలుఁ ♦ దేజముదాల్చెనకాని యొప్పుగుం
దదు నగపుత్రికప్డు భసి ♦ తంబున వర్షముచేత నగ్నిపైఁ
గదురుట నద్దముల్ లతయుఁ ♦ గాంచనకుంభములున్ బెడంకునే. 188

మ. బొమలెక్కించిన విల్లు వంచు నునుఁజూ ♦ పుల్చంచలాచంచల
క్రమరేఖన్నిగిడింప శాతవిశిఖా ♦ ఘంబుల్ మెయిన్నించు నె
య్యమున స్ఫుల్లఁగ నల్లమీఁటిచటుల ♦ జ్యాఘోషముల్ జేయు న
య్యుమపాశ్రిపొంది రతీశ్వరుండు హరుబి ♦ ట్టోడింప నుట్టాడుచున్.

చ. చిగురులు దేరఁజేసి విరి ♦ చిక్కని చక్కనిపువ్వుగుత్తులన్
బిగువుచనుంగవంబొదివి ♦ వ్రేలెడు చిల్కలఁజోపి తేనియల్
బొగపినపల్కులంబొగడి ♦ భూతపతిన్ బ్రతిమెచ్చ జేసె న
య్యగజ తదుద్యమార్హ వినయానన ♦ యాభినయానుకూలతన్.

క. ఈరీతి ప్రమదవిపినవి
హారం బొనరించి హిమన ♦ గాత్మజయుం గం
జారి, రవి, శిఖి, నయనుఁ డుప
చారంబులు సమదయువతి ♦ జన మొనరింపన్. 191

ఉ. నాకవిభూషలోత్కరక ♦ నచ్ఛిఖరావృతమైన యొక్కప
ద్మాకరతీరకేళికనకాద్రి సు ♦ ఖస్థితినుండు నంతఁ బుం
జీకృత తారహారముగ ♦ శేషవిభూషణు నంఘ్రికి న్నమో
వాక మొనర్చి యిట్లను శి♦వా కలకంఠి సమంజసోక్తులన్. 192

సీ. విజ్ఞానమయమహా ♦ ప్రాజ్ఞ! యోసర్వజ్ఞ!
ప్రార్థింతు నిన్నొక్క ♦ యర్థమేను

నిర్వాణఫలదమై ♦ నీకున్కిపట్టైన
క్షేత్రంబు దేవతా ♦ సింధుముఖ్య
తీర్థంబుల జయించు ♦ తీర్థంబునత్యుత్క
టప్రభావంబుల ♦ దీప్యమైన
దైవతంబునుగూడి ♦ దర్శనస్నానపూ
జనములఁ గలుమ భం ♦జనమొనర్పఁ

గీ. జాలు నిమ్మూర్తుడు నొకచోట ♦ మేళవించి
యుండునో? కాక వేర్పడి ♦ యుండునొక్కొ?
దీనిచందంబు సకలంబుఁ ♦ దేటపడఁగ
హృదయగమ్యంబు చేసి న ♦ న్నేలుమనుడు. 193

మ. లవలీపల్లవ పాండురంబులగుగ ♦ ల్లక్షోణాలం జంద్రికా
లవలీలం దరహాస మింపెసఁగ నే ♦ లం నైళ మగ్గోలచే
లవరీతిం గొని తెచ్చి యంకకదళా ♦ లంకారముంజేసిబా
లవిధూత్తంసుఁడు పల్కుమాధవకథా♦ శ్లాఘాసుఖాసక్తుఁడై. 194

క. కించిదవ్వలగ్న! మిక్కిలి
మంచిది నీపరిశ్నమిది స ♦ మర్మముగా వి
న్పించెద ననునాలోనన
కంచుకు లరుదెంచి ఘటిత ♦ కరకిసలయులై. 195

క. దేవ! యగస్త్యాదికముని
సేవితుఁడై వచ్చినాఁడు ♦ సేనాని భవ
త్సేవార్థి యగుచు నతఁడిట
రావచ్చునొ? యనుడు రాగ ♦ రసభరితమతిన్. 19

వ. దేవీసహితుండై యద్దేవదేవుండు తదాగమనం బనుమతించ
టయు వల్లెయని సౌవిదల్లనికరంబు నిజకరంబులం బుత్తడిబెత్తంబు
లంబురుహాచుంబిత తరుణతరణి కిరణంబులం బురణింప మరలిపఱ

శరవణప్రభవునకు భవానీపతి యనుగ్రహించుటం దెలియ విన్నవించుటయు నతండు. 197

సీ. పీఁడియం బెదలించి ♦ విధురత్న కనకాలు
కాంచితాంబువు పుక్కి ♦ లించి యుమిసి
యుదిరిబంగరుబ్రాత ♦ హారంబట్టువలెవాటు
సడలించి వెనుఁగటి ♦ స్థలినిజుట్టి
యనుయాయి పృథుకహ ♦ స్తాంతరన్యస్తోప
దోచితార్ఘము తానె ♦ యుద్వహించి
యంగుళీసంజ్ఞ సం ♦ యములఁ బ్రత్యేకంబు
మునుమున్న లోనికిఁ ♦ జననొసఁగి

గీ. ద్వారపార్శ్వస్థవేదికా ♦ వలులజరర
రక్షివర్గంబు టంకిరియా ♦ రభటీవరలు
వలయమకుటాదికంబుగ ♦ నిలిచి మ్రొక్క
నగవుఁజూపులఁజూచుచు ♦ నగరుసొచ్చి. 198

ఉ. వచ్చి పయోజపత్రముల ♦ వ్రాలెదుతు మెత్త్రవదొమిత్త్రమూఁకలన్
దచ్చనసేయుచున్ బిత్రుప ♦ దంబులఁగూఁకటులంట దర్శనం
బిచ్చుటమున్న గాఁగ నుతి ♦ యించుచు మ్రొక్కుడుఁ గేలుసాచి వే
గ్రుచ్చి కవుంగిలించి వలి ♦ గుబ్బలిపట్టియు వాఁకదాలుపున్. 199

తే. సమ్మదాశ్రులు కనుఁగవఁ ♦ గ్రమ్మఁదేర
నాఱుమోములబాలు ని ♦ జాంతరమున
నిలుప నతఁడొప్పె రోహిణీ ♦ జలజవిమత
మధ్యమున నున్న తారాకు ♦ మారుఁబోలె. 200

క. నిటలాక్షువలన నప్పుడు
ఘటసంభవముఖ్యమునులు ♦ గని రెంతయు ము

చ్చటఁ బిలిచి పీఁటయిడియు
తట్టక్కృపతో నొసఁగుపరమ • గౌరవమంతన్. 201

సీ. అలవోక కనకాద్రి • సెలయుచో విఱిగిన
హరివరాహముదంష్ట్రి • నవతరించె
నెద్ది మున్నపరంజి • యిసుకరానేలలఁ
జరియించు గంధర్వ • పరిబృఢునకుఁ
జిత్రాశ్వునకు నెద్ది • చేకూరె నెద్దిత
చ్ఛుద్ధాంతకామినీ • సురతఖేద
మపనయింపఁగజాలెఁ • దపవాసరంబుల
నంచయై గరుదంచ • లానిలముల

గీ. నెద్ది ప్రాపించె నాఖేచ • రేంద్రుగెలుపు
గొన్నతారకునకు వాని • గుహుఁడు దునిమి
తెచ్చెఁ దానెద్ది యమ్మర్త్య • మిచ్చెనచల
సుతకు శితికంధరునకు ని • చ్చుటయు నలరి. 202

చ. హరుఁడు శిరంబునం జెవిఁ గ•రాంబురుహంబునఁ దాల్పఁజంద్రికాం
కురపరభాగమై యురగ • కుండలమై స్ఫటికాక్షసూత్రమై
గిరిజ కచాళిఁ గర్ణమునఁ • గేల వహింపఁ బ్రసూన మాలికా
కరిరదపత్రవిభ్రమకు • కంబులునై మణి యుల్లసిల్లుచున్. 203

వ. వెండియు నక్కొండరాచూలియు ఖండపరశుండునుం డెందంబుల నెద్ది యభిలషించిరయ్యోగూపంబు లాపరమరత్నంబు ధరియించి తదాదరణ చరితార్థంబయ్యె నంత. 204

క, మత్స్వామీప్యమునకు నీ
సత్సంయమివరులు నీవుఁ • జను డెంచుట కో
వత్సా! యెయ్యదికతమని
వాత్సల్యము గదుర పంచ • వదనుఁడు పలుకన్. 205

సీ. తనతండ్రిఁ బలుకుఁ గ్రాం • చ నిషూదనుఁడు చంద్ర
పరిపన్నిరుద్ధనీ • రరుహముకుళ
భాతి మోడుపుఁ గేలు • ఫాలాగ్రవీధిక
విలసిల్లియలర నో • వృషభగమన!
నాపేర స్కాందంబు • నాఁదగునొకపురా
ణము నీదుకరుణ క • లిమి రచించి
యిమ్మునీంద్రులకెల్ల • నెఱిఁగింప నందు వీ
రలు సురక్షేత్ర తీ • ర్థములకథలు

గీ. చాల విని విని సర్వాతి • శాయియైన
దేవుఁడేనియు నటువంటి • తీర్థమేని
యట్టిసుక్షేత్రమేని భో • గోపవర్గ
దాయిగలదేని యెఱిఁగింపు • తడయ కనిన. 206

వ. సర్వోత్కృష్టంబులగు తీర్థక్షేత్రదైవతంబుల మహాప్రభా
వంబు మదీయభావదర్పణంబునం బ్రతిఫలింపమింజేసి. 207

క. నీవలనన కడముట్టిన
దైవత మహిమయును క్షేత్ర • తత్వము తీర్థ
శ్రీవిభవము శ్రుతిమార్గను
ధావిష్కృతిగాఁగ వినుట • కై ముద మొదవన్. 208

ఉ. ఈకలశోద్భవప్రముఖు • లేనును వచ్చితి మీహితార్థల
క్ష్మీకర! దీని మాకు నెఱిఁ • గింపు మనంబున నున్నసంశయా
నేకము మానిపింపు కృప • దేలెడుచూపులఁ జూడు మన్నదా
రాకమనార్థమౌళి మధు • రంబుఁ బ్రియంబును గాఁగ నిట్లనున్. 209

మ. మము నీయర్థము వేడుచున్నయది యు • పన్యాత యోపుత్ర! యీ
యుమకు న్నీకు నెఱుంగ జెప్పెద వినుం • డూహించి యేతచ్ఛరి

తత్రిము సర్వంబు కరోదరస్ఫటికర ♦ త్నశ్రీఁబ్రికాశింప గో
ప్యము సేయందగు దీనివిన్నపిదపర్ ♦ బ్రాణంబుగాఁజూచుచున్. 210

గీ. శఠమతికి నాస్తికునకు బా ♦ షండునకును
గర్మముగుజెంచి యాచించు ♦ గ్నైతునకు
నీపరమగోప్య మోపుత్రి! ♦ యోపురంధ్రి!
తప్పిదాఁదియు నెఱిగింపఁ ♦ దగవుగాదు. 211

క. అని నిజతనూభవునకును
దనమగువకుఁ దీర్ఘదైవ ♦ తక్షేత్రము లో
కగ్ర నెలవునన భువనత్రియి
వినుతిఁ గనుట దెలుపఁ గడఁగి ♦ విధుమౌళి మదిన్. 212

సీ. వెడఁదకన్నులవాని ♦ వెయినామములవాని
వేత్రితల వలపించు ♦ వెరవువానిఁ
జిప్పకూఁకటివానిఁ ♦ జిన్నినవ్వులవానిఁ
జెఱివిన మంచి పిం ♦ ఛియమువానిఁ
బులుఁగుతత్తడివానిఁ ♦ బొడవుల తుదవానిఁ
బొక్కిట వెలిదమ్మి ♦ పూవువాని
మినుకుటూర్పులవాని ♦ మిసిమిమేఁతలవాని
మెఱుఁగుఁ జామనిచాయ ♦ మేనివాని

గీ. దిస్స మొలవానిఁ బసిఁ గాసఁ ♦ ద్రిప్పువాని
మురళి గలవాని మువ్వంక ♦ మురువువాని
విఠ్ఠలాధీశుఁదలఁచి త ♦ ద్విపులమహిమ
నొడువుఁ బ్రిమత్రికీసీడ ♦ విడిఁదిపోడ. 213

శా. సారాచారవిచార! చారణవధూసం ♦ స్తూయమాన ప్రథా
ధారోదారవిహార! హారసుషమా ♦ ధన్యస్ఫురత్కీర్తిక

గ్వారాలంకృతదిక్క! దిక్కరికరా • భోగస్ఫురద్బాహుశా
ఖారాజ్యద శేష భూభరణద • క్షా! దక్షిణైక వైభవా!. 214

క. నారాయణపద సేవా
పారాయణ! బంధులోక • పాలనదీక్షా
ప్రారంభ! కల్పభూరుహ!
భారత రామాయణాది • పరమార్థజ్ఞా!. 215

మాలిని. సకల సుజన వర్యా! • శాంభవాహార్యధైర్యా!
సుకవివినుతకీర్తీ! • శుద్ధతత్వ ప్రవర్తీ!
ముకురనిభ కపోలా! • ముగ్ధలక్ష్మీ విశాలా!
కకుబధిప సమానా! • గౌరవశ్రీ నిధానా!. 216

గద్య

ఇది శ్రీమత్పరమపదనాథ నిరవధిక పరిపాక
పరిచిత సరసకవితాసనాథ రామకృష్ణ
కవినాథ ప్రణీతంబయిన పాండు
రంగ మాహాత్మ్యంబను
పరమభాగవతచరిత్రం
బునందుఁ బ్రథ
మాశ్వాసము.

శ్రీరస్తు.

# పాండురంగ మాహాత్మ్యము.

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీదయితచరణసేవా
ప్రాదుర్భవదఖిలవిభవ ♦ భాసుర! సరసా
హ్లాదక! వితరణవిద్యా
వేదీ! రామానుజేంద్ర ♦ వేదాద్రీశా! 1

వ. ఆకర్ణింపు మాగోకర్ణకుండలుండు సకుమారంబుగాఁ గొండ
రాచూలింగనుంగొని॥ 2

సీ. శైలజ! విను విను ♦ షట్కాంత! కరవీర
కుశపల్లవంబులఁ ♦ గొమరుమిగులు
ఘర్మనీరానది ♦ గలసె నెచ్చట నట్టి
భైమిదక్షిణతీర ♦ భాగమునకు
యోజనంబున సమ ♦ స్తోన్నతంబగుతీర్థ
మును క్షేత్రమును జాలఁ ♦ బొగడువడయుఁ
బౌండరీకములన ♦ భాసిల్లు నచట న
ద్దేవతోత్తముఁడు ల ♦ క్ష్మీవరుండు
గీ. భక్తరక్షణదాక్షిణ్య ♦ సక్తబుద్ధి
యఖిలనిగమౌఘగిరిగుహా ♦ హరిపృథుకము
పాండురంగండు సాకృతి ♦ బ్రహ్మలీల
నిలిచియున్నాఁడు భువనవ ♦ ర్ణితవిభూతిఁ 3

నిగమఘంటాపథైకాధ్వ ♦ నీనబుద్ధి
బ్రహ్మవిద్యానవద్యుండు ♦ బ్రాహ్మణుండు. 6

చ. హరిహయదేశికాభుఁడగు ♦ నమ్మహిదైవతమౌళియందు బం
గరువుఁకున్ మృగీమదసు ♦ గంధము సంధిలుభాతి నంబుజో
దరచరణారవిందసత ♦ తస్మృతిలోలుపమైన బుద్ధియున్
బరిణతిఁగాంచె సంపదల ♦ పై మరియుంజనియించు సంపదల్. 7

సీ. మొదలఁ గామక్రోధ ♦ ముల బరాబరిచేసి
సత్యవాఙ్నియమంబు ♦ సంగ్రహించి
సాత్త్వికస్వల్పభో ♦ జనలబ్ధిఁ గ్రొవ్వాగి
యంగాష్టకాశక్తి ♦ హవణుపఱచి
తరిచి ముప్పదిరెండు ♦ తత్త్వంబులూహించి
మది సత్త్వసంపద ♦ మస్తరించి
తెలిసి ముద్రాసనం ♦ బుల మేనిఁ బనిగొని
పాపపూరుషుఁబటా ♦ పంచచేసి

గీ. యతఁడు మూలాలవాలగ ♦ హ్వరకరండ
కుండలీస్థాన గోకర్ణ ♦ కులకలాప
తత్త్వదర్శన వర్ణాధి ♦ దైవతదళ
నిర్ణయంబెంత యంతయు ♦ నిజముగాంచి. 8

చ. మను హఠ రాజ యోగముల ♦ మర్మమెఱింగి తదర్ధసిద్ధి నె
మ్మనము దలిర్చి హృజ్జలజ ♦ మండిత మానస షట్పదంబు న
ర్జునరథ భూషణంబు వెలిఁ ♦ జూడని నిద్దపునిట్టచూపులన్
ముసుకొని చొక్కు లోన నిజ ♦ మూర్ధగళత్సుధ సేదదేర్పఁగన్. 9

మ. శతపత్రాక్షము శిక్య ♦ సఖ్యభృతిచంచన్మౌళిసన్నాహ ము
న్నత నాసా ముకుళంబు పూర్ణతరచం ♦ ద్రిస్నిగ్ధముగ్ధాననం

బత్తసీసూన సవర్ణవర్ణ మతిసా • మ్యం బబ్జనాభుంబు శ్రీ
శ్రితవక్షంబు మహామహంబు కడుఁబ • ర్వెం దనమ్రనఃపేటికన్. 10

సీ. సనకసనందనా • ది నిఖిలాంతర్వాణి
హృల్లీనభావంబు • సల్ల పెట్టి
విశ్వంభరాభోగ • వివిధ మూర్త్యంతర
స్ఫురితానుభావంబు • బుజలువైచి
శింశుమారాకృతి • స్వీకృతి వైకుంఠ
పట్టవిహారంబు • జారవిడిచి
క్షీరోదమధ్యస్థ • లీరత్ననగగుహా
గర్భనివాసంబు • కచ్చువదలి
గీ. పుండరీకేక్షణుండు శి• ఖండిబర్హ
మండిత శిఖండకుఁడు నతా • ఖండలుండు
పుండరీకుని మానసాం • భోజపీఠి
మిండ తుమ్మెదయై యుండు • నిండుకొలువు. 11

ఉ. అన్వహమున్ బ్రవృద్ధమగు • నంబుజనాభపదారవిందభ
క్తి న్వహిం కెక్కుచున్ వసుమ • తీసురవంశవతంస మెల్లవా
రు న్వినుతింపఁ బెంపెసఁగు• పోదియొనర్చుచుఁ దల్లిదండ్రి నెం
దు న్వివిధానురూపతను • దోహద భోజన పూజనాదులన్. 12

క. హరిభక్తియు గురుభక్తియు
నురురక్తియుఁ బుటముగాఁగ • యోగీంద్రశిఖా
భరణము ముక్తామయతా
స్ఫురణము భువనప్రశస్తి • మునగ జిగిమీరెన్. 13

సీ. మును మీనగుటఁబట్టి • మునులు వైచినబత్తి
వలఁబోలె జిక్కమా• దలఁ దలిర్ప

దాల్చి నిద్దంపుబుద్ధిఁ ద ♦ ద్దారకుండు
చక్రిహస్తార్చనమున కు ♦ పక్రమించు. 20

సీ. అభిషేక మొనరించు ♦ నాకాశవాహినీ
జననకారణపాద ♦ జలరుహునకు
వైచుఁ దోమాలియ ♦ నైజయంతీకాంతి
వలయితవక్షఃక ♦ వాటునకును
గాశేయమర్పించుఁ ♦ గాంచనమయపట
పల్లవారుణకటి ♦ బంధురునకుఁ
జందనం బలఁదు నీ ♦ ళేందిరాకుచకుంభ
సంగికుంకుమపంకి ♦ లాంగునకును

గీ. రత్నహారంబు సాతుని ♦ ర్యత్నసిద్ధ
కౌస్తుభోదర్చిరభిరామ ♦ కంధరునకు
ధూపకల్పనమున్నగా ♦ దీపమిచ్చుఁ
దెలివ! యాతఁడు త్రైలోక్య ♦ దీపకునకు. 21

క. నిడుదచిగురనఁటిమూకున
నిడి వివిధాన్నములు భూసు ♦ రేశ్వరుఁడొసఁగుఁ
బడి ఘంట మొరయఁ జేయుచు
జడనిధితల్పునకుఁ బూర్ణ ♦ సంకల్పునకుఁ. 22

క. భూమిసురసూతి సాల
గ్రామశిలావారి కంబు ♦ గర్భస్థము ది
వ్యామోదశ్రీతులసీ
కోమలదళ సురభితంబు ♦ గురుఁనకు నొసఁగుఁ. 23

మ. తిరువారాధన మిట్లొనర్చి ధరణీ ♦ దేవాన్వయశ్రేష్ఠుఁ డా
హరి కర్పించుటఁ బావనంబులగు శా ♦ ల్యన్నంబులు న్నేతులుఁ

వరుగుల్ చారులు పప్పు లప్పడములు ♦ న్దాలింపులున్ బూపముల్
పరమాన్నంబులుఁ బెట్టు నెట్టనభుజిం ♦ పం దల్లికిం దండ్రికిన్. 24

వ. ఇట్లు కడువృద్ధులు శిథిలబుద్ధులు నగు జనయిత్రీ జనయిత లంగని మని నడచుచు నడుగులకు మడుఁగులొడ్డుచు నడుగునెడఁ బులిజున్నేనియుం దెచ్చియిచ్చుచుఁ గోత్రయగు మచ్చికం గచ్చవదలక గోము మెఱసి యోమనగాయలంగా నోముచుఁ గాలోచితంబుగా నోములు నోమించుచు నద్ధరామరనందనుండు జగదభినందితుండై యుండి వెండియు. 25

క. పరలోకావాససుఖా
దరపరతం జనినతల్లి ♦ దండ్రులకొసఁగెన్
గురుభక్తి నిగుడుకొడుకు కతి
కరుణామతి గంగ నస్థి ♦ గయఁ బిండంబున్. 26

క. ప్రేయసివలనఁ బ్రబోధవి
ధేయమతుల సుతులఁగాంచి ♦ తీర్చెఁబితౄణం
బాయయ్య తదీయంబగు
ప్రాయపుఁ బ్రొద్దంతఁ గొంత ♦ పడమరఁ దిరిగెన్. 27

క. భాషావిభు నిభుఁ డమ్ముని
యీషణదూషణమొనర్చి ♦ యిలు మఱచి మదిన్
శేషఫణి శయనుఁ గను నభి
లాషోన్నతిఁ జేయుఁ దపమి ♦ లాధరతనయా! 28

సీ. మిసిమింతుఁడునుగాక ♦ వసియించుఁ గుత్తుక
బంటిసీటను బుండు ♦ వంటిచలిని
మోముదమ్మికిఁ దేటి ♦ మొత్తమై పొగపర్వ
వ్రేలుఁ గ్రిందలగాఁగ ♦ వృక్షశాఖ

చ. లలితశిఖిపుష్పమృదు • లంబులు నీచరణంబు లక్కటా!
యిలయిది గర్కశ మిట్టు లల•యించుట గాదని ప్రార్థనామృదూ
క్తులు సెలఁగంగ వెళ్లి పొదివి•తొల్చెదువుల్ తగుఁవిన్నపంబులం
బలుమఱుఁజేయుచందమున•బంగరుటందియ లుగ్గడింపఁగన్. 32

క. మెత్తఁగ నూఱిన చుట్టుం
గత్తిన్ మధుకైటభారు • కంఠము లలనాఁ
డొత్తిన హత్తిన చెన్నుం
దిత్తులక్రియఁ దొడల యడ్డ • తిత్తులు వేర్లన్. 33

క. మాయామావృతుఁడగునాత్మని
పోయగమును దెగడుతీఁగ • పొగలు ముచ్చ
ట్లై యునికి సంగరహితం
బౌయెన్ గాకున్న జఘన • మభిరామ మగున్. 34

క. ఇట నభ మిట భూవలయం
బిట బలిసద్మంబు మందు • నిరవు లని యనన్
బటువులగువళులచెలువునఁ
బుటపుటనై యున్నచిన్ని • బొజ్జ గదలఁగన్. 35

చ. తులసికిఁ బచ్చరాకుదురు • తోయదవాహనరత్నవేది యు
క్కలిమిమెఱుంగుఁబోడికిని • కౌస్తుభఘుర్మగభస్తికిన్ నభ
స్థలము ననంగఁ బొల్చి నిర • తంబు కృపావిభవంబునింటిపో
ర్తలుపుఁ దలంపుసేయుచు ను•రంబుకరంబు పరిస్ఫురింపఁగన్.36

క. కలుషఖగవధవిధానా
కలితఘుటిక లనఁగ గ్రిచ్చ • కాయలు వలచే
నెలకొనునలజిలిబిలివ
న్నెలవన్నెలనంచి నిండి • యిం పలరారన్. ౩7

క. లలిత నిజవామకరతల
కలితకనత్కంబుకాంతి ♦ గలకలనవ్వన్
గలువలచెలిగిలిగింతల
నలువగు ఱాలన్ బిసాళి ♦ నలువగుఱాలన్. 38

క. నిజధైర్యౌదార్యములను
గజములకుం బాడమునిడుద ♦ కరములువోలెన్.
భుజములు పోషితభక్త
వ్రజములు కరవిజితపుష్క ♦ రజములు పొదలున్. 39

క. వదనైకసత్పంభకనక
సదనము సిరికొలు కొనర్చు ♦ సన్నిష్ట నిలువున
మొనగలింటిశంఖశంకువా
యిది యనఁగాఁ గంబుకంఠ ♦ మింపు వహింపన్. 40

క. బింకపువాత్రిశల వాతెఱ
మంకెనపూఁదేనెతేట ♦ మానక పైఁబై
నింకఁగ నింకఁగఁ బల్మఱుఁ
బంకించుటఁ బోలె మోవి ♦ బచ్చెన హెచ్చన్. 14

క. తళుకుమొగమునెలపదకము
నెలవున నిడుదీరుగాఁగ ♦ నిలిపినయాఖం
డలనీలకళికక్రియ ని
ట్టలమై స్ఫుటనాసికాపు ♦ టము దీపింపన్. 42

తే. తళుకుఁజెక్కులు మకరకుం ♦ డలకలాప
మరకతద్యుతిరింఛోళి ♦ హారిణలక్ష్మి
మండలంబుల లాంఛన ♦ మంజిమములు
గానిపించువిధంబునఁ ♦ గలయఁ బ్రోఁక. 43

చ. తరళమసారసారనిభ • తారకముల్ సితపద్మపత్రబం
ధురములు రాధికాహృదయ • తోయజకోరకబోధనక్రియా
తరుణతరార్కరుగ్విలసి • తస్ఫుటరక్తిమసక్తకోణభా
స్వరములు సూక్ష్మపక్ష్మములు•వాలికకన్నులు చెన్నుమీఱఁగన్.

తే. అలకతిమిరంబు తనుగప్పు • ననుభయమున
ముఖసుధాసూతి నునువెల్గు • ములికిఁ గూర్చి
సవదరించినసింగిణి • చాయ నొసలి
వంకచూపునఁ దగెఁ గఱి• వంకబొమలు. 45

క. బలభిదుపలాది మాళిన్
బలపలగాఁ బొదువుముదిర • పటలముపగిదిన్
లలితోత్తమాంగతలమున
జిలుగుందళుకొత్తుచలిది • చిక్కము దనరన్. 46

శా. దిగ్వాసుం డురుపింఛలాంఛితశిఖో • దీర్ణుండు వర్షావయో
ముగ్వారుండు నవాంబుజాహితలతా • ముక్తాంగదుండున్ సుధా
రుగ్విస్మేరముఖుం డనంగశతజి • ద్రూపాధికుం డగ్రభూ
వాగ్గర్వోద్భవభూమి శ్రీవిభుఁడు శ్రీ • వత్సాంకవక్షుండునై. 47

క. నొడువులపడఁతుకమగసికిఁ
బొడచూపని తనదురూపు • పొడగనిపించెన్
జడనిధిశయనుఁడు కొంగున
ముడిచినమణిగాదె భక్త • ముఖ్యులకెల్లన్. 48

క. నిగనిగనివిదళకదళీ
యుగళీ న్నగి జిగిఁదొలంకు• నూరులఁగనిచొ
క్కుఁగదురఁజేయుజగత్పతిఁ
దగిలి కనుంగొనుచు మునిమ • దావళి మెలమిన్. 49

గీ. విపులవీక్షణశక్తిచే ♦ వెండికుండ
లీంద్రశలిమాంగరుచిసుధ ♦ యెత్తికోలి
సంతతవ్రతకల్పనా ♦ జాయమాన
దుస్తరక్లేశమంతయుఁ ♦ దొలఁగఁ ద్రోచి, 50

ఉ. ఆవుఁదల్చుపచ్చవెదు ♦ రంఘ్రియుగాంతరవీథి నూఁది యు
గ్రావనిఁ దేజరిల్లు కటి ♦ హస్తసమన్వితుఁ గౌస్తుభాంకు నిం
దీవిభు నింద్రనీలనిభ ♦ దేహుఁ గనుంగొని హర్షవర్షధా
రావిలమానసుం డగుచు ♦ నమ్ముని కృత్యవిమూఢబుద్ధియై.51

చ విలిఖితమో శిలాకృతియొ♦ విస్మృతిరూపు వహించెనో యనన్
జలనవిదూరుఁడయ్యెఁ దొలు ♦ సావిపయోధరధారఁ దోఁగున
య్యెలఁ దళుకొత్తుకొత్తపులు♦ నేపున వే పులకల్ తనూలతన్
మొలవఁగనున్న నవ్వియదు♦ముఖ్యుఁడు తాపసముఖ్యునిట్లనున్.52

ఉ. నిచ్చలు నిచ్చలోఁ బొదలు ♦ నీపితృభక్తికి జ్ఞానశక్తికిన్
మెచ్చితి నిచ్చితిం గరము ♦ నీయెద నీయెడ యేల? వేఁడుకో
మిత్రచ్ఛిదఁ జెచ్చెరన్ వలయు ♦ నీప్సితముల్ శతమేని దీన నే
హెచ్చమునొచ్చెముంజొరదు♦భూసుర కేసరి! నమ్ము నావుడున్.53

శా. భస్మోద్ధూళనపాండురాంగము రమా ♦ పాణిశేశు పాదద్వయిన్
విస్మేరాంబుజగామిహంస మిది నా♦ వేవ్రాల్చుచున్ లేచి ‟దే
వాస్మాకం శరణం త్వమేవ గతిర ♦ న్యోనాస్తి దుర్వాసనా
పస్మారంహర" యంచుఁబల్కి—మఱియున్♦భక్తుండుభక్తిస్పృహన్.

సీ. పాదలునీపాక్కిటి ♦ పువ్వకాన్పుఁగదా
పెనుమాయ పిల్లలఁ ♦ బెట్టు టెల్లఁ
బొడమునీమొదలియూ ♦ ర్పులనేర్పులన కదా
చదువుసంధ్యలు గల్గి ♦ జగము మనుట

కెరలుసీయుడుగుఁడా ♦ మరలతేనియఁ గదా
పాపంపుఁబెనురొంపి ♦ పలుచ నగుట
పొసఁగునీ తెలిచూపు ♦ పసగదా యిదిరాత్రి
యిదిపగ లనుమేర ♦ లెఱుఁగఁబడుట

గీ. భవనఘటనకు మొదలికం ♦ బమునుబోలె
భువనమున కెల్ల నీవాది ♦ భూతుఁడగుట
నిట్టనిలుచున్కి చేఁగాదె ♦ నెట్టుకొనియె
గెంటుఁ గుంటును లేక ల ♦ క్ష్మీకళత్ర! 55

చ. ముదమునసోమకాసురుఁడు ♦ ముచ్చిలియచ్చలమారఁ గొన్నప్రాఁ
జదువులు తెచ్చి తజ్జఠర ♦ సాంద్రతరాంత్రము లంట నంటుబల్
గదురు దొలంగఁ గీర్తియను ♦ గంగఁ దొలంచి విధాతృవిస్ఫుర
ద్వదనసరోజగంధలలి ♦ తంబులు చేసితిగా జగన్నిధీ! 56

ఉ. కోపనశాపనవ్యశిఖి ♦ గోర్మ్రుసఁగం గసుగంది క్రమ్మంది త
త్తాపము నాఁపలేక తిమి ♦ ధామజలభ్రమిఁ గూలి తూలుజం
భాపహరాజ్యలక్ష్మి వెఱ ♦ పాఱఁగఁ దేర్చవె యీఁతకాయరూ
పై పృథుకర్పరంబమర ♦ నాశ్రితరక్షణా! దక్షిణేక్షణా! 57

ఉ. ఆ పెనువెల్లిఁ గ్రిబ్బుమక ♦ రాకరమేఖల నీవు దేర్చి య
ష్టాపదటంకవిభ్రమవిడంబిని ♦ యా నిజదంష్ట్రఁగూర్చుత
దూర్ధ్వపము దీపితంబగు స ♦ రోరుహలోచన! సప్తజిహ్వజి
హ్వోపరిభాగధూమవల ♦ యోపమమై విలయోపలబ్ధులన్. 58

చ. అలఘుజగద్ద్విషద్ద్విపఘు ♦ టాంకుశశాతనఖాంకురాగ్రలాం
గలముల మున్ను నీ వసుర ♦ ఘస్మర! వైరిభుజాంతరాళజాం
గలమహిఁ జాలువట్టి పయిఁ ♦ గ్రమ్మెడు నెత్తురునీరు వెట్టి యం
దలుకవె? కీర్తి పూర్తికల ♦ మాంకుర మిందిరమాఫలార్థివై.59

క. దండితబలినై జగములు
నిండఁ బెరుగుచున్న వేళ ♦ నీయడుగున భూ
మండల మతిసూక్ష్మాకృతిఁ
గొండికమచ్చయును బోలెఁ ♦ గోమరొందు హరీ! 60

ఉ. మాతృకఠోరకంఠబిల ♦ మార్గగళద్రుధిరారుణాననం
బై తళుకొత్తుదోఃపరశు ♦ హంసికి మేఁతయొసంగవే? రిపు
క్ష్మాతలనాథమేచకక ♦ చాకుచహారమృణాళనాళసం
ఘాతము నూతనైణమద ♦ కర్దమవర్ధనసంప్రభూతముల్. 61

ఉ. దారుణబాణపాతమద ♦ ధారలు గాఁగఁ గ్రోలుదోర్ధను
ర్వారణరాజుఁ గొల్చి దశ♦వక్త్రముఖాంబుజవాటిఁ గూల్చి బ్రం
దారకహృత్సరోజములు ♦ దానన చేసి వికాసమానరా
కారత నొందఁ జేసినప్ర ♦ గల్భత నీక తగుఁ దగుఁ హరీ! 62

మ. వికటోత్తంభితసీరభోగపటలీ ♦ విస్ఫూర్తిమనూర్తి కం
చుకనిర్మోకభయానకంబు వికృతా ♦ శుక్ష్వేళ మగ్నిచ్ఛటా
వికిరక్రూరనిరీక్షణంబు నగునీ ♦ వేషంబు శేషానుకా
రికళ గ్రాలదె? క్రోలదే? సమదనై ♦ రిప్రాణవాతూలముల్. 63

చ. ప్రతిదినకేశలుంఛనపు ♦ రాయిడి నెట్టన బట్టఁగట్టి పైఁ
బుతపుతమంచు నున్నకులు ♦ బోడతలల్ ధరియింప నోడియుఁ
సతముగ సొమ్ముగాన నిడఁ ♦ జాలవుగా శిఖిపింఛవల్లి సౌ
గతమతధుర్య! దానిఁ గటఁ ♦ గట్టుము పుట్టము మిన్న కేటికిన్.

చ. కలిహిమవేళ శోభనపుఁ ♦ గమ్మవిరుల్ సకలంబు డుల్చి భూ
వలయవనంబుఁ గప్పికొని ♦ వర్తిలుజాడ్యపుటేఁద పర్వగా
నలరులకారులీల భవ ♦ దాగమనం బిటఁగల్గ రోషపా
టలమగునీకనుంగడల ♦ డాలు నగుఁ జిగురాకు నాకృతిన్. 65

సీ. నీటిలోఁ జివుకక ♦ నిలిచి క్రమ్మరుపూన్కిఁ
గఠినకర్పరపుఁజు ♦ క్కానుబిగువు
దంష్ట్రి నెత్తినమహీ ♦ తలపుగాడుపుఁజీర
యురుదారుకలనయం ♦ దుదయమగుట
పరులకుఁ దనకట్ల ♦ బలిమి చూపువిధంబు
పులిమిన నెత్రుగు ♦ గ్గిలపునూనె
ద్వీపాంతరమునకుఁ ♦ దెగువమైఁ జను పెంపు
చేముట్టునాఁగంటి ♦ జీమూతగులు
గీ. సాగతాగమమూలిమి ♦ శాస్త్రసరణి
వల్గువల్గనచిత్రిధా ♦ వనముగల్గు
నిన్నుఁ దరిచేసి భవవార్ధి ♦ నిస్తరించి
దరిఁ దటియకున్నఁ గలదె? మో ♦ దముమురారి! 66

చ. లలితకళావళీమృదుప ♦ పలాశపరీతసుధామరందపి
చ్ఛిలసుషమాప్రబోధగుణ ♦ జృంభితపూర్ణసుధాంశుబింబపు
ష్కలసితపుష్కరాయతన! ♦ పట్చరణేంద్రనవేంద్రనీలక
జ్జలజలజాప్తజాజలని ♦ జద్యుతివంచక! కాంతికంచుకా! 67

క. ఉత్పత్తిస్థితివిలయా
ర్థోత్పాదక! విఠ్ఠలాహ్వ ♦ యోన్నత! సత్రా
జిత్పుత్రికాసతృష్ణదృ
గుత్పిబముఖడా పఘనప ♦ యోధరశాలీ! 68

స్రగ్విణి
అండజాధీశవా ♦ హా! జగద్దేహా! దో
ర్దండచండారిని ♦ ర్దారితారీ! నతా
ఖండలా! గండరిం ♦ ఖనన్మణికుండలా!
పుండరీకేక్షణా! ♦ ప్రోవునన్ సుక్షణా! 69

చ. అలికులభాగకుంతలము ♦ లందపుముద్దుమొగంబుఁ జేరలం
గొలువఁగవచ్చుకన్నులుఁజి♦గుర్నగుమోవిమెఱుంగుఁజెక్కులున్
వలమురియట్టులే మొసలి♦ వాగడపోఁగులు లోఁతుపొక్కిటన్
మొలచిన తెల్లదమ్మి బలు ♦ మూపులు నీలవినీలదేహమున్. 70

చ. కలిగినవానిఁ బ్రాఁబలుకుఁ♦గమ్మని యూర్పులవానినెందునే
వెలుఁగునుగాని పెన్వెలుఁగు ♦ వెంబడినిం ఘనువాని నంతటన్
వెలసినవానినిన్ గనని ♦ వెంబరపుట్టవు జాతిపుట్టువుం
బలె గతిఁగాన లేఁడు యతి♦ మానసహంసక! కంసహింసకా! 71

ఉ. ఛత్రిత శేష! నాయెడఁ బ్ర ♦ సన్నుఁడ వయ్యెదవేఁ గృతోగ్రశ
త్రుత్రపమైన యీలలిత ♦ రూపముతో నిచటన్ వసింపు మే
క్షేత్రము నెట్టితీర్థమును ♦ జెందనియున్నతిఁ బొందుగాక యీ
క్షేత్రముతీర్థమున్ గడుఁబ్రి♦సిద్ధిమదాహ్వయలబ్ధిఁబొందుచున్.72

తే. క్షేత్రకులరాజమైనయీ ♦ క్షేత్రమునకుఁ
దీర్థకులరాజమైనయీ ♦ తీర్థమునకు
నిఖిలసురనాథకర్తృత్వ♦ నియతిఁ బొదలి
యీ విట వసించుటయె వరం ♦ బిచ్చుటనుడు. 73

సీ. అనుకంప పెనుమోపు ♦ గనుసొంపునకు వింత
చెలువంబు మొలపింపఁ ♦ జిగురుమోవి
పవడంపుఁ గొన దంత ♦ పఙ్క్తిప్రభలు పుష్పి
తము గాఁగ హరివల్లి ♦ ధరణిదివిజ
నివహవరేణ్య నో ♦ నిఖిలధర్మధురీణ!
యగునట్లుభవదాహ్వ ♦ యము వహించు
నితీర్థమున వసి ♦ యించెద నదుచక్కి
నీకుఁ జేతఃప్రీతి ♦ నెలకొనంగ

గీ. భీమఘుర్మాంబునంభూత ♦ భైమి నీదు
క్షేత్రమును దీర్థమును నిజో ♦ త్కృష్టసలిల
వేశిసంప్లావితమ్ముగా ♦ వింపఁగలదు
నాకు నెంతయు నిష్టము ♦ సర్వఁ గడఁగి. 74

వ. పత్రికటసుస్థాకారంబునం బశ్చిమాభిముఖుండనై సరోవ్రత్త మత్వంబు నిర్వహింప నేనిచ్చట ముచ్చటందవిలి వర్తించెద. సకల క్షేత్రతీర్థోత్తమంబు లగు నీక్షేత్రతీర్థంబులుం బౌండరీకంబులై పాండురంగాహ్వయుండ నగు నాకు నెక్కాలంబును శ్వేతద్వీప సుధా సాగరంబులకంటెఁ బ్రియంబులై నిత్యనివాసంబులై యత్యంత విభ వంబుల నభిరామంబులయ్యెడు. నీకోరినయట్ల యిచ్చితినని యచ్చ తుర్భుజుండు పుండరీకునిఁ జేకొనియె. 75

శా. శీతాహార్యకుమారి! విన్ముటులు ల ♦ క్ష్మీజాని వాచంయమి
వ్రాత శ్లేష్మనకుఁ వరంబొసఁగి సాం ♦ ద్రప్రీతి నచ్చోన మ
ధ్యేతీర్థంబున నున్నవాఁ డిపుడు భు ♦ క్తిన్ ముక్తి నీఁజాలు వి
ఖ్యాతిం దాల్చి విచిత్రరత్నచయర ♦ మ్యస్వర్ణహార్మ్యంబునన్. 76

చ. నలువమొగంబు లెట్లుసృజన ♦ ప్రథమాహమునం దలిర్చి న
న్నలువున సిద్ధ సాధ్య నర ♦ నాగ మరుద్వర యోగిమండలీ
కలకలగుంభితంబులయి ♦ కాంచనచారువులైన నాల్గువా
కిళుల వెలుంగునున్నతని ♦ కేతనరాజమునం బ్రసన్నుఁడై. 77

గీ. పుండరీకుండు క్షేత్రపా ♦ లుండు గొలిచి
యుండ నవ్యక్తముఖ్యనం ♦ యుక్తుఁడగుచుఁ
బాండురంగండు భక్తక ♦ ల్పద్రుమీల
నిష్టఫలసిద్ధిఁ దోరహ ♦ త్తించు నింతి! 78

క. ఆకంబులలితకరు బుధ
కోకంబులపాలిహేళిఁ ♦ గొలుతు రబల! ము

ల్లోకంబులవారలుఁ బరి
పాకంబుల నాత్మసుకృత • పరికర మొప్పన్. 79

వ. అర్ధయోజన విస్తారంబును దదర్ధాయామసంయుతంబును నై కంబుకంధరునకు నాకుం బ్రియజనకంబై సనకసనందనాది సజ్జన చింతితార్థ ప్రదంబై యమ్మహా క్షేత్రరాజంబు పుష్కరంబున కంటెఁ ద్రిగుణంబును గేదారంబునకంటె షడ్గుణంబును వారణాసి కంటె దశగుణంబును శ్రీశైలంబునకంటె ననంతంబును నై పుండ రీకునిపేరం బౌండరీకంబును మహీమండల మణికుండలం బగుచు నుండు నప్పరమధామంబు నే నధిష్ఠించి. 80

ఉ. ఆయదుభర్త నాహలధ • రానుజు నానవనీత చోరు నేఁ
బాయనిభక్తితోఁ గొలుతుఁ • బ్రత్యహముల్ గృహదైవతంబుగా
నోయరవిందకోరకస • హోదరచారుపయోధ రాఢ్య! ని
శ్రేయసకాంక్షఁ దక్కొరులు • చేరి భజింతు రనంగ నేటికిన్. 81

క. ఇతరక్షేత్రస్థితదై
వతపూజలఁ గలుగుఫల మ • వశ్యము గలుగున్
శతదశకగుణితమై యూ
ర్జితమతిఁ దక్షేత్రపూజ • సేయునరునకున్. 82

క. నరుఁ డఱువదివేలేఁడు లి
తరదైవతదర్శనమునఁ • దాఁ గనుఫలమున్
బొరయు నలవోకవలె శాం
కరి! యాక్షేత్రోత్తమంబుఁ • గనుఁగొన్నంతన్. 83

క. సకలక్షేత్రావాసము
నకంటె నందునికి యొప్పు • నరునకు మృగడిం
భకనయన! యేకదినవా
సకృతికి వే దొరకుఁ గాన • సాయుజ్యంబున్. 84

సీ. దొరకు జన్మమునకుఁ ♦ బరమశైవజ్యమౌ
మాతృశుశ్రూషాన ♦ మాని యొకటి
చిలువాయనపువేల్పుఁ ♦ గొలముఁ గొల్వక వాసు
దేవు నారాధించు ♦ తెలివి యొకటి
దుర్వాసనలఁ బెట్టు ♦ దొసఁగులు విడఁదన్ని
యధ్యాత్మవాసన ♦ నలరు టొకటి
యుర్విజీవుల కెల్ల ♦ నుదయించి యుదయించి
తుది మర్త్యుఁడై పుట్టు ♦ పదవి యొకటి
గీ. కాలమున వచ్చునర్థుల ♦ కాంక్ష యెఱిఁగి
తృప్తి నొందింపఁగలుగంగఁ ♦ దిరుగు టొకటి
దుర్లభం బెట్టులట్లని ♦ దుర్లభంబు
మగువ! తన్నేత్రి వాసంబు ♦ మానవులకు. 85

చ. వినవె! యజస్రముఁ గుతప ♦ వేళ క్షుధార్తులకోటిఁ గూర్చి నే
త నెసరువెట్టి వండుకల ♦ ధౌతపుఁగూడు పసిండిపప్పు భో
జనమిడి యొండుచోఁ బడయఁ ♦ జాలెడుపుణ్య మగణ్యమై ఘటి
ల్లు నెలఁత! పౌండరీకమహి ♦ లో మెదుకొక్కటి పెట్టువానికిన్. 86

మ. నియతిం బాతిక మెత్తు కాంచనముగా ♦ నీ వెండిగానీ జగ
త్త్రియపూజ్యంబగుపాండురంగవసతిన్ ♦ దానంబు గావించు పు
ణ్యయుతుం డుండు నఖండలీలఁగలథా ♦ తాహార్యవర్యాత్మక
ప్రియగేహంబులలో భవాంతరమునన్ ♦ బృథ్వీధరేంద్రాత్మజా!

శా. ప్రావారాజినరాజిఁ గంబళతతిన్ ♦ బట్టాంబరాళిన్ దయా
ప్లావస్నిగ్ధమతిన్ జలిన్ గృపణవి ♦ ప్రశ్రేణికిన్ పైఁ గప్పఁ బో
యే వాఁడేనియుఁ బౌండరీకమహి వాఁ ♦ డిందుప్రభాకందళ
శ్రీవిభ్రాజియశంబులం బొదలు ధా ♦ త్రీదిజ్నభస్సీమలన్. 88

[illegible] ♦ [illegible]
[illegible] ను ♦ ఘంబులు గాదని [illegible]
[illegible] ♦ [illegible]లుఁ బొంది [illegible]
క్షేత్రపతిఁ భజించి తమ ♦ చెన్నఁటిపుట్టువు నీఁగుకోరిక. 89

సీ. పితరు లుబ్బుదురు హ్రా ♦ గ్గతుల నాత్మకులోద్భ
వుఁ డెవ్వఁడైనను ♦ బౌండరీక
మునకు నేగకయున్న ♦ యని యందురోసఁగుహా
వ్యమ్ముఁ గవ్యము నమేయ ♦ మైఫలించు
నవదరించఁగ లేరు ♦ సాత్వికంబగుభావ
మే నొక్కఁడును దక్క ♦ నివుల నవుల
భక్తు లెవ్వరు రజః ♦ ప్రకృతిఁ దాల్తురె కాని
పౌండరీకేశుశాం ♦ బరికతమునఁ

గీ. దలఁపమానసమునఁ గల్గు ♦ కలుషమడఁగు
పొగడుమాటలనగుదోష ♦ ములు దొలంగు
కనుఁగొనఁగఁ జేతఁ బెట్టున ♦ ఘంబు లుడుగు
నమ్మహాక్షేత్రమునకు నె ♦ య్యాది సమంబు. 90

సీ. కుఱుచలై గుమురులై ♦ గొనబులై లేఁబాఁప
కొమ్మఁ జుట్టినజడల్ ♦ గుమురుకొనఁగ
మెఱపులై మిట్టలై ♦ మిక్కిలిబటువులై
కాలుకన్నుల చెన్ను ♦ గబ్బుదేరఁ
జిక్కనై చెలువమై ♦ చిన్నదియై యొప్పు
మోము దంష్ట్రాటంక ♦ ములఁ దలిర్ప
నీలమై నిబిడమై ♦ నిద్దమై నింగి క్రిం
దుగనున్న బలుమేని ♦ పొగరు మెఱయఁ

సీ. బదరీపతి కేతనుని పురః ♦ క్షేత్రమూఁది
యున్నశ్రీక్షేత్రపాలకు ♦ యోగి లోక
రమణు ముప్పదిరెండక్ష ♦ రములమంత్ర
రాజము జపించికొల్వ దొ ♦ రకు శుభములు. 91

ఉ. చేరి చతుశ్శ్రుతుల్ చిలుక ♦ చేఁ జదివించుచు నక్షమాలికా
ధారిణియై తనుప్రభలు ♦ దట్టపువెన్నెలపండువండఁగాఁ
దూరుపువాకిటన్ వెలయు ♦ తోయజగర్భునిరాణి వాణి నీ
హారమయూఖబింబముఖి! ద ♦ శాక్షరమంత్రమయిం గనం దగున్.

ఉ. శ్రీరమణీమనోరమణు ♦ చేతఁ బ్రతిష్ఠితుఁడౌట దక్షిణ
ద్వారమునందు లింగతను ♦ వైభవమొప్ప షడక్షరీవిధుల్
గోరి భజించువారలకుఁ ♦ గొంగుధనంబయి వేణుమధ్రితో
నారదుఁడున్నవాఁడు రద ♦ నచ్ఛదభర్త్సితవిద్రుమద్రుమా! 93.

ఉ. శౌరి భజించుచున్ భుజగ ♦ సద్మమునన్ విహరించువాజ్మనో
హారిణు లైదుగోటులు మ ♦ హామహిమాన్వితు లర్థి దక్షిణ
ద్వారమహిన్ విహారరతి ♦ వర్తిలి యవ్విభుఁ జేరి యెన్నఁడో
యారతులిచ్చినారఁట త ♦ దాయతధూమము నేఁడుఁ బర్వెడున్.

క. చేడియ! యాద్వారమె యదు
చూడామణి క్రీడలాడు ♦ చోటమ్మహితా
క్రీడనభూస్థలి హరిఁ గూ
డాడుఁజుమీ! యమరవల్లి ♦ భావళి నేఁడున్. 95

ఉ. సేచనముఖ్యకర్మముల ♦ సేఁతకు నూతనమైనయచ్చటన్
శ్రీచరణంబు లున్నయవి ♦ సింగము వెన్నున నంటి వానికిన్
వే చని మ్రొక్కి పూజనము ♦ నేమముతో రచియించెనేని శీ
తాచలపుత్రి! పూరుషుఁడి ♦ హంబుఁ బరంబుఁ గరంబునన్ గొనున్.

చ. మరలఁగ్రఁబట్టఁ గట్టఁగ స॰మస్తమరుత్కరిఁ దన్నుఁ గూర్చి పే
చ్చరిక ధరింపఁబోలు నన ♦ శాతముఖాంకుశపాశముల్ వికస్వరరుచిఁ దాల్చి పశ్చిమపు♦ వాకిట హ్రీంకృతిమంత్రరూపభా
స్వరభువనాధినాయిక ల॰ సదిసనాయిక యొప్పు నెప్పుడున్. 97

ఉ. హారిపథాధిరూఢ మహి ♦ షాసురకీకసవర్గ దుర్గ నా
గారిమహోపవాహ్య సద ♦ శాక్షరమంత్రవిశేష యుత్తర
ద్వారమునందు నుండు నిర ♦ తంబును దా ఫలపూపపాయసా
హారములం దనుం దెలచు ♦ నయ్యలదొడ్డికి వేల్పుగిడ్డియై. 98

క. ఇవి నాలుగుద్వారంబులు
ధవళేక్షణ! ద్వారదేవ ♦ తలు నల్వురు వీ
రవధానబుద్ధి నేత
త్సవిశేషార్చన మొసర్ప ♦ సంపద లొాదవున్. 99

గీ. సమరసన్నద్ధరక్షోని॰ శాతహేతి
పాతజాతక్షతవ్రాత ♦ భూతిఁ దనరు
పరమపదనాథునెమ్మనఁ ♦ బరఁగువర్ణ
రాజి యఖిలంబు శ్రీమంత్ర ♦ రాజ మబల! 100

మ. అహరారంభమునందురక్తుఁడయి మ॰ధ్యాహ్నంబునన్ శుభ్రుఁడై
గ్రహరాడస్తమయంబునం దసితుఁడై ♦గాయత్రియుం బోలి య
య్యహిపర్యంకుఁడుమూఁడుమూర్తులకుని॰మ్మైయొప్పఁబూజింతుర
న్వహమున్ గోమలి! మూఁడుమాత్రములని♦ త్యానందకాంక్షన్.
మునుల్. 101

క. మూర్తిత్రితయమయత్వ
స్ఫూర్తిన్ వర్తించుచిహ్న ♦ ములు మంత్రము శ్రీ

భర్తృకృప నే నెఱుంగుదుఁ
గార్తికరాకాసుధాంశు ♦ కమనీయముఖీ! 102

మ. గదసారించి త్రిదంష్ట్రనాముఁడగుర ♦ క్షఃపాలుఁ డొక్కండు బి
ట్టదరుల్ వాఱ మురారిమెడ న్బరివ్రే♦ యన్ దాన నద్దిక్కు నొ
చ్చె దళింపంబడియున్ దదుగ్రహతిగా ♦ సిన్ క్షుల్లకాధిక్యమున్
మృదుసంరంభముతోడ నవ్వుచును దు♦న్మెన్ వాని నద్దేవుఁడున్.

సీ. ధాత్రీధరాత్మజ! ♦ క్షేత్రాత్మ యనఁగఁ దీ
ర్థాత్మయనఁగనుమూ ♦ ర్త్యాత్మ యనఁగఁ
ద్రివిధమూర్తులు దాల్చి ♦ దీపించు నతఁడు ము
న్నెలవులయెడఁ బూజ ♦ నీయుఁ డగుటఁ
గంబళ, కౌశేయ ♦ కలధౌత, కాంచన
గంధసింధుర తురం♦ గమ శతాంగ
కర్ణికాగ్రైవేయ ♦ కటకకన్యాగంధ
కాశ్మీరకస్తూరి♦ కా గవాజ్య
గీ. ధాన్యదానాదిబహుపదా♦ర్థంబులచటఁ
బెద్దలకు వేదవిదులకుఁ ♦ బ్రీతినొసఁగ
క్షేత్రమయమూర్తి యగుదేవ ♦ కీసుతునకుఁ
బాండురంగాధిపతికిని♦ బ్రమద మొదవు. 104

ఉ. చేడియ! తీర్థమూర్తి కడఁ ♦ జేయఁదగున్ మనుజుండు సేచనా
క్రీడనముల్ మహీదివిజ ♦ కేసరులన్ బరమాన్నశర్కరా
పాడబ గోఘృతేక్షురస ♦ శాకములన్ ఫలపానకాదులన్
వీడెములన్ బ్రమోదపద♦వీమదలిప్సఁ జెలంగఁ జేయుచున్, 105

క. ప్రణుతమతి నర్ఘ్యపూజా
ర్పణమునఁ దత్తీర్థమూర్తి ♦ భజియించుసుధీ

మణులకు నభిముఖమతి బ
ర్హిణబర్హాకల్పుఁ డొసఁగు ♦ నిహాముంబరమున్. 106

వ. అని పూర్వార్ఘ్యార్చనావిధానకథ నొసఁగుచుండె పంచముఖుండు శిఖరినందనతో నిట్లనియె. 107

సీ. మంత్రిపూతముగాఁగ ♦ మజ్జనంబొనరించి
పరిన్నని శుభ్రాంబ ♦ రములు గట్టి
ఘనసారమిశ్రిత ♦ గంధసార మలంది
పరిమళంబుడివోని ♦ విరులు ముడిచి
సిగరలతోడ గో ♦ క్షీరపూరముతోడ
బహువిధంబగుఫల♦ప్రతతితోడఁ
బిండివంటలతోడ ♦ ఖండశర్కరతోడ
నేతులతోడఁ దే ♦ నియలతోడ
గీ. దధులతోఁగూడఁ దగునివే ♦ దనలతోడ
వనధివనధాముఁ బీతాంబ ♦ రుని రమాకు
చరజనివిలిప్త శిఖిబర్హ ♦ ధరు మఖాంశ
భోక్తఁ బూజింపఁదగుఁ జైత్ర♦ మున శుభాంగి! 108

సీ. గంగఁ గాటుకకొండఁ ♦ గప్పనొప్పిదము ద
ళ్కొత్త నావులపాల ♦ నోలలార్చి
బలితంపునురువుజాం ♦ పము ధార్తరాష్ట్రింబుఁ
జుట్టినక్రియఁ దెల్ల ♦ పట్టుగట్టి
ముదురువెన్నెల యొప్పు♦ మున్నీటిఁ గమిచిప
ట్టినలీలఁ గ్రాలఁ జం ♦ దనముఁ బూసి
నడగండ్లు పొదువుశా ♦ ద్వలమహిఁ బొల్చుపా
ల్పుగ మల్లెపువ్వులఁ ♦ బూజచేసి

గీ. మండువేసవి వాసవి ♦ మనుపుకాపు
విబుధతతిపాలి వీడర ♦ వెన్నమ్రొకు
భక్తసులభునిఁదెలిసి పూ ♦ ర్వోక్తభూరి
భక్ష్యభోజ్యాదు లర్పింప ♦ భద్రమొదవు. 109

సీ. వృష్టిగా శుద్ధాంబు ♦ వేణి మజ్జనమాచ్చి
శిఖరిమేఘముగ మం ♦ జిటి ఘటించి
కరకపాతంబుగా ♦ విరిగొజ్జెఁగిలఁబూన్చి
క్షమపంకిలతగఁ గుం ♦ కుమముఁ బూసి
మఘువగోపములుగా ♦ మణిహారమర్పించి
పలుమెఱుంగులుగ గీ ♦ పమ్ములెత్తి
గర్జితంబులుగ శం ♦ ఖక్వాణములు చూపి
పచ్చికగా ధూప ♦ పటలిఁబెనిచి

గీ. యుర్విబంటులభుక్తిగా ♦ నుష్ణతైల
పక్వగుడమిశ్రపిష్ట సూ ♦ ప పరమాన్న
రాసులొసఁగంగఁదగుఁ గారు♦ రాక హరికి
నట్టిబుతుధర్మములు చూపు ♦ నందమొంద. 110

సీ. మహినాలపాడి ము♦మ్మరముగాఁ బ్రభవింప
నవనవోజ్వల దధి ♦ స్నానవిధియు
శుభ్రాభ్రపట్టంబు ♦ లభ్రంబుపైఁబర్వ
లఘుధౌతవిమలచే ♦ లములకప్పు
సితకుశేశయ కాశ ♦ శశధరద్యుతిహెచ్చ
దొరకిన యుచితంపు ♦ విరులపూజ
శాలిపాకస్ఫూర్తి♦ గాఁరల గోరోచనా
సంమిశ్రచర్చిక్య ♦ సంఘటనము

గీ. వ్రజ భుజభుజుల భోజనా ♦ వలులవంట
కములు గావింప గోధూమ ♦ ఖండ ఖండ
శర్కరాఢ్య సుపక్వ భో♦జ్యములు నెఱపి
విష్ణుఁబూజింపఁదగు శర ♦ ద్వేళయందు. 111

సీ. పాథోధివిహ్వాతి సం ♦ భవతనూజాడ్యంబు
సంతప్తగోఘృత ♦ స్నపనరచనఁ
దులసి దండయకాని ♦ కలుగనితక్కఁ
మరువక, కుంద కు ♦ ట్మలసమృద్ధిఁ
గఠినకచ్చరపీత ♦ కౌశేయనిర్బంధ
మభిరామ చిత్రాంబ ♦ రార్పణమున
ముదురువెన్నెల ఁజేయు ♦ నుదరపోషణవృత్తి
నవ్య దివ్యాన్నపా ♦ నప్రశస్తి
గీ. నుజ్జగింపించి దెందాన ♦ కుబ్బునగ్ని
నిశలఁ గుంకుమ మగలు మై ♦ నిండనలఁది
గేహమున ధూపధూమ మొ♦క్కించి కుధర
ధరుని హేమంతమునఁ గొల్వ ♦ దొరకుముక్తి. 112

క. శిశిరాగమవాసరముల
యశోదగారాబుపట్టి ♦ నర్చింపఁదగున్
శశిముఖి! తత్కాలోచిత
కుశ కుసుమపటాంగరాగ ♦ కూర్పాసాదిన్. 113

క. ఋతువులనాఱిట నీక్రియఁ
బ్రతిదినము భజింపఁ బరమ ♦ పదనాథుఁడు వాం
ఛితశతము లొసఁగి భక్త
ప్రితతుల మన్నించు భక్త ♦ పరతంత్రుండై. 114

గీ. మురవిభంజను శ్రీక్షేత్ర • మూర్తి దీర్థ
మూర్తి మూర్తులకడ నేమ • మునను నర్చ
నర్చభాగ విశేషంబు • లానుపూర్వి
వినుము వినుపింతుఁ బరమాత్మ • విభవమహిమ!

గీ. పరమపదనాథుఁ డిరిగిరా • నిరువదేను
చేతుల ప్రమాణమునఁ గల్గు • భూతలంబు
ముక్తికరమైన శ్రీక్షేత్ర • మూర్తియందు వేది...
నర్చభాగంబు సుమ్ము చం • ద్రాస్థనిటల! 116

క. సకలోత్కృష్టోన్నతిఁ బా
యక యెయ్యది కీర్తివడయు • సత్తీర్థము పో
ల్తుక! యర్చాభాగంబై
యకుటిలగతిఁ దీర్థమూర్తి • యందు వెలుంగున్. 117

క. ఏనేల మూర్తియం ద
ర్చానియమవిభాగముఁ బ్ర • శస్తంబగు నా
స్థానమునఁ ద్రెంపక యె
వ్వానికిఁ దాఁ జేయుపూజ • పద్మగుణమిత్రా. 118

వ. కావున క్షేత్రమూర్తి తీర్థమూర్తి మూర్తిమూర్తులయందలి యర్చాభాగంబు లెఱింగి యర్చించుచు ననుచితాచరణవిముఖుండగు పుణ్యనిధికి సుముఖుండై పాండురంగం డఖండానందంబా పాదించునని యాపరమేశ్వరుండు పార్వతితో వెండయు నిట్లనియె. 119

మ. హరిపశ్చాద్దిశ నూఱువిండ్ల ప్రమా • ణాసక్తి కల్మిన్ శుభో
త్కరపద్మంబగు పద్మతీర్థమను తీ • ర్థంబొప్పు నచ్చోన సు
స్థిరతన్ శంఖము పద్మమన్ నిధులు వ • ర్తించుం దపోదీపితుల్
నర నారాయణు లున్నవారచట బా • లా! పిప్పలాకారులై. 120

సీ. సమస్తైకజ్ఞానవి ♦ భవమముతోఁగూడంగ
హరిమేన నవతార ♦ మైనవారు
మదముపోవఁగనిండు ♦ మనసుతోఁగూడంగ
బ్రహ్మచర్యము చిక్కఁ ♦ బట్టువారు
పరపురుషార్థసం ♦ పదతోడఁగూడంగ
ధనురాదిశస్త్రము ♦ ల్దాల్చువారు
దుష్టనిగ్రహవిధా ♦ ధురతోడఁగూడంగఁ
బూర్ణాక్షరోల్లసతిఁ ♦ బూనువారు
గీ. మహితగాంభీర్యధైర్యసా ♦ మగ్రితోడఁ
గూడ సౌజన్యరమఁగూడి ♦ యాడువారు
ఘనసపత్నీబింబనిభులు స ♦ హస్రకవచ
కవచనిర్భేదనులు వారు ♦ ధవళనయన!. 121

క. ఏపట్టునఁజూపట్టుదు
రాపట్టున మూఁడుకోటు ♦ లమరాంగనల
ప్రాపదపాత్రనిహితమణి
దీపకళికలగుచు శ్రీప ♦ తిఁ బూజింతుర్. 122

ఉ. దోశ్శయితారి శౌరి తన ♦ తోడ్వినకుండలముల్ నిజక్షమాం
తశ్శిలలోనదాపఁ బ్రమ ♦ దా! యొకతీర్థము కుండలాఖ్యమై
దుశ్శకునాది సంజనిత ♦ దోషశతంబు హతంబు సేయ నం
భశ్శుచితన్ బ్రసిద్ధమగు ♦ బన్నగశాయికి నీశుదిక్కునన్. 23

క. వరసింహమధ్య! యచ్చో
నరసింహుఁడు కుంజరా ♦ శనతఁదాల్చుట న
చ్చెరువగు దేవుఁడు నిజమం
త్రిరాజపూజైకతాన ♦ తాయుతుఁ బ్రోచున్. 124

క. ఓరాజవదన! యచటన
నీరాజన లబ్జనాభు • నికి నీనున్నా
రేరాళము హరివల్లభ
లారామలఁగొల్వనలయు • నయకాములకున్. 125

శా. అంశేందూద్వహ దేవి! హ్రీంకృతిధ్రువం•బై యున్నయచ్చోటికిన్
ద్రింశచ్చాపమితోర్వ నుత్తరమునం • దీపించుతీర్థంబు మున్
భ్రింశంబొందక వెన్కఁదత్సలిలధా • రంగూడెఁ బుష్పావలీ
సంశుద్ధాంబువు లాయెడం దగుజప•స్నానార్ఘ్యదానక్రియల్. 126

సీ. భరమానుతజేఁదోడు • పడవచ్చుగతిఁ దేవి!
తోఁ గరమూలజ• ద్యుతులు సాఁగ
నెలకులంబులచల్వ • నేర్చు నవార్కాంశు
లనఁ గపోలముల దీ • పాంశులంటఁ
గొడిఁబుట్టుకాళిమాం • కురపుమేఘములకు
మెఱుఁగులై చూపుఁగ్రొ • మ్మించులలర
స్నేహంబుపాత్రిని • క్షిప్తమౌటకు నుబ్బు
పగిదిఁ బాలిండ్లు ని • బ్బరమునిక్క
గీ. హరికిఁ బలువంకలును దగ • నగ్రవీథి
నిలిచి శతకోటిసంఖ్యల • నియమపరత
నారతు లొసంగు దివ్యక• న్యకలు ధన్య
మతులు గ్రీడింతు రయ్యుత్త• మస్థలమున 127

ఉ. గోపిక తొల్లి యోర్తు హరిఁ • గూర్చి తపంబొనరింప దాని ని
ష్టాపరతన్ మదిం గరఁగి • శార్ఙ్గి యుదోఁచినఁ జూచి వేడ్కతో
నాపసిగాపు పూపవయ • సా కెత్రిలోక విమోహనక్రియా
రోపనిరూపణంబగు స•రోరుహలోచను రూపుఁజూచుచున్. 128

గీ. వైషమేషవ విషమేషు ♦ శోషణమున
వేషమొకరీతిగా నిర్ని ♦ మేషనయన
యగుచు నెరగొంటఁ గదలని ♦ పొగరుమీను
దోయిఁజూపట్టుసప్తసిం ♦ ధువునుబోలె 129

గీ. క్లేశపాశంబుతోఁగూడఁ ♦ గేశపాశ
మురుల బర్హావతంసుండు ♦ కరుణ నిచ్చు
నీవి యెఱుఁగక యొక్కింత ♦ నీవిఁజాఱఁ
దచ్చరణములు మదిసంట ♦ మచ్చకంటి. 130

సీ. ఊరకుండినఁ జూచి ♦ యొక్కింత నగి కృష్ణుఁ
డిదియేమి నీవన్న ♦ నిందువదన
కుంచితావయవభం ♦ గురవృత్తిఁ దత్పాద
బిసరుహంబులు కేల ♦ బిగియఁబట్టి
మచ్చిత్తహారములు ♦ మధువైరి! నీపాద
వసరుహంబులు వీని ♦ వదలఁజాల
వీనిలావణ్య మీా ♦ వేషభూషణముగ
నాకస్మికార్థితం ♦ బగుట నడుగుఁ

గీ. గవ యిదిసలాంఛనంబగుఁ ♦ గాత యనుడు
సట్లయగుఁగాక సర్వంబు ♦ నతివ! నీ వ
సంబరవు ముక్తకేశివి ♦ నిఖిలభూష
ణాంచితాంగివినై యుండు ♦ మనియె శౌరి. 131

ఆ. అడియు నట్లయగుచు ♦ నభిరామమూర్తియై
తనదుసిండిజడలు ♦ దలఁగఁద్రోచి
యానతార్ధమూర్తి ♦ యై క్షేత్రమునకు నీ
శాన్యమున వసించు ♦ చంద్రవదన!. 132

క. ఆమహాపీయక్షేత్రశి
ఖామణిపైఁ బిదపఁబర్వెఁ • గామిని! నానా
భూములను నిగిడి మదగిజ
స్థైమి బహుశిలహారి గహన • భయదాకృతియై. 133

సీ. జడధిఁ జల్లినగంద • వొడినేత్రములఁబడ్డ
గలినిఁ దామరపరా • గంబుఁగ్రమ్మ
తదితరక్షేత్రముల్ • తమయందు నిలుమన్న
నొడ్డించుటలుఁబోలె • నుబ్బులెసఁగఁ
బంకదంభమునఁ బా • పములమిరింగినసిరి
పెద్దనవ్వులలీల • ఫేనములరఁ
బెరవాహినులమీఁదఁ • బెరిగిన మత్స్యా
వేశంబులన గ్రాహ • విక్రుతాంగక

గీ. భానుభూమైక జనిభూమి • బ్రైమి నడచి
యమ్మహాక్షేత్రమటఁడాపి • యధికభీతిఁ
జొరక గిరిరుద్ధగతియైన • కరశేషఘూర్ణ
నంబు నొందుడు శ్రీజగ • న్నాథుఁ డెఱిఁగి. 134

ఉ. పేటిగురించి పల్కు విన • మేటికి సంభయ మోఁగుభాంగి! యె
ప్పాట భవత్సమానమగు • పాటిపరిచ్ఛకరంబు లేదు వాగ్
పాటవ మొప్ప మాప్రదము • పైఁ బ్రసహింప మదాజ్ఞ నన్నన
ప్పోట సపాటమైక డలిజోటియుఁ గొల్చునిజప్రవాహముల్. 135

తే. క్షేత్రమున భైమిరిల్చిహా • ల్చినప్రదేశ
మున జనాభీష్టద మనాద్య • మాను జతుర్ము
ఖాదిసేవ్యంబు నగు నృసిం • హాఖ్యతీర్థ
మమరు త్రింశద్ధనుఃప్రమా • ణమున మెఱసి. 136

సీ. ఉక్కు గంబము వ్రచ్చి • యుదయించె నే దేవుఁ
డరణి నుద్భవ మొందు • నగ్నికరణి
వాలారుగోరు మేల్ • గాలాము చేసె నే
జేజే హిరణ్యాసు • శిశుకమునకు
భక్తివృద్ధుఁడు గాగ • బాటించె నేవేల్పు
ప్రహ్లాదుఁ గడుబాల • పండ్లనాఁడ
నిజసింహతకుఁ దగ • సుజనహృన్నహాలందుఁ
గ్రీడించె నేత్రిలో • కీనియంత
గీ. యానృహర్యక్షవర్యుండు • యక్ష, పక్షి,
ఖచర, గంధర్వ, కిన్నర,• గ్రామణీశి
రోమణీఘృష్టచరణాబ్జ • రోజ హేజడు
నుండు మూప్పదిరెండుబా • హువులుగలిగి. 137

శా. ఆకుంభప్రభవుం డొకానొకతపం • బత్యుగ్రితం జేసి ము
న్నోకుంభస్తని! మూజలాంతరమునం • దున్నంగ నే దివ్యలిం
గాకారంబున నిల్చి సట్టిదె యగ • స్త్యాఖ్యాకతీర్థంబు త
ద్వాక్యకోచాకృతిసప్తసప్తతికరా•యామాన్వితెన్ జెన్నగుఁ. 138

మ. నవనీతప్రియుఁ గొల్చి విఘ్నపతి త•న్నంత్రాంగతం దాల్చి యే
యనఘింబోనిగణాధిపత్యపదవిం • బ్రాపించి యద్దానిచెం
త వసింపంగఁ దదాహ్వయంబునన గా • ణాపత్యమా నట్టి తీ
ర్థవతంసంబు నగస్త్యతీర్థమున కా• ద్యంబంద్రు విద్యానిధుల్.139

సీ. నగపుత్రి! యట్టిగా • ణాపత్యతీర్థంబు
నకుఁ బూర్వమై మజ్జ • నంబొనర్చు
వారికి మఱివారి • వారికి నపవర్గ
వర్గంబునీఁజాలు • వారి గలిగి

యచటసంకర్షణా • హ్వయతీర్థరాజంబు
వెలయు నచ్చో మున్న • హలధరుండు
తీర్థయాత్రయొనర్చు • తిరిమట్టమై వచ్చి
యనగాహవేళఁ బ్రి • త్యక్షమైన
గీ. పాండురంగాధిపతికృప • వడసి తద్వ
రాప్తినిజనామ మాత్తీర్థ • మధిగమింపఁ
జేసి కార్తార్థ్యమునుబొందె • శ్రీసఖుడు
నంద యంతర్హితుండయ్యె • సద్భుతముగ. 140

శా. ఆసంకర్షణతీర్థరాజమున కా • ద్యంబైన మద్వోకని
శ్వాసంబై తనదైర్ఘ్యమంతయును బం • చాశద్ధనుర్మేయమై
భాసిల్లున్ నిజవారిమజ్జదఖిల • ప్రాణిప్సితత్యాగవి
శ్వాసన్నద్ధమనం బ్రిసిద్ధిపడయున్ • జాబాలితీర్థంబిలన్. 141

క. అత్తీర్థమునంతరమున
వృత్తిస్తని! బ్రిహ్మతీర్థ • విభు వభినుతిసం
పత్తి విలసిల్లు శతదో
ర్వృత్తాకృతికాంత దాని • వృత్తం బెల్లన్. 142

క. అందు వసియించు యదుకుల
నందన సేవావిధాన • నందనశ్రీయై
కుందవిశదరదన! శతా
నందుఁడు వాణీవధూస • నాథుం డగుచున్. 143

గీ. బ్రిహ్మతీర్థంబునకు దండ • పాణియాశఁ
గులశిఖరిపుత్రి! దీపించుఁ • గలశతీర్థ
మేను బాదల నిడుపున • దీనుమిగిలి
యదియ యమృతామహాదేవి • కాస్పదంబు. 144





[illegible]

[illegible]

[illegible]

నంజనచ్ఛాయుత్తమై [illegible] 145

ఉ. తామరసాక్షి! యంమనకు ♦ దక్షిణదిక్కున సప్తదోర్మితా
యామ మయూతయామగుణ ♦ మై యెసఁగున్ బితృతీర్థ మచ్చటన్
దామొనరించుదానములుఁ ♦ దానములున్ గయఁజేయుసత్క్రియా
స్తోమములై పితృప్రియము ♦ జొన్ప సుఖంపుదు రెల్లవారలున్. 146

ఉ. దానికిదక్షిణాశ వసుధాధరనం ♦ దన! యొప్పు బ్రహ్మవి
ద్యానిధిసేవితంబు నవ ♦ హస్తమితంబగుచక్రతీర్థ మ
చ్చో నలవోకయుంబలె వి ♦ శుద్ధజలంబులఁ గుంకి మాధవ
ధ్యానముసేయు మానులకు ♦ నబ్రములే? యపవర్గదుర్గముల్. 147

క. చక్రస్తని! తజ్జలములఁ
జక్రాలంకృతశిలాని ♦ చయ ముదయించున్
శక్రముఖాఖిలమఖభు
క్చక్రము గొనియాడుఁ దత్ప్ర ♦ శస్తగుణంబుల్. 148

శా. ఆతీర్థంబునకుం గృతాంతదిశ ♦ నాద్యం బార్త్రివైద్యంబు ల
క్ష్మీతీర్థం బన నొక్కతీర్థము ప్రకా ♦ శించున్ రమాదేవి వీ
తాతంకస్థితి నచ్చటం దపము సే ♦ యన్ నేర్చికా తొల్లి యా
ద్రైతేయారి భుజాంతరాళమణిసా ♦ ధంబెక్కెఁ బెన్మక్కువన్. 149

సీ. ధూతాఘమైన ల ♦ క్ష్మీతీర్థమునకు ద
క్షిణమునఁ గామోద ♦ కియును, బద్మ
మును, శంఖమును, జక్ర ♦ మును, నిజనామచి
హ్నములుగా వెలయుదీ ♦ ర్థములు వొలుచు

మొలఁత! యీనాళ్లు ల • క్ష్మీశతీర్థమునఁ గూడి
శక్తిపంచక నామ • సంప్రయుక్తిఁ
దళుకొత్తు వీని వి • స్తారంబు షష్టిహ
స్త పరిమాణంబు బసఁ • జాలియుండుఁ

ఆ వె. పరమపావనంబు • పాతకనిర్మూల
నైకకర్మఠంబు • లోకనుతము
తత్ప్రభావ మసుర • దమనున కీ యేను
ప్రాణధనములగుచుఁ • బ్రణుతి వడయు. 150

ఉ. ఆమధువైరిదివ్యతను • నైనసకలోన్నతమూర్తియై దశ
వ్యామ విశాలమై పరమ • మై భువనత్రితయాభిగమ్యమై
యీ మునువిన్నతీర్థముల • కెక్కువ చూపుచుఁ బౌండరీకము
ద్ధామగుణాభిరామమనఁ • గా వినఁగాఁ గనఁగాఁ దగుందగన్. 151

సీ. నిడువాలుఁగనుచూపు • నిగిడినచోనెల్ల
బీరెండ రేయెండఁ • బెండ్లియాడ
నిశ్వాసపవనంబు • నెలకొన్నచోనెల్ల
ప్రామిన్కు నెత్తావు • లాముకవియఁ
బొక్కిటితమ్మిపు • ప్పొడియొల్కుచో నెల్ల
బ్రహ్మాంకురంబులు • పాదుకొనఁగ
నడుగులేఁజిగురాకు • లంటినచోనెల్ల
వివిధ తీర్థశ్రేణి • వెల్లివొడువ

గీ. బ్రహ్మమణిబంధ మావేల్పు • పచ్చవెదురు
గ్రుచ్చుకాయలతిత్తియుఁ • గంబుశక్తి
గలిగి విహరించుఁ బౌండరీ • కంబునందు
నందులేఁబట్టి ప్రాలేయ • నగముపట్టి. 152

వ. అఖిలతీర్థరాజంబగు నమ్మహాతీర్థంబునకు జముదిక్కునఁ దిక్కృతావిముక్తంబగు ముక్తికేశితీర్థం బఖిలార్థప్రదంబై యుండు. మున్నట్లు వెన్నునివలనఁ దీర్ఘాపత్యంబును, ముక్తిదాయిత్వంబునుంగాంచిన యమ్ముక్తకేశియు నచ్చోట నచ్చవెన్నెలఁ దొచ్చెంబు చేసి మొనఁగు. నిసుకదిన్నెలపై నున్నయది యట్లగుటం జేసి. 153

క. పులినోపరితలగత నా
తలోదరిని శిఖిలవసన ♦ ధమ్మిల్లమహో
జ్జ్వలభూషణభూషిత ని
శ్చలపదవిప్రద భజింపఁ ♦ జను గుహాజననీ!. 154

శా. భక్తుండెవ్వఁడు ముక్తకేశిక పయః ♦ పానంబు గావించి ని
ర్వ్యక్తక్లేశకు ముక్తకేశికిఁ గరం ♦ బుల్ మోడ్చి సత్యామన
స్సక్తుం గన్గొనువాఁడుగ న్నయదివో ♦ జన్మంబు మేఁదాల్చియుఁ
ముక్తుండాతఁడు భావికాలజననం ♦ బుల్ వానికిం బూజ్యముల్. 155

చ. హరి మును సంగమాహ్వయమ ♦ హాసురు నాసురవృత్తిఁ ద్రోచి పే
రురవడి వానిపై నడుగు ♦ లూఁదఁ దదంకము లెట్టిచోట గో
చరమగు చూడ్కి కాస్థలము ♦ సన్నిధి పెన్నిధి వానిపేరిటం
బరఁగెడుతీర్థ మొప్పుఁ గల ♦ భాషిణి! యీషణ శోషణస్థితిన్. 156

క. ప్లావిత భూతలయగు పు
ష్పావతియను నేరుఁ గలయఁ ♦ బావనమై యో
దేవీ! సంగమతీర్థం
బ్భావిస్ఫూర్తాఖిలాద్భు ♦ తార్థత వెలయున్. 157

సీ. ఆతీర్థమునకు నా ♦ ద్యము సోమతీర్థంబు
సోమలోకావాస ♦ సుఖకరంబు
దానికి దేవతీ ♦ ర్థము పూర్వమైయుండు
దేవతాభోగోప ♦ దేష్టయగుచు

సందున కటమున్న ♦ యవతరించినసూర్య
తీర్థంబు సారసి ♦ ద్విపద్రదంబు
తత్తీర్థమునకుఁ బ్రా ♦ క్తనము సరస్వతీ
తీర్థంబు వాఙ్మయో ♦ ద్దీపకంబు
గీ. వీననాల్గింట నాడిన ♦ వీనిమహిమఁ
బ్రస్తుతించిన వీనినై ♦ భవము గన్నఁ
బ్రాజ్యసాయుజ్య సామీప్య ♦ పూజ్య భూరి
భోగములు పంచజనులకుఁ ♦ బొదలుఁగొల్ల. 158

స్రగ్ధర. పూర్వద్వార్స్థన్ సితాంగిన్ ♦ భువనవినుత సం♦భోరుహభ్రూ
ణురాణిన్
బర్వేందుస్పర్ధవక్త్రిన్ ♦ భగవతి నఖిల♦ప్రాణిధీమూర్తి వాణిన్
దూర్వాశ్రీపత్రిమల్లీ♦తులసిదళ శమీ♦ధూప దీపాక్ష తౌఘా
గుర్వాజ్యక్షీరధారల్ ♦ గొని కొలిచినచోఁ ♦ గోరుకోర్కుల్ ఫ
లించున్. 159

పృథ్వి. తరణ్యయుతజిత్ప్రభా ♦ ధగధగాయితాశాంతరుం
డరణ్యమృగభూమికా ♦ వ్యనితదానవస్వాంతుఁ డా
హిరణ్యకశిపుద్రిహుం ♦ డెపుడునుండు నచ్చో నమ
చ్ఛరణ్యపదపద్మఁడై ♦ చలదళాకృతిస్వీకృతిన్. 160

క. నీ వడిగినఁ జెప్పితి నో
దేవి! చతుర్ముఖముఖులకుఁ ♦ దెలియఁగరా దీ
దైవతతీర్థక్షేత్రిమ
హావిర్భావములు చింతి ♦ తార్థప్రదముల్. 161

ఉ. ఈచరితంబు విన్నఁ బఠి♦యించిన వ్రాసినఁ బుత్రపౌత్రిల
క్ష్మీచతురాంగనాదిక వి♦శేషము లిమ్మెయిఁగాంచి మీఁదటన్

జూచు నరుండు పాపిమునులు♦చూడని చక్కనియిక్క నిక్కమో
మేచకమేఘసంసదుప ♦ మేయశిరోజ! సరోజదృక్కృపన్. 162

క. అని శివుఁడు కుధరకన్యకు
వినిపించినయట్టిసరణి ♦ వినిపించె మహా
మునులకు ననుపమిత తపో
ధనులకుఁ గథకుండు తత్త్రి ♦ తయమేళనమున్. 163

క. వినిపించిన విని శౌనక
మునిప్రముఖ నిఖిలమును ల ♦ మో ఘానందం
బును మనములఁదాల్చిరి నెల
కొనునిజతను ఫలక పులక ♦ కుల కలనమునన్. 164

క. ఆశౌనకుండు మఱియు బి
లేశయతలిమోపధాన ♦ లీలాలోల
స్వాశయుఁడు పరమపద బ
ద్ధాశుఁడునై రోమహర్ష ♦ ణాత్మజుఁబలుకున్. 165

చ. దమనిధి! విఠ్ఠలేశ్వరుఁడు ♦ దైవతరత్నము భూమి తీర్థర
త్నము నలపౌండరీకవసు ♦ ధాతలమన్నది క్షేత్రరత్న మీ
త్రిమణులు సూక్తిసూత్రవిత ♦ తిం గుదిగుచ్చితి మచ్ఛ్రవోవిధే
యమగుచు నున్న నక్షవల♦యాకృతి నీకృతి యొప్పునెప్పుడున్. 166

క. చతురభవదుక్తిముకుర
ప్రతిఫలదఖిలేశగుణప ♦ రంపర కలుషో
జ్ఝితమగునంతర్దృష్టిన్
సతతము నీక్షింపఁ దనివి ♦ ననదు మహాత్మా!. 167

మ. హరి యాద్యుండఖిలాండనాయకుఁడు నం♦దాపత్యమేలయ్యెఁ? ద
చ్చరితం బెయ్యది? దాధ యెవ్వతె? తది♦చ్చావృత్తి యెరీతి? శం

కరుదేహంబున భైమియెట్లొదవె? శ్రీ • కాంతాంగజాతాక్షరో
త్కర మేమంత్రరహస్య మింతయనువ • క్కాణింపుమాకింపుగన్.168

ఉ. నావుడు సూతుఁడిట్లనియె • నారదమౌనికి మున్ను మేచక
గ్రీవుఁడు పుండరీకునిచ • రిత్రము దెల్పెఁ దదర్థమై భవం
జే వినుపింతు మీరు వినుఁ • డిందఱు సందియమెల్ల డిందల
క్ష్మీవిభుదివ్యలీల లఱ • చేతఁగనందగు దీన దీనుగన్. 169

క. అనిసూతుఁడువెండియు న
గ్జునసూతు విహారములు ని•గూఢోక్తుల వి
న్ననుమొప్పఁ జెప్పఁ దొడఁగెన్
మును వేదవ్యాసు వచన •మున విని యునికిన్. 170

చ. ధనపతిమిత్రుఁడట్లు ప్రియ• దాప్రమదార్థముగానుపన్యసిం
చినవచనామృతంబు శ్రుతి • సీమలఁగా దిగిబోధభూజసే
చనమొనరించుటన్ సఫలసంభ్రముడై • సమయూరరాజవా
హనముగ మౌను లబ్ధిజల• మౌనుఘనంబులలీల నేగఁగన్. 171

సీ. జాలపాదమునంఘ్రిఁ • గీలితంబగు సితా
బ్జముంభాతిఁ గుంచె హ• స్తమునఁ గ్రాల
బిసదంబుఁ బొగడుశ్రీ • శ్వరుశంఖమనఁజాలి
తన్నామముఖర కం • ధర దనర్ప
రజతాద్రికూటగ • ర్జత్కాళికాకృతి
బృహదంసమునదిడ్డ • మహతి పలుక
నిగిడి సుషుమ్న యీ • నినపిల్లవెలుఁగులు
వడువున నెరసంజ • జడలు నిక్కఁ

గీ. దెగినచుక్క ధరణికి నే • తెంచుకరణిఁ
దరణికిత్ప్రభతో మేఘు • సరణి డిగ్గి

నందనీట శతానంద ♦ నందనుండు
మజ్జనంబాడి బాలేందు ♦ మౌళిఁ బాడి. 172

చ. తటపుట బిల్వభూరుహావి ♦ తాన లతానవపుష్ప నిష్పత
జ్జటిలమధూళిధూళిభవ ♦ సౌరభ మార! భ్రమింపఁ జొచ్చె ని
చ్చట వనదేవతోద్ధత కు ♦ చద్వితయశ్రిత యక్షకర్దమ
చ్ఛటలఁ దటాలున న్వెడలు ♦ సారపుఁ దావులు ద్రోవలాఁగుచున్ 173

గీ. ఉచితనేపథ్య యుతులయ్యు ♦ సురగసతులు
నిఘ్ననిజమౌళిమణిఘృణి ♦ విఘ్నలబ్ధ
నభికసంకేతములకు రే ♦ లరిగియరిగి
తిరుగుమొగమైన చిక్కుల ♦ తెరువులివిర. 174

ఉ. వ్యాళకరాళకుంభములు ♦ వ్రచ్చుట గ్రుచ్చుటఁ గోలెఁ బచ్చిము
త్త్యాల నఖాగ్రధారలకు ♦ నాభరణాచరణం బొసర్ప నీ
శైలగృహాగృహస్థులుఁ ♦ జల్పెడు నిద్దుర తార! గట్టురా
చూలివయాళివావురము ♦ సూడుకు బట్టు మహోగ్రసింహముల్. 175

సీ. కాంబోలు నివి గణ ♦ గ్రామణీకల్పి తా
నల్పవిహారగే ♦ హాంగణములు
కాంబోలు నివి చర ♦ ఖచరచారుస్తని
సమ్మర్దగళితభూ ♦ షాస్రజములు
కాంబోలు నివి దక్ష ♦ కన్యాంఘ్రివిన్యాస
ధన్యాసకృత్కేళి ♦ మాన్యగుహలు
కాంబోలు నివి మోద ♦ కప్రియప్రబలదం
తప్రాసనిర్భిన్న ♦ ధాతుఖనులు

గీ. తెలియఁ గాంబోలునివి వహ్ని ♦ తిలక చల క
పర్దనిర్దోషసురసరి ♦ ద్బహుళలహరి

గహనకుసుమాయమానశ్రీ ♦ కరనిపాత
శీతలచ్ఛాత్రతల్పోఢదా ♦ పోతకములు. 176

తే. రాజతాహార్యగోరాజ ♦ రాజమునకుఁ
జంద్రశేఖరవరకకు ♦ చ్చారువునకు
నీమహాసింధు వుపకంఠ ♦ సీమ నిగిడి
డాలుదీపించె నిదె గంగ ♦ డోలుఁ బోలె 177

ఉ. ఈపృథివీధరంబున ని ♦ ళేంద్రకటోదితదానధారలై
ద్వీపవతీతరంగతట ♦ విస్ఫుట శైవలకందళంబులై
తాపసబాలికాశ్రవణ ♦ దత్తయవాంకురభూషణంబులై
రేఫుఁ దమంబు సేయు శబ ♦ రీకబరీ నిబిడ్రేస నీలిమల్. 178

క. ఇటులనుచుఁ దోడ్రిచి చని ముం
దట మునికనుఁగొనియె వేల్పు ♦ దళములుగొలువన్
ఘటవటుకప్రముఖ మహా
జటిలులతో వచ్చు నాభు ♦ జగ భుగ్వాహున్. 179

మ. కని యేకారణమేగుదెంచిరొకో యీ ♦ కామాంధరుం డీమునుల్
కనఁజిత్రింబగుఁ గంటికంటి స్వాకృత ♦ స్కాందోక్తి యం దావహి
ల్లినసందేహముఁ దండ్రిచేఁదెలియుహా ♦ శి స్వామిఁ దోకొంచుఁగ్రాం
చనగోద్భేదియ వచ్చె నిప్లుగుటకున్ ♦ శంకింప నింకేటికిన్? 180

క. శరవణభవయుతులగు నీ
పరమమునులు శ్రోత్రితలగుట యు ♦ పారప్రజ్ఞా
కరుఁడు నిశాకరశిశుశే
ఖరుఁడు హరుఁడు వక్త్రయఁటయు ♦ గమ్యము గలదే? 181

తే. అతిరహస్యంబు శుద్ధంబు ♦ నాజవంజ
వార్తిహరణంబు ననెగుద్ది ♦ యడిగెనొక్కొ

కొడుకు సర్వజ్ఞు విజ్ఞాన • కుశలు ధర్మ
మర్మనిర్ణయవాఙ్మయ • మహితుఁ దండ్రి. 182

మ. మునుపుట్టెన్ బ్రకృతిందమంబునురజం•బున్ సత్త్వమున్ నాఁగనం
దు నిలింపారులుదామసాత్మకులు మ•ర్త్యుల్ రాజసుల్ సాత్త్వికుల్
దనుజద్వేషణు లందుఁ బూజ్యులు నితాం•తఖ్యాతి నాజానుజుల్
ఘనుఁడందింద్రుఁడు పేంద్రుఁ డీశుఁడమరుల్ •గా రెవ్వరుందత్సముల్.

ఉ. డక్కినవిష్ణుభక్తియు దృ • ఢంపువిరక్తియుఁ గల్గునమ్మరు
ద్భుక్కటకున్ భజించుమతి • పుట్టక కంపలఁబడ్డకాకినై
యక్కట! మోసపోయితిఁగ • దా? పెనుత్రిమ్మటు నెంతవారికిన్
జిక్కెనె? ముఖ్యసౌఖ్యము వి • శిష్టజనంబులసఖ్యమందమిన్.184

స్రగ్ధర. ఐనం గానిమ్ము నన్నీ • యతిగురుఁడు విడం•డాప్తభృత్యుం డుగా స
న్మాన్యనాధీనుండుగా వై • ష్ణవసుఖదుఁడుగా • మత్కృపాపాత్రభూతుం
డౌనంచున్ బ్రోచిగోప్యం • బగునది తెలుపున్ • బ్రార్థితుం డై మురారి
ధ్యానానూనాశయుల్ తు • ల్యదృశులు దమశీ • ప్యాళి భావింతు రెందున్ 185

క. కావున శరణము వేడెద
నావైష్ణవసార్వభౌము • నడిగెద నాకున్
గావలసినయర్థము లా
దేవుండును దెలుపు తేట • తెల్లముగాఁగన్. 18(

క. అని నిశ్చలతరనిశ్చయ
మున నారదుఁ డరిగె సురస • మూహావాసం

బునకుఁ గైలాసమునకు
ననుబింబితశాంభవాట్ట ♦ హాసంబునకుఁ. 187

సీ. నగభన్విహానం ♦ బగుగోవృషము లంకె
లనఁ బొల్చుఘంటాను ♦ హాక్వణములు
హారశిరశ్శశిరేఖ ♦ యపరావతారంబు
లనఁ బొల్చు సేవాగ ♦ తాబ్జముఖులు
కాదగిపే యాకల్ప ♦ కంఠమూలచ్ఛాయ
లనఁబొల్చునగరు ధూ♦పాయతంబు
లీశాన భూషణా ♦ హిస్ఫటా మణి కాంతు
లనఁ బొల్చు రత్నదీ ♦ పాంకురములు
గీ. ఖండపరశుతను ప్రభా ♦ ఖండదుగ్ధ
జలధి జలశీకరములనఁ ♦ బొలుచు వేల్పు
జెలికలు చల్లుపూవుదో ♦ యిళ్ళు గలుగు
నగము మునిముఖ్యునకు దృగా♦నంద మొనఁగె. 188

సీ. ఆకొండనెత్తాన ♦ హైమసాలావళీ
వేష్టితంబగు బలు ♦ వీడుఁ గాంచె
నావీటినడు చక్క ♦ నభిరామ శుభవిభా
ధగధగాయిత మొక్క ♦ నగరుఁ గాంచె
నామహాప్రాసాద ♦ మల్లనల్లనడాసి
వాకిట నొకకీశ ♦ వదను గాంచె
నాకపి లపనుచే ♦ ననుమంతుడై చొచ్చి
చని యొక్కముత్యాల ♦ చవికఁగాంచె
గీ. నందు విధుకాంతవేదికా ♦ భ్యంతరమున
ద్వీపిచర్మోన్నపరిస్థల ♦ దీపితార్క

కోటినిభమైన యొకనిరా ♦ ఘాటనిరఘు
నిరుపమ ప్రభఁ గాంచెని ♦ ర్నిమిషదృష్టి. 189

ఉ. కాంచి విరించినందనుఁడు ♦ కన్నులు బిమ్మిటినొంద డిందియొ
క్కించుక కొంకుదేఱి కని ♦ యొం దదుదగ్ర మహోగ్రదీప్తిలో
బంచముఖున్ శిఖిక్షణావి ♦ భాసిలలాటు మరుజ్ఝరీధరున్
సంచితసత్కృపారసవ ♦ శంవదు నాదికపిన్ వృషాకపిన్. 190

చ. విడువని వైరవృత్తిఁ దఱి ♦ వేచి రతీశుఁడు చేతికత్తి నె
క్కుడురభసంబునన్ శిరసు ♦ గ్రుద్దిన నయ్యలుఁ గెల్లఁబోయి లో
నడఁగ బహిస్థతత్సుప ♦ ర్వాప్తితసూకర దంష్ట్రకైవడిన్
జడముడిఁ జంద్రరేఖ వెద ♦ చల్లగఁ జల్లని చిన్ని వెన్నెలల్. 191

ఉ. కుంకుమ పంకశోణ యగు ♦ కొండలమండలనాథుపట్టి గా
మాంకము దాకొనన్ ఘుణ ఘు ♦ ణారవ భూరికపాలమాలికా
లంకృతు లోంకృతుల్ నొడువు ♦ లా గడరన్ దటవిద్రుమద్రుమ
కేరింకృతికారిసారసహ ♦ రీత సుధానిధిరేఖఁ గ్రాలుచున్. 192

చ. ఉమ పసుపాడి మోముతడి ♦ యొత్తిన హత్తిన తన్నిశాంక దృ
క్కమలదళాంజనాంక కుల ♦ కంబుగ నిమ్మగుచేలఁ గేళి వి
భ్రమరతిఁ గప్పినాఁడనఁగఁ ♦ బచ్చని నల్లని చారలన్ మనో
రమమగు ద్వీపిరాడజిన ♦ రత్నము యత్నముమీఱఁ దాల్చుచున్.

ఉ. దండనమస్క్రియాభిరతిఁ ♦ దండములై బలభిన్ముఖామరుల్
తండు సువర్ణదండముఖ ♦ తాడన భిన్నకిరీటులయ్యుఁ బెన్
జండితనంబునన్ మిగుల ♦ సందడి చేయుచుఁ జొచ్చిరాఁ గృపం
బండిననిండుఁ జూపుపయిఁ ♦ బర్వఁగ వారల గారవించుచున్. 194

గీ. చరణ పీఠోపకంఠ ని ♦ షణ్ణవృషభ
రాజకకుదర్పితాంఘ్రిస ♦ రోజుఁడగుచు

నిండుకొలువున్న దేవతా • మండలేశు
నీశు డగ్గఱి మ్రొక్కె యో • గీశ్వరుండు. 195

క. కనదధరకాంతిపల్లవ
మును దశనద్యుతి లతాంత • మునుగా వాక్పూ
జన మొనరించెఁ బురారికిఁ
దనివి సనక మౌనికులవ • తంసుఁడు వేడ్కన్. 196

గీ. కాళరాత్రీశుఁడగు నీకుఁ • గడిఁది తమము
పుండరీకాభుఁడగు నీకు • భూరిరజము
సత్కృపాంభోనిధియగు నీకు • సత్త్వభృతియు
నను గుణంబులు మూర్తిత్రి • యైకనిలయ!. 197

ఉ. వేదవివాద గోష్ఠిఁ బడిఁ • వృద్ధుల బుద్ధులఁ గొల్లవచ్చు శ్రీ
గాదిలియై మెలంగ కల • కాలము గ్రాలఁగవచ్చు నిచ్చలుం
గ్రొందిదు నవ్యభవ్యసుఖ • ముల్ మఖమూల్యములొందవచ్చుఁ గా
కేదొరకేటికిం దొరకు • నీవు విషాగ్నుల నానఁబెట్టుటల్. 198

క. అని పలుకు సిద్ధసంయమిఁ
గనుఁగొని కృపమీఱ నీల • కంఠుఁడు రార
మ్మని కూర్చుండుటకుం దగ
ననుజ్ఞఁ గావించె సాంద్ర • హాసాధరుఁడై. 199

క. కలహాశనముని చెన్నగు
నలికేక్షణుసవిధ వసుధ • నాసీనుండై
వలిమల పురోధరిత్రిఁ
మొలచిన ప్రత్యంతకుధర • మునకుఁ దరంబై. 200

చ. హరకృప నిట్లు గన్గొని త • దాననదత్త నిరీక్షణాబ్జుఁడై
సురముని పల్కె నోపురని • షూదన! నీయనుజీవి నేను మీఁ

దరయక మోసపోయితి గు ♦ హాన్వితులై మును లర్థి వేడ సు
స్థిరమతి మీరు తత్వమును ♦ దెల్పెడుచో నిటనుండఁగల్గమిన్. 201

ఆ. సాధుజనులతోడిసం ♦ సర్గ మురలిన
హాని భయము క్లేశ ♦ మావహిల్లు
నెంతవారికైన ♦ నిదినిక్క మనుమాట
నన్నుమోచివచ్చె ♦ నాగహార!. 202

గీ. దండితానంగ! నీదండ ♦ నుండియుండి
యిపుడు నేఁజన్న నింతలో ♦ ఋషులువచ్చి
యెద్దిప్రార్థించిరో మీర ♦ లేవిధమున
నుత్తరంబిచ్చితిరో వారి ♦ యుకులకును. 203

క. కాలీఁచవడఁ జరింపుదు
నీలోకమునందు నెల్ల ♦ నీహితబోధ
శ్రీలాభబుద్ధి నెవ్వరుఁ
బోలరు తత్వంబుఁ దెలుపు ♦ పోలుపున నిన్నున్. 204

ఉ. కావునఁ గ్రౌంచభేదియు న ♦ గస్త్యుఁడు దక్షమునుల్ త్రిలోకర
క్షావశబుద్ధి నిన్నడిగి ♦ కాంచినయర్థము లానతిచ్చి నన్
బ్రోవఁగఁబాడి యట్లగుటఁ ♦ బోష్యులు శిష్యులునైనవారలన్
దేవరవంటివారలంత ♦దీర్చి కృపారసవృష్టిఁ దేల్పరే?. 205

క. అనిపలికి యూరకుండిన
మునిముఖ్యుని వినయవాక్య ♦ ముల కలరి మనం
బునఁ గృష్ణునిలిపి పురమ
ర్దనుఁడిట్లనుఁ దత్కథా క ♦ ధనలాలసుఁడై. 206

చ. విను మునినాథ! నన్ ఋషులు ♦ వేఁడిన యర్థముబోధతీర్థమా
త్యనఘ మనంతపుణ్యఫల ♦ దాననిదాన మనశ్వరంబు వి

శ్వనుతము దీనిపెంపుఁ గనఁ • జాలరు తక్కినవారలెవ్వరుం
దనుజరిపు ప్రసాదజని • త ప్రతిభానిధి నేనుఁ దక్కఁగన్. 207

సీ. తఱిదాఁ ప్రిడు సీదఱింపుఁ • బొరలంటిగాలిచే
జడియుచందమునసం • చలు భ్రమింప
సురలు బంతులుసాగి • సుధమిథస్పృహఁ దాఁగు
తీండ్ర దేటులు పూఁపుఁ • దేనెలాన
నామహావిషమాను • నామూర్తులన జంబు
ఫలములం దెల్లచి • లక్కలు భుజింప
నాశ్రితాభ్రమ్మల • నమ్రతని గూఁకలు వెట్టు
క్రియమయూరంబులు • కెరలిపలుక
గీ. నగ్రిమధియింప నొక్కట • నవతరిల్లు
నాటిసిరివోల్పు చాడ్పున • నవనవర్తు
లక్ష్మిఁ దిలకింప మదికి ను • ల్లసన మొసఁగు
మందరంబున మున్నె ను • దయునుగూడి. 208

ఉ. లాలితలీల నైందవశి • లాస్థలి నాస్థలిగుర్వఁ గ్రాలుచో
నాలలితాంగిఁ జూచి విను • మద్రిజ! నామదిఁ గూలముద్రిజం
బై లలినిల్చె నీదగువి • హారము తోరముగాఁగ వేఁడు మి
వ్వేళవరంబులిత్తు నిదె • వేశమ నా విని దేవి యిట్లనున్. 209

ఉ. సేవకకల్పభూరుహము • శిష్టసుధాంబుధి భక్తరోహణ
గ్రావము దేవముఖ్యుఁడనఁ • గాఁ దగువేలు పనల్పరక్తి నీ
సేవకురాలికిట్లుదయ • చేసిన యావరమిప్పుడొల్ల నేఁ
గావలెనన్న నాఁ డొసఁగ • ఁగాఁదగు నాదగు విన్నపంబునన్. 210

క. అనిపలికి కొంతకాలము
చన నేఁడు పవనవిహార • సమయమునందున్

మును నాకడనున్నవరమ
కొని వేఁడెఁ గుమారజనని ♦ గురుతత్వనిధీ!. 211

సీ. కాశి, గుహాటవి, ♦ గయ, కురుక్షేత్రంబు
సైంధవంబును, నైమి ♦ శంబు, పుష్క
రంబును, దండకా ♦ రణ్యంబు, చంపకా
రణ్యంబు గాంచనా ♦ రణ్యకంబు
కేదారమనుమహా ♦ క్షేత్రంబు, గంగ,యు
మున, సరస్వతి, గూడి ♦ మొనసి మెలఁగుఁ
నెలవును మొదలుగాఁ ♦ గల క్షేత్రములు వేవ
వేలుర్విఁ బొగడొందు ♦ వీనిలోనఁ

గీ. గాపురము సేయఁ గొన్నింటఁ ♦ గలుగు మేలు
మహిమ గొన్నిటఁ జేకురు ♦ మైదొరంగ
నిట్టిక్షేత్రంబులకు నెక్కు ♦ డెద్దియెద్ది
గనఁబరంబిచ్చు నేక్షేత్ర ♦ మునికి నీకు 212

సీ. నీరజగర్భుండు, ♦ నీవు, నింద్రుండు, భా
స్కరుఁడు, చంద్రుఁడు, బృహ♦స్పతియు,దక్ష
ముఖ్యప్రజేశస ♦ మూహంబు, మన్వాది
చక్రవర్తులు, మునుల్, ♦ సాధ్య,సిద్ధ,
మనుజ, మహోరగ. ♦ దనుజ, సరీసృప
పశు, కీట, మృగ, పక్షి, ♦ పరికరంబు
స్థావరజంగమా ♦ త్మక మగుభౌతికం
బెవ్వనిచేఁబుట్టు ♦ నెవ్వనికృప

గీ. నిలుచు నెవ్వనికినుఁ చే ♦ విలయమొందు
నమ్మహాశక్తిసంపన్నుఁ డమ్మహాత్ముఁ

డమ్మహానందుఁడౌచోట • నధివసించు,
నట్టివాఁ డమ్మహావిష్ణుఁ • డిందుమకుట!. 213

గంగాది తీర్థమహిమ మ
హింఁ గాదను తీర్థమెద్ది • యిహమాత్రుడు సదా
సంగతి నెచ్చోనుండు న
సంగాహిత! దీని నెఱిఁగి • యానతియీవే. 214

అని దాక్షాయణి వేఁడ నుత్తరము నె • య్యంబొప్ప నీనున్నయం
త నగస్త్యాదులు గొల్వవచ్చి శిఖిమీఁ • దం బొల్చి సేనానియే
ననుప[illegible]స్కాందపురాణమమ్మునులకున్ • వ్యాఖ్యానముల్ జేయ ముం
చని వారల్ శుచి తీర్థులై యదియ కా • క్షన్ వేఁడఁ దాఁగానముల్.

వచ్చి క్షేత్ర తీర్థ దై • వతచరిత్ర
మన్మఖంబున మానిన • మన్వితముగ
నెఱిఁగి వారలుఁ దానిప్పు • డిట్లు యరిగె
నంత నీవేగుదెంచితి • వచలతనూజ!. 216

నా విని శంకరుం బలుకు • నారదుఁ డోమదనారి! భూరికా
ర్యావహబుద్ధిఁ బోలె భువ • నాళిని హాళిఁ జరింతు భ్రాంతియున్
కావిరి వావిరిం దగిలి • కాళులధావతియయ్యె క్షేత్రముల్
దేవుఁడు దీర్థమొక్కకడఁ • దీవ్రతరప్రభ నిల్చు టేఁగనన్. 217

క్షేత్ర దైవత తీర్థ చా • రిత్రమెపుడు
గరళకంధర! యొకచోటఁ • గలసియునికి
యానతియొసంగి నన్నుఁ గృ • తార్థుఁ జేయు
మనుచుఁ గలహాశిఁ బలుకు న • మ్మ్రసిజారి. 218

తనమది వల్చుభామినికి • దక్కిన నిక్కపుమోహిఁ బోలె నే
మన్మజుఁడు బుద్ధినిల్పు మఱ • మర్దను దివ్యకథానుబుద్ధిమై

యనిశము మప్పురియుం డతఁడ ♦ యట్లగుటన్ వినుమంతు నీకు నేఁ
గని విని యున్నగోప్యము న♦గమ్యమునైన యథఃప్రపంచమున్.
ఉ. ఈ సముదగ్రతత్త్వపద ♦ మేనొకరుండె నెఱుంగుదున్ సరో
జాసనుఁ డొక్కరుండెఱుఁగు ♦ నద్రితనూజ యొకర్తెఱుంగు న
వ్యాసవుఁ డొక్కరుండెఱుఁగు ♦ నాజన్మభోగిప తార్క్ష్యులాత్మఁబ్రా
గ్వాసనమై నెఱుంగుదురు ♦ గాని తదన్యు లెఱుంగ రెవ్వరున్ 220
గీ. డాఁపఁదగువారి మిక్కిలి ♦ డాఁకఁగలిగి
క్షేత్రమునకెల్లఁ బరమమై ♦ కీర్తిఁ బడయు
నిమ్మహాక్షేత్రరాజంబు ♦ నెఱుఁగఁజాలు
ప్రాజ్ఞుఁడగువాఁడు మునుఁగఁడు ♦ పాపజలధి. 221
క. పుడమికి వితస్తిమాత్రపుఁ
బాడవున నాక్షేత్రరాజ ♦ ము విరాజిల్లున్
నడుమన జ్యోతిర్యానము
వడువునఁ దేజోమయాభి ♦ వ్యక్తిత మూర్తిన్. 222
క. ఆక్షేత్రమునకు సురన
దత్రక్షితి పాతాళముల స ♦ మంబై బుధలో
క క్షేమంకర మగునది
యేక్షేత్రముఁ గాకయుండు ♦ నిద్ధవిభూతిన్. 233
క. ఏవంవిధ బహుమహిమై
కావాసంబైన యమ్మ ♦ హాక్షేత్రమునం
దే వసియింపుదు విను వసు
దేవసుతార్చావిధేయ ♦ ధీ యోగమున్. 224
సీ. సహ్యపాదోద్భూత ♦ సరిదన్వయమునకు
నేను, ధాత యును, ల ♦ క్ష్మీశ్వరుండు
నభిమానులము గాన ♦ నందుఁ గృష్ణుఁడు కృష్ణ,
బ్రహ్మగౌతమి, నేను ♦ భైమిఁగాఁచి

యధివసింతువు దండ ♦ కాటవిమొదలు పం
చ తుదగాఁగలక్షేత్ర ♦ పటలమెల్ల
సజ్జనకు, హరికి, నా ♦ కాయతన్మహత్త్వ
భౌమి విష్ణుక్షేత్రి ♦ భూమి బఱఁచి
గీ. వైష్ణవి యనంగఁదగునందు ♦ వలన నాదు
క్షేత్రము నిల్చి వైవి నా ♦ ధాత్రివెలయుఁ
దామరసనంభవక్షేత్రి ♦ తలమునందు
బ్రాహ్మ్యమొప్పు నిప్పాట ♦ బహ్మపుత్ర!. 225

గీ. పుణ్యగుణగణ్య పాతకా ♦ రణ్యహేతి
బహుళపుణ్యద్విజవ్రజ ♦ విహితకూల
దీపితాకృతి బుధబోధ ♦ దీపకళిక
యఖిలలోకవిపచ్ఛాంతి ♦ యీ స్రవంతి. 226

గీ. నడచి భగవంతు క్షేత్రంబు ♦ నడుమఁజొచ్చి
విరజ యను సింధువెచ్చోట ♦ విడిసియుండు
నృహరి ప్రత్యక్షమై యుండు ♦ నెచ్చోట
నచ్చోటను వైష్ణవి ♦ యనఁగఁబరఁగు. 227

గీ. కృష్ణవేణి ప్రకాశించు ♦ నెంత మేర
నంత మేర మదీయమై ♦ యతిశయిల్లు
భౌమి యటమున్న జలజసం ♦ భవుని యదియ
నాస మూర్తిత్రయమయం ♦ బారయమ్మ. 228

సీ. చలిదిచిక్కపుజుట్టు ♦ సాలుమాల్కాసుపై
నొయ్యారముగఁ బెంచి ♦ మొయ్యఁజెరివి
భాస్కరాంశులు దూఱి ♦ పాఱువేత్రీవనుల
వెల లేని మకరకుం ♦ డలములునిచి

మోహచే శివంపుగా • ముడిచిపట్టినకేల
వరదాభయంబు లా • వటము చేసి
పారలేని యురఁటుల • నిరసించు మృదులోరు
యమళమధ్యమున గో • యష్టి నిలిపి

గీ. నిగమనూపురములు మ్రోయ • నిరుకుళముగ
సిగ్గువాసినకటి ప్రకా • శింప నురము
కెంపు లేమెండఁగఁ గ్రక్కఁ జె • క్కిళ్లనగవు
మొలవ న తీర్థమున నిల్చి • పొల్చుఁ జక్రి. 229.

తే. తీర్థహారంబునకు వాసు • దేవమూర్తి
నీలశరళాకృతిస్ఫూర్తి • నెలవుకొనఁగ
నత్తొడవునకు సంగమా • ఖ్యాకతీర్థ
తలము దళుకొత్తు హత్తిన • కొలికివోలె. 230.

చ. ఖరనఖరాగ్రనిర్దళిత • కర్బురరాజ భుజాంతరుండు శ్రీ
నరహరి యుండు సంగమము•నం జలమాడి నృసింహునంఘ్రిపం
కరుహయుగంబు గాంచి తన • కల్గినమాత్రము దానమిచ్చు నే
నరుఁ డొకపూఁట వాఁడును గ • నంగలఁ డాదిమవిష్ణుధిష్ణ్యమున్.

క. కలుషవనప్లోషదవా
నలకీలావలయమైన • నరహరిక్షేత్ర
స్థలపుణ్యమహిమ లెన్నినఁ
గలుగున్ సుక్షేత్రముఖ్య • గమనఫలంబుల్. 232

తే. అపునరావృత్తి శాశ్వత • విపులసౌఖ్య
సిద్ధి ప్రహ్లాదునికి దయ • చేసినట్టి
యానృహర్యక్షవిభుక్షేత్ర • మధిగమించు
జనుఁడు పాపంబులను మా • చనము గాంచు. 233

శా. ఆక్షేత్రస్థలి క్రోశపంచకమితం ♦ బై యుండుఁ దత్రోత్స్యలన్
వీక్షించన్ దివినుండి వేల్పుగమి ది ♦ గ్వేదండతుండాకృతా
రక్షుచ్ఛేత్రశరదోశ్చతుష్టయులఁగా ♦ రాజీవరాజీవస
చ్ఛృత్కాసారమ్ములఁగా హిరణ్మయపటీ ♦ సక్తోరులంగా మహిన్.

ఉ. వంచనయింతలేక బహు ♦ వారము లెంతయుఁ గ్రూరచిత్తుఁడై
పంచజనుండు పంచవిధ ♦ పాతకముల్ మునుచేసినేనియున్
బంచత శ్రీనృసింహుకడ ♦ భాగమునం గనుఁబుణ్యమొక్కఁడున్
గాంచినఁజాలు విష్ణుపద ♦ గామియగున్ గులకోటితోడుతన్.

ఉ. దేవునివామభాగమున ♦ దేహము నూడ్చిన సార్వభౌముఁడౌ
దేవునివెన్క మేల్కనిన ♦ త్రేనుపుగ్గకొని నాకవాసియౌ
దేవునిమ్రోల దక్షిణపు ♦ దిక్కున నీల్గినయేని ముక్తుఁడౌఁ
గావున మానవుండెపుడు ♦ గాపుర మాయెడఁ జేయఁగాఁదగున్.

క. యతిపతి! యేతత్క్షేత్రో
ర్జితచరితంబ్రకటనంబు ♦ చేయఁగఁ దగు న
య్యితిహాస మొకటిగల దది
శ్రుతిపేయము చేయుమనుచు ♦ రుద్రుఁడుపల్కెన్. 237

శా. అంభోరాశిగభీర! ధీరహితచి ♦ త్తా! భోగభోగావళీ
సంభారామరరాజ! రాజకృతపూ ♦ జాయోగ్య! యోగ్యర్ధిమి
త్రాంభోజాహిమధామ! ధామహితని ♦ త్యావాస లక్ష్మీక్రమ
జ్జృంభాలంకృత వక్త్ర! వక్త్రభీముఖరవా! ♦ శ్రీమద్గుణప్రాభవ!

క. శఠమఠన వంశవర్ధన!
కఠినకుఠారాగ్రదళిత ♦ గర్వితవిద్వి
డ్జఠరమునితుల్యవితరణ!
పఠనకళాభ్యాసవిభవ ♦ పారీణమతీ!. 239

మాలిని. కవిశుకసహకారా! ♦ కల్పవృక్షావతారా!
సవినయనిజమూర్తీ! ♦ సర్వదిగ్గ్రాహికీర్తీ!
భువనహితచరిత్రా! ♦ పుణ్యదాక్షిణ్యమిత్రా!
నవరసికవతంసా! ♦ నవ్యసూక్తిప్రశంసా! 240

## గద్య

ఇది శ్రీపరమపదనాథ నిరవధిక కృపాపరిపాక
పరిచిత సరసకవితాసనాథ రామకృష్ణ
కవినాథ ప్రణీతంబైన పాండురం
గ మాహాత్మ్యంబను పరమ
భాగవత చరిత్రంబునందు
ద్వితీయాశ్వాసము.

---

శ్రీరస్తు.

# పాండురంగమాహాత్మ్యము.

## తృతీయాశ్వాసము.

శ్రీరమ్యచరణతలలా
క్షారసరాగాభిరమ్య • శంకావహదృ
గ్ధారసమారానైతరక్షః
వీరా! రామానుజయ్య • వేదాకీర్తిశా!. 1

వ. ఆకర్ణింపు మాయర్ణవతూణీరుండు వీణామునిం గనుంగొని
యిట్లనియె. 2

ఉ. ప్రాసఁగువిత్తువంటి నెల • పాలు కొలంబునఁబుట్టి వేదముల్
వోసినగాదె శాస్త్రములు • పుట్టినయిల్లు కళాకలాపముల్
డాసిన రచ్చ యంచు నఖి • లంబు దనుంగొనియాడ నొప్పు ను
ద్భాసితభాసితద్యుతి స • భాపతి నానొకఁ డాహితాగ్నియై. 3

వ. అతడు కళింగదేశాభరణంబగు పీఠికాపురం బధిష్ఠించి సకల
మహీ సుపర్వశ్రేష్ఠుండై నెలయునంత. 4

తే. ఆమహీసురులేమకు • నతులనిష్ట
నింగివేల్పుల నేలకు • నేలవేల్పు
కొలము నింగికిఁ దెచ్చుచుఁ • గొలువఁ బుత్రుఁ
డొక్కఁ డుదయించెఁదత్కృపా • భ్యుదయమహిమ. 5

మ. వనితామానసమానసాయకుఁడు జీ♦వత్తాతపాదుండు భూ
జనసన్మాన్యవిశుద్ధవర్తనుఁ డుదం ♦ చత్త్యాగశీలుండు చం
ద్రుని పెన్నుద్ది సమగ్రకాంతిమహిమన్ ♦ మానాఁగు మీసాల లే
గొనబుం బ్రాయపుఁ దేజుకూనయతఁడు ♦ త్రోచుండు వాచాలతన్.

వ. అజ్జగతీసుపర్వసంభవునకుఁ బితృదత్తంబగు నిగమశర్మాభిధానంబు ప్రసిద్ధంబై యుండు నెండియు. 7

తే. అతఁ డనూచానసంతతి ♦ నవతరిలియు
సకలనిగమశిఖారహ ♦ స్యములు గనియు
మనసుఁ దార్త్రియపురుషార్థ ♦ ముసకె తార్చె
దైవఘటనావశంబున ♦ నోవశీంద్రా!. 8

చ. తలగడు గంగమర్దనము ♦ ధౌతపటావరణంబు సంస్కృతో
జ్జ్వలకలమాన్నభోజనము ♦ చందనచర్చ ప్రసూనదామకం
బులు కపురంపువీడ్యమును ♦ భూషణపఙ్క్తులు కల్గి నిచ్చలుం
బు నకడుగంగబద్ధనును ♦ ముత్యముఁ బోలుచు వాలుచుంబురిన్. 9

సీ. కలదు లేదను వాద ♦ ముల కోర్చి మీనుమీ
సముపంటిరోయింటజం ♦ దెము మెఱవఁగ
బహుసంకుమదపంక ♦ పాణింధమంబైన
తాళిగోణపుఁజుంగు ♦ నేలజీరఁ
గడ లేనివీడ్యంపుఁ ♦ గప్పుచందగుకావి
మోవిపల్లొత్తుల ♦ మునుఁగుపన్న
పానతాఁకులుగల్గు ♦ నూనాత్రశంఖంబు
గతి నఖరేఖాంక ♦ గళముదనర

గీ. సఖులు పరిహాసకులు వెంటఁ ♦ జనఁగ యువతి
భుక్తనిర్ముక్తపరిధాన ♦ యుక్తుఁ డగుచు

నగరఘంటాపథంబున ♦ నగుచుఁ దిరుగు
నోరపుగలశీవి జాతిమా ♦ త్రోపజీవి. 10

తే. భార్యపాలిండ్లు రిక్తకుం ♦ భములు రోయి
వెలఁది చనుదోయి నిండుకుం ♦ డలు కులంబు
తరుణిఫాలంబు చవితి చం ♦ దురుఁడు వేశ్య
నుదుటు వానికిఁ బ్రతిపదిం ♦ దుండు నయ్యె. 11

సీ. ఉపస్థాన హోమాగ్ని ♦ యూఁదనొల్లఁడుగాని
విరహజ్వరార్తుఁడై ♦ వెచ్చనూర్చు
సంధ్యకుఁ బ్రార్థనాం ♦ జలి ఘటింపఁడుగాని
యొఱఁగు నీర్ష్యాకషా ♦ యితలకర్ధ
నాగమవాదంబు ♦ తాఁ గాదనఁడుగాని
విటవాదములు తీర్చు ♦ వేగిలేచి
కంబు భృత్యాదోద ♦ కంబుఁగోలఁడుగాని
యువతాధరసీధు ♦ వాని చొక్కుఁ

గీ. బుణ్యచిహ్నంబు లపఘనం ♦ బున ఘటింప
సిగ్గుపడుఁగాని ఖరనఖ ♦ శిఖరలిఖిత
జాతనూత్నక్షతాంకముల్ ♦ సమ్మతించు
నారజముమీఱి యాదుర్వి ♦ హారహారి. 12

తే. నిగమశర్మాభిధానంబు ♦ నేతిబీర
కాయయును బోలె నయథార్థ ♦ గాథఁ దాల్చ
వైదికాచారదూరప్ర ♦ వర్తనముల
వీట విహరించుచుండు న ♦ వ్వీటిపోఁగు. 13

క. వెడవెడ దుర్వ్యవహారపు
నడవడి గడిదేఱి గురుజ ♦ జనము శిక్షింపక్

గణుసుషి విప్రతనయుఁడు.
నడి క్రోచి వంకపరక ♦ చాటుగా మూసెగా. 14

తే. తాతముత్తాతతండ్రులు ♦ తరతరంబు
చీమవలెఁ గూడఁబెట్టి యూ ♦ ర్జితము సేయు
విత్త ముడివోయెఁ దత్కరా ♦ యత్తమగుచు
సురగదష్టునిమేని నె ♦ త్తురును బోలె. 15

సీ. దినవెచ్చమునకున్నై ♦ తనమేనఁ గలసొమ్ము
కొదుకక బచ్చింటఁ ♦ గుదువవైచు
నిందుగీసినరీతి ♦ నించుకించుక చేరి
గిలుబాడుఁదల్లిపైఁ ♦ గలపసిండి
తండ్రికినిడ్డవ ♦ త్రిములు దొంగిలిపోయి
పోయినంతకు నిచ్చి ♦ పొరయు విత్త
మిడ్డవడ్డికి నోర్చి ♦ మృత్యుగాపములైన
సాహులచే ఋణ ♦ గ్రాహియగుచు

గీ. గుడ్డవృత్తులు వృత్తులు ♦ గొలుచు గుత్త
చేలు గ్రామాంశములు నాది ♦ నేలలెల్ల
జనవరుల కమ్ముఁజూపు ని ♦ చ్ఛావిహార
వర్తి వాఁడేమిగానున్న ♦ వాఁడొ మీఁద. 16

క. అతఁడు కళింగోద్భవుఁడగు
కతమునఁనో ప్రేలఁ జూపఁ ♦ గనుగొందక యా
గ్యతమస్వీకారమునకు
నితరుండై యుండె మునికు ♦ లేశ్వర! వింటే. 17

తే. పొందుఁబట్టుల నప్పులు ♦ పాడిచి పాడిచి
దొరతనంబునఁ జట్టాలఁ ♦ దిరిసి తిరిసి

నలఁగి శిశ్నోదరపరాయ • ణత్వమునకుఁ
బార మెఱుఁగక తిరుగు నా • బ్రాహ్మణుండు. 18

చ. తనచెలులిండ్లయందదన • (దావుడు త్రావుచు నింటికెన్నఁడున్
జనక మహోదరాగ్నికము • చౌర్యహృతం బన్నపతోపపన్నమున్
జెనఁటిపసాళివెచ్చములఁ • జేర్చుచుఁ దొల్లిఁటివైభవంబు లె
ల్లనడఁగ నవ్వెడంగు కడు • లాఘవవృత్తికిఁ జొచ్చె నిచ్చలున్.

క. మితి గడచిన ఋణదాతలు
వెత పెట్టఁగ నూరుచూరక • వెలివెలిఁ దిరుగున్
దతిఁగూడు లేక యాఁకటఁ
గుతిలపడు నతండు గున్న • గుర్తకతోడన్. 20

క. వలువకుఁ గూటికి ద్రా సీ
చుల నేపం బోవనౌరవఁ • జొచ్చు నతఁడు పూ
పులు ముడిచినయంగళ్ళకు
కలకల పిండెల్ల నవ్వఁ • గట్టలు మోసెన్. 21

తే. వదను దివిచిన కస్తూరి • పూఁచియలరు
పాయఁ బొత్తిన గూడు నీ • ర్వట్టు మడుగు
గళితమణియగుసొమ్మునై • కానఁ బడియె
దుర్విదగ్ధుండు గౌరవ • దూరుఁడగుచు. 22

క. ఆలో నొకనాఁడాడు
శ్శీలరతుని యక్క యొర్తు • శిక్షించెద నీ
బాలిశు నని తనమగనిన్
బాలురఁ గొనివచ్చె మాతృ • భవనంబునకున్, 23

వ. ఇట్లు పంచయోజనమాత్రదూరంబగు తనయూరనుండి వచ్చి పితృభవనంబుసొచ్చి యచ్చటం గొన్నిప్రొద్దులు గడపి కొడుకు చెడునడవడికి నడలుకడలింబడి సుడివడియెడుతల్లిదండ్రులఁ దీండ్రి

గలవచనరచనా చమత్కారంబుల నుదారముదారోపణకరణోపచా
రంబులఁ గొంతకొంతవంతకుం దొలంగించుచు మందిరముకుందారాధ
నాతిథిసంతర్పణంబులు నేర్పునం బచరింపించుచు జనయిత్రీదర్శితం
బగు మూలవిత్తంబగు సప్తావశిష్టంబగుపది గుప్తము సేయుచుఁ
బశు, శిశు, దాస, దాసీజనంబులఁ దనవారిఁగా మెలంగించి
నలంకుపలుకుం దొలంగించుచుఁ బుస్తకభాండాగారంబు నిజభర్తృ
హస్తాంతరంబున నానుశుక్లశిశినైలబంధన మాచకప్రముఖోపద్ర
వంబులవలనం బాఁచి ప్రోచుచు విగళితసన్నాహంబగు గేహంబు
యథాపూర్వనిర్వహణ మనోహరంబుగా ననుసంధింపించి చదు
వుసంతిసాగించి నడపించుచు నిజానుజు దుర్వ్యసనంబువలనగాసిం
బొందని రాజానుగ్రహలబ్ధంబులగు నేకభోగగ్రామంబు లాతా
నంబులుగా నొనరించుచుఁ దప్పి దారినమడి, మట్ర, చేను, చెట్లు
న్నపట్లరసి తనపట్టులం గాపుపెట్టుచు గృహిక నలంగియు నత్తమా
మలచిత్తంబు వచ్చుపట్లు భక్తిశక్తులు మెఱసి పాటులంబడుమరం
దలిసౌందర్యంబు, ననివార్యజృంభణంబగు యౌవనారంభంబును,
వనచంద్రికావైభవంబును, వనకేళీపలాశదోహదంబునగుటకు వగ
చి వగచి తెగిచి కడుపుచుమ్మలుచుట్టి కన్నీరుట్టిపడం బొట్టుపొరల
గుములుడు నంతం జుక్కతెగిపడినవడువున నెక్కడనుండియో యాక
స్మికంబుగ నింటికిం జలిదివంటకంబుఁ గుడువం జనుదెంచి తన్నుం
గాంచి డెందంబునం గొంచియుం బోరాక చేరి నమస్కరించి తల
వంచికొని యున్న తమ్మునింగని కదిసి కొందమ నెలవంకలవంక
లొత్తుచు నెత్తురులు చిలుకుచుం గుక విపదబంధంబునుం బోలె నసకల
పరివృత్తంబులై మదోన్మత్తమత్తకాశినీ దత్తంబులగు నఖాంకంబుల
కతనఁ గర్కశంబగుసతని శరీరంబు గౌఁగిలింప నంగలించి శంకించి
యాసీమంతిని యొక్కింత బుజుస్వాంతయై యాదుర్విదగ్ధు విదగ్ధాలా

పంబులోలయ సీమంతపుం బెండ్లికొడుకవు గమ్మని హేత్తుగర్భితంబు
గా నాశీర్వదించి యతండు తమకంబు గమకంబునం బోవ నుంకించిన
వానిసోత్కర్షమి మెఱింగి తరంగితవినయ సౌహార్దమార్దవ మధు
రంబులగు మాటల తేటలం బందిరివెట్టి యిందుబింబంబునుంబోని
నిజవందనుం జిఱుతవాని మేనల్లుని నిందమని చంకకిచ్చి యెచ్చటి
కేగెదవు మాబావబాతి నారగింతువు గాక శాక పాకంబులు నిమి
షంబులోనం గావింతు నని నిలిపి వెనుకదెస నెడగలసియున్న తత్కు
ళత్రంబునకు నేత్రసంజ్ఞయొసంగుటయును. 24

క. ఆప్పైదలి ప్రాణేశ్వరు
శ్రీపాదద్వయము గడిగె ♦ శీతలవారిన్
వ్యాప్తనిజనిశ్వాసజ
తాపంబునఁ గొంతకొంత ♦ తప్తముగాఁ గన్. 25

క. విను వేల్పునకును మెచ్చొల
యనిబలువిందునకుఁ బోలె ♦ నఖిలాన్నంబుల్
కనుగీటినంతలోనవె
యనుజునకుఁ దదగ్రజాత ♦ యమరించెఁ గన్. 26

చ. తలగడిగించి ధౌతపరి ♦ ధానము గట్టఁగ నిచ్చి లెస్సగా
నలకలయందుఁ జిక్కుతడి ♦ యాఱిచి క్రొవ్విరు లావటించి మై
మలయజచర్చ సేసి గృహ ♦ మాధవదత్తమనోజ్ఞభోజనం
బులొసఁగెఁ దల్లి తండ్రి నిజ ♦ పుత్రులు భర్తయుఁ దోభుజింపఁగన్.

ఉ. ఇష్టములైన వంటకము ♦ లిట్లు భుజించి యతండు వార్చి సం
తుష్టమనస్కుఁడై తనదు ♦ తొయ్యలి వీడ్యముచుట్టియీ మహా
శిష్టుఁడువోలెఁ దిన్నెపయిఁ ♦ జీర్ణగ వొప్పఁగఁ గూరుచున్నఁ జోఁ
బుష్టి సమస్తముం గడపి ♦ పుచ్చి తదగ్రజ పూర్ణచిత్తయై. 28

క. ఇంతలు నంతలు నగుతన
సంతానము వెంటవెంట ◆ సందడి సేయన్
బ్రాంతమున నిలిచి తమ్ముని
కుంతలబంధంబు విడిచి ◆ కుశలాశయయై. 29

తే. ఎలయుసీత్కారములతోడ ◆ నీళ్లుగ్రిక్కి
యంటుసంటులుపరికించి ◆ యంట్లఁ బోడిచె
గోరుముక్కుల దిగదువ్వి ◆ తూరుపెత్తి
నెఱులఁ గలిగినపేల న ◆ న్నింటిఁ దిగిచె. 30

క. మెడమన్ను నలఁచి యలకలు
ముడిగొని నిజపాణిపద్మ ◆ ములు గరగరగాఁ
గడుగుకొని తనకు మరదలు
విడెమొసఁగుచుఁ బసిమిపసిఁడి ◆ పీవన పీవన్. 31

తే. చేటికానీతపీఠి కా ◆ సీన యగుచుఁ
బద్మకర్ణికఁ గొలువున్న ◆ పద్మపోలెఁ
గుడివలన నింతయోరగాఁ ◆ గొమరుమెఱసి
బిడ్డచనుఁదావ నిట్లను ◆ బీన రుహాక్షి. 32

శా. ప్రారంభించిన వేదపాఠమున కుర్ ◆ బ్రత్యూహమానంచునో
యేరా! తమ్ముఁడ! నన్నుఁజూడఁ జనుదే ◆ వెన్నాళ్లనోయుండి చ
త్పూరాజీవయుగంబు వాచె నినుఁగ ◆ న్గో కున్కి మీబావయున్
నీరాకల్ మదిఁ గోరు చంద్రిపాడుపున్ ◆ నీరాకరంబుంబలెన్.

శా. శ్రీలాలిత్యము నిత్యశుద్ధియుఁ గుణో ◆ త్సేకంబునుం గల్గి యు
ద్వేలస్ఫూర్తిఁ దలిర్చుతండ్రియును న ◆ బ్జింజంద్రిడై తోఁచినన్
బోలుంగాక భవాదృశుం డితరుఁడై ◆ పుణ్యాంబులం బాసినన్
సాలగ్రామఖనిం జనించునెకదా? ◆ జాత్యల్పపాషాణముల్. 34

క. ఏనమ్ముడు గడవఁగఁ ద
త్సూనులు కనుగందు లగ్రి • జుండవు నీవి
చ్చైనతఱి నెంతదుఃఖము
యీ నీపోగ్రి పాసపడెదు • నిరుగురుపులకున్. 35

సీ. పరమేష్ఠినుండి నీ • తరముదాఁక విశుద్ధ
తరమైనవంశంబు • దలఁచవైతి
తఱిఁద్రొక్కియున్న యీ • తల్లిదండ్రులఁ జాల
పఱచనై సంతోష • పఱచవైతి
వహ్నిసాక్షిగఁ బెండ్లి • యాడినయిల్లాలి
నిల్లాలితాకార • నొల్లనైతి
ధర్మశాస్త్రార్థవి • త్తముల విత్తములచే
నలరించి విఖ్యాతి • నందవైతి
గీ. శీలమఖిలంబు నిది పిల్లి • శీలమనుచుఁ
జదువులివియెల్లఁ జిల్కల • చదువులనుచుఁ
దోడివారలు నవ్వ నా • తోడ! యేల
చేలనైతివి? యీగుణం • బేల? నీకు. 36

వ. అని తదీయ దురాచరణాస్మరణ సంతప్తస్వాంతయై యు
త్కంఠీరవమధ్య యమర్షోత్కంఠ కలకంఠకులకంఠ కాకలీలాపహం
బగు నెలుంగు చెలఁగం గుంఠితప్రబోధుండగు నాశుంఠునిం గెరలి పలి
కియు నలుక మగిడించి యుదంచితప్రయోజన ఘటనాపారవశ్యం
బున సామరస్యంబుమీఱ నిట్లనియె. 37

చ. పడఁబడఁబాఱుచున్ వడఁకు • పట్టినతల్లిని దండ్రి నేలలో
వెడలనితమ్ముగుఱ్ఱల న • వీనకులాంగన నోరులేనియీ
తొడుకుల బంటుఁజైద విడఁ • ద్రోవక పోవఁగ నెందు నీక పా
ల్పడినది కర్ణునాదలనె • భారతసంహిత నిల్చుచాడ్పునన్. 38

ఉ. నాదుసహోదరుండు సుజ ♦ న స్తవనీయనయప్రసక్తి బ్రి
ష్మాత్రముల మెచ్చఁ డేనతని ♦ యజ్ఞమునం గడుఁబూజ్యరాలనై
వేది యలంకరింతునని ♦ వేపురిలోపల నాడుకొందు నీ
వేదియులేక సర్వగుణ ♦ హీనుఁడ వౌట మెఱుంగఁ దమ్ముఁడా!.

శా. వీరావేశముదాల్చి సర్వధనము ♦ న్స్వేచ్ఛింతుగా కేమి ము
క్కారుంబండునఖండసేతువృతముల్ ♦ కాశ్మీరఖండంపుఁ గే
దారంబుల్ తెగనమ్మఁగాఁ జనునె? ని ♦ ర్ధారుండవే ? వెన్కనె
వారల్ లేరె ? సహోదరాదులు కుల ♦ ధ్వంసంబునీకర్హమే ?.

ఉ. కామవికార మాత్మనవ ♦ గాఢతఁ దాల్చినయేని నిర్భర
శ్రీమెఱయంగ రూపగుణ ♦ శీలకులోన్నతి గల్గువిప్రక
న్యామణులన్ సహస్రమయి ♦ నన్ వరియించి రమించరాదె?యే
మీ? మునులై గృహస్థులు ర♦మించుటయొగ్గె? కులాంగనాతతిన్.

శా. లోలత్వంబున మత్తకాశినుల కి ♦ ల్లుం బొల్లునుంజెల్లఁగా
నేలా? వెచ్చముసేయ నెవ్వలన మ♦న్నీలాఘ్యలుం జాలరే?
కోలంబో జనియించువేఁడినను వీ ♦ ట్లోక లాభ మోతండ్రి! దు
శ్శీలాగారము వారయానతము ని ♦ న్నీ మేటి పాటించునే?. 42

సీ. నర్మగరోక్తులు ♦ నక్కటక్కులు వింత
నయగారములు బహు ♦ నాటకములు
పిలుపిచ్చవిద్యలు ♦ పీఁకవన్నియలును
బెలుచఁదనంబులు ♦ పేరలడములు
వక్రభావంబులు ♦ వలకారిబాగులు
వలసియొల్లములును ♦ వట్టిపసలు
కేరడంబులు సాళ ♦ గింపులు కిల్బిషా
క్రీడనంబులు నడ ♦ కించువగలు

గీ. బాసపోసనములు విడెం ♦ బములు బ్రిషలు
లేనిమచ్చిక లివిమోది ♦ నైన వివిధ
దుర్గుణంబులపొత్రవులు ♦ ద్రోహమతులు
వారకాంతలఁ దడవిప ♦ వచ్చుఁగీడు. 43

చ. విడు మిఁకనైన నిట్టియవి ♦ నేకము మానాక బుద్ధిపద్ధతిన్
నడుపుము నీకుఁగావలసె ♦ నా హితకౌస్తుభమైనఁ దెచ్చెదన్
గడుసరియచ్చకూళపలు ♦ గాకుల విడుము చేయిమీఁదుగా
నడచినపూర్ణకాముఁడవు ♦ నాయనుజన్ముఁడవిట్లు సేయుదే?. 44

తే. అక్క యీరీతి నయము ప్రి ♦ యంబుగలుగ
నానతిచ్చిన సద్బుద్ధి ♦ నాదరించెఁ
జాలదినములనుండియు ♦ హైలపడిన
బహుగుగాపున వాఁడన్న ♦ పాసకాంక్ష. 45

సీ. రాజాలయమునకు ♦ రాకపోకలు సేయు
మాసి చదువులు ♦ మరలఁజదువు
నిన్నాళ్ల నెచ్చెలు ♦ లెను హైనఁ దలవంచు
కులవధూరత్నంబుఁ ♦ గుస్తరించు
నాచార్యజనము ప్ర ♦ హ్యహామానంభావించు
సర్వావళికి నుప ♦ హారమిచ్చి
యర్చించు కుతపవే ♦ ళాగ తాతిథికోటిఁ
బసి నేను దర్శించుఁ ♦ [illegible]రుఁబచ్చుఁ
గీ. దండిగ్రియుద్గమనీయంబు ♦ తాన యుచుకు
నత్రికాభతణతో నవ్వ ♦ నల్పపరశి
గ్రామకార్యంబు దీర్చు నం ♦ గడికివచ్చి
తేనెపూసికత్రి ధా ♦ త్రీసురుండు. 46

వ. అతఁడొక్కనాఁడు. 47

సీ. గోమేధికోపలాం • కురమానితంబులు
పుష్యరాగచ్ఛటా • పుంఖితములు
నైషమార్త్యసంధాన • వర్ణనీయంబులు
హరినీలకీలనా • భ్యంచితములు
కురువిందసందర్భ • గురుతరంబులు చతు
ర్వజ్రవజ్రదళ సమా • వేల్లితములు
మహనీయతరహరి • న్మణిపరిశోభితంబులు
సకలుపస్ఫూలమహా • కీర్తికయుతములు
గీ. పద్మరాగపరిరంభ • భాస్వరములు
దంతవిముక్తమక్తికసము • న్నతకభృతములు
మాతృభూషలు నత్తికా • మండనములు
నిజయువతిదాల్చుసొమ్ములు • న్నియుహరించి. 48

క. ఒకనాటిరాత్రి పడుపడు
కతెం జెప్పక యిల్లువెడలి • గాఢతరతమో
నికరము తనదగుతోడుగ
నోకరుండుం జేరదవితోరివ • నూడనిం బొడెక్. 49

సీ. పాలించు వృద్ధభూ • సురుం డాత్మపితృదత్త
దర్భముదికకుం జి • త్తంబుగలంగ
సత్తగా రిచ్చిన • హరిసుదర్శనపుంబే
రునకు ముత్తెదువ • వనటం బొందుం
గొత్తగాం జేయించు • కొన్నముక్కరకునై
యడలుదుర్వారమై • యాండుబిడ్డ
జామాత వెతంబొందు • వ్యామోహిమై నవ
గ్రహకర్ణవేష్టన • భ్రంశమునకు

గీ. నెంతదుర్బుద్ధి యెంతదు • ర్భ్రాంతి యహహ!
సర్వధనములనద్దురా • చారశీలుఁ
డూచముట్టుగ నిలువ్రొంచి • యురికి చనుట
యెఱుఁగరో గాక యవ్వేళ • యెఱుకగలదె?. 50

ఉ. మోవఁ దరంబుగానిధన • మున్ బెనుమోపుగ వాఁడదుర్గమే
త్రోవయుఁగాని పేరడవిఁ • దూఱిహుటాహుటి నొక్కరుండులోఁ
జావున కంగలించి పెలు • చం జనుచుండఁగ నొక్కనాటిసం
ధ్యావసరంబునం దొకపు • రాంతిక ఘోరవనాంతరస్థలిన్. 51

మ. కరుణాదూరులు చోరు లంధతమసా • కారుల్ పరార్థాహృతి
త్వరితాంతఃకరణుల్ దురాసదులు వి • శ్వద్రోహు లుద్బాహులై
తెరు వొక్కుమ్మడిఁ గ్రమ్మి యొమ్మగల సం • దీప్తాశుగ శ్రేణి నే
సిరి ధాత్రీసురసూనుఁ గాఁపు మ్రుక్కరవా • లిప్తాశులై యేసుసన్. 52

క. కాయంబునఁ జెదపెదపలు
గాయంబులుచేసెఁగాని • కడువాఁడిమి మై
నాయమ్ముల నమ్మహీసురు
నాయమ్ములు దాఁకవయ్యె • నాయుర్మహిమన్. 53

క ఒకనెత్తురుబొట్టునకూ
రక యసురులు వేవురొడియుఁ • గ్రమమున దొంగల్
బకనిభు లాపతితుని దోఁ
చికొని రయంబడరఁ జనిరి • చెట్టు కొకరుఁడై. 54

క. కాఁపుకొడు కొక్కరుండా
కాపురుషుం డెచ్చె నిటకి • కడ కనుకంపా
టోపోద్దీపితబుద్ధిఁ ద
దాపద్వినివారణక్రి • యాభిముఖుండై. 55

క. కలదాహూద్రివసతి శశి
కలదా ననఁ జాలు నొకవి • కారపుఁగోడల్
చలదాలోలకటాక్షాం
చలదామనిబద్ధతరుణ • జనఖంజనయై. 60

ఉ. ఇంటికి నడ్డమాఁక యొక • యింతయు లేక చరించువాని చే
నంటినఁగందుగెందళుకు • లంగమునం గలవాని మిక్కిలిం
గంటికి నిందువానిఁ దెలి • కన్నులవానిఁ గిసాళిబాఁపనిం
బంటది గోరుచూపుకుచ • పంజరకీరముగా రమింపఁగన్ 61

సీ. పలువికారంబులఁ • గలగల్వఁజూపుల
రాకపోకల బయల్ • ప్రాఁకఁజేయుఁ
దమకంబు గమకంబు • దత్తలంబునుహత్తి
మనసుసాఁగినపజ్జఁ • జొనుపుఁగోర్కి
కుమురుపాలిండ్లపైఁ • గొంగుజాఱఁగఁ గొప్పు
వీడ నూరక నవ్వు • వెట్టినవ్వు
నేరాలిపట్టి బి • ట్టెత్తి చెక్కిలినొవ్వఁ
గఱచి వాఁ డేడ్చినఁ • గౌఁగిలించు

గీ. దండనకి మొఱఁ బుంజాల • దండఁబెట్టుఁ
దిట్టు మెట్టెలు బిగువంచుఁ • దెగి కళాదు
వనిత చిన్నారిపొన్నారి • వయసువాని
విప్రనందనుఁ గన్నంత • వెకలియగుచు. 62

క. దుర్లలితాతనువిలసన
నిర్లజ్జస్వాంత కాంత • నేరుపు మెఱయన్
జెల్లాటమాడు మోహము
లేలయి వర్తిల్ల నమ్మ • హీనసురుతోడన్. 63

తే. దృష్టిపాత్రంబు నొడివి మై ♦ దెరలఁబట్టు
ఫాలపట్టిక గనుపట్టు ♦ బాల చేల
నిఱియఁ దలఁగట్టి యొకమూల ♦ నెఱుగు నేల
గ్రుడ్ల నీరుట్టఁబఱచిన ♦ కొంగుమీఁద. 64

ఉ. తేలెడుకన్నుదోయి వడ ♦ దేఱెడు ముద్దుమొగంబు సారెగై
వ్రాలెడు గొప్పకొప్పు వసి ♦ వాడెడునన్నువకౌను గాఁకలం
దూలెడు లేఁత మేనునయి ♦ తొట్రిలు నమ్మృగనాలి నాలి బా
గాలఘువర్తనుం డరసి ♦ యంగజబాధితఁ గాఁ దలంచుచున్. 65

క. యెవ్వనికి వలచెనో కో? యీ
జవ్వని యని రవ్వమీఱు ♦ సరసోక్తులు లే
నవ్వులు ముడిచినపువ్వుల
రువ్వులుఁదనయందె సమధి ♦ గూఢములగుటన్. 66

మ. బళిరా? తేరకుఁదేరదక్కె నిటులీ ♦ బంగారుకుండంచుఁ జం
కలుదాటించుచుఁ గెంపుమోవి దొడుకం ♦ గా గుబ్బపాలిండ్లు బి
ట్టలరుంగా ముఖగంధపారణము సే ♦ యంగాఁ గటిసీమ ను
త్పలపత్త్రాళిఘటింపఁగాఁ దివురుమి ♦ త్రద్రోహి మోహాంధతన్. 67

సీ. తలపుండ్లు గడిగించి ♦ తను బ్రతికించెఁగా
యడవిఁ జోరాహతుం ♦ డైనఁ దెచ్చి
కన్నబిడ్డలకన్న ♦ గారవంబునఁ జన
విచ్చెఁగా నిచ్చలు ♦ నింటిలోన
గ్రాసవాసక్లేశ ♦ కశ్మలత్వ మడంచి
యనురక్తిఁ బెనిచెగా ♦ యనుదినంబు
గురువుగా వేల్పుగాఁ ♦ గూర్చుచుట్టంబుగా
భావించి కొలిచెఁగా ♦ భక్తియుక్తి

గీ. నెవ్వఁ డా రెడ్డియింటికి ♦ నెగ్గుచాలఁ
జేయు గుడినుండి గుడితాళ్ళ ♦ దీయకరణిఁ
గపటనటనా నటుఁడు(తాటఁ ♦ గట్టుబోయ
కాయజామేయసాయకా ♦ ఘాతభీతి. 68

చ. కరఁగిన డెందముల్ విడుపు ♦ గానని కోర్కులు పారవశ్యముల్
బారసిననిట్టచూపులు గు ♦ ముర్కొనుముత్పులకాంకురావళుల్
చిరిఁగినసిగ్గులుం గలిగి ♦ చీఁకటివేఁకటిరేలఁ జాల వా
లిరి తలిరాకుఁబోఁడియు న ♦ శీకవిశిష్టుఁడు దుష్టచేష్టలన్. 69

క. మతిఁబాపమనక పాత్రిత
చ్యుతికరమగు తెగువ కతఁడు ♦ చొరఁబడె“నరకే
సతి క్రోధాపో మరణే
సతి కింభయ”మన్నచదువు ♦ చదువంబోలున్. 70

ఉ. లద్దమరేయిదాఁక పొల ♦ మారసి మారశిలీముఖాహతికిన్
నిద్దురఁగాచి యున్నమగ ♦ నిన్ జగనీలిపిసాళిజంత య
ము(ద్దియ సేవసేయ దొక ♦ముచ్చట యూడదు మూఁగబోలె నే
నుద్దియు లేకకన్మ్రొగిచి ♦ చూచుమనోగతిఁదోఁచు చెల్వనిన్. 71

సీ. పొన్నాకుపై తేనె ♦ సన్నచంద్రికమోవి
మాధుర్య మనక వే ♦ మాఱుఁబొగడి
యామనిబుగిబుగ ♦ లంగచంపకదామ
గంధంబనక పెక్కు ♦ గతులనెన్ని
పడనున్నపండ్లసం ♦ పద పెంపు పాలిండ్ల
బీరంబనక సారె ♦ సారెఁదలఁచి
తెలియ నభ్రచ్ఛాయ ♦ వలమానికచభర
ప్రకటనం బనక మా ♦ టికిని మెచ్చి

గీ. దినదినంబును గసికాటు • చెనకువలన
దప్పిదీరని తమకంబు • దెప్పరంబుఁ
బాప సమకట్టి జారుఁడ • ప్పాటఁ డసతి
నెత్తుకొనిపోవనిందందు • నెడరువేచె. 72

క. ఆతతిఁ దన్నగరీపతి
జాతరసాటించెఁ బశువి • సర మనితరసా
ధ్యాతతవాతామయని
ర్ఘాతాహతిఁ దూల గాలి • గంగలకెల్లన్. 73

సీ. గోర్వెచ్చవమురంటు • కొనిరి మస్తకముల
జలక మాడిరి నిశా • మిళితవారి
కట్టిరి చిఱుతచౌ • కములక్రొంబుట్టముల్
కాటుకదీర్చిరి • కన్నుఁగవల
దిద్దిరి సిందూర • తిలకంబు బటువుగా
నక్కుఁగొప్పులవిరుల్ • గ్రుక్కిరగ్గి
నింబప్రవాళమా • ల్యంబులు వైచిరి
చిట్టిపొట్టిధరించి • రిట్టుంగట్టు

గీ. తరుణధావనధగధగ • ద్దశనమణుల
హత్తుకొలిపెరి లేఁతపీ • ద్యములడాలు
పర్వదినములఁ బామర • పామరదలుదిత
నియమసంభావనారంభ • నిభృతబుద్ధి. 74

క. ఎడ్డతనపుఁగయిసేఁతల
రడ్డులు నడచిరి పురస్స • రద్భార్యముగా
గుడ్డంబుచక్కఁ గట్టం
బడ్డమహాశక్తి దివ్య • భవనంబునకున్. 75

వ. అమ్మహోత్సవం బజప్రధానంబగుటవిబుధసభయుంబోలియుమ
హాసురోదారంబును, తమోవిక్రతివిధేయంబగుట 'విధుబింబంబు
నుంబోలియుఁ దారావియోగముదితంబును, బహుళధ్వని పకి
తంబగుట సత్కవిత్వంబునుబోలియు నసాధువర్ణసంబాధబంధు
రంబయ్యెనయ్యెడ. 76

సీ. అంభోధరముక్రింద • నసియాడు నైరావ
తియుఁబోలె సిడివేఁలెఁ • దెఱవ యోర్తు
చెందమ్మిక్రొలన రం • జిల్లునంచయుఁబోలె
నిప్పుటేటఁ జరించె • నెలఁతయోర్తు
తొలుసంజయండవ • ర్తిలునంచయును బోలె
నీఁగెబందిరిగుండ • మింతియోర్తు
జలనీలిపై నెక్క • కలువమొగ్గయుఁబోలె
ననఁటాకునర్తించె • నతివయోర్తు
గీ. కాంతయొక్కర్తు మూఁపునఁ • గండలిచ్చె
మారుగాలిచ్చె నొకసుధా • మధువాణి
లలనయొక్కర్తు నోరితా • ళంబులిచ్చె
శక్తిజాతరసద్భక్తి • శక్తులెసఁగ. 77

క. బత్తులు నునువాకత్తుల
మొత్తిరి పళుసమజముండ • ములు చండములా
నెత్తురుధారలు ఘోరవి
పత్తిమిరనవారుణప్ర • భలు ప్రబలంగన్. 78

తే. పెలుచఁ గలుచొక్కు చెలువలు • తలకునెక్కఁ
దోన దిక్కులతలకెక్కఁ • దొడఁగెఁదమము
దేవిగుడిలోన నొక్కొక్క • దివియ దోఁపఁ .
దోన నొక్కొక్కచుక్కయుఁ • దోఁచె మింట. 79

క. ఎడరగుటఁ దెలిసి పాఱుం
బోడువఁడు గొనిచనియె మాఱు • భూమికి నట సం
దడి బొమ్మఁడు పెండ్లాడెడు
వడువునఁ గనుగాఁపుఁబాప • వయసుమిటారిన్. 80

తే. కాఁపుఁగోడలు కంచంత • కాఁపురంబుఁ
బాలవంటకులంబుఁ గా • డ్వఱిచి యుఱికె
మగని నటువెట్టి రెండవ • మగనివెంట
నువిదలకు బుద్ధిపెడతల • నుండుఁగాదె?. 81

ఉ. ఆకుమఱుంగుపిందె యయి • యంతిపురంబునుబోలె నున్నరా
కాకుముదప్రియాస్య భయ • గాఢతరత్వర నేగుఁగాని లో
నాఁకలి దప్పియున్ రవిక • రార్తియు నెన్నను మన్మథాస్త్రకీ
లాకలితప్తచిత్తలకు • లక్ష్యమె? తక్కిననొప్పులెవ్వియున్. 82

సీ. కఠినకంఠీరవా • క్షతనఖక్షతజర
క్తకరిశిరశ్శుక్తి శా • ర్కరిలతలము
లాశాంతజంతుకం • ఠాసృగువ్యాఘ్ర
ముఖగుహాభాంకార • ముఖరితంబు
లశ్వత్వషద్విషా • ణాగ్నినిగహవహా
త్ప్రస్తరప్రసవసా • రభమయంబు
లజ్ఞాతరపికర • వ్యాసారభూరుహ
చ్ఛాయానపాయార్తి • శైత్యఖనులు

గీ. గహనఘంటాపథంబులు • గడచి నడచి
యొక్కపక్కణ మీక్షించి • యూఱడిల్లి
యవరవర్ణస్నుషయు బ్రాహ్మ • ణాధముండు
బోయకులమునఁ గలసిరి • పొలుపుదక్క. 83

తే. ఎన్నిజన్మంబులేనియుఁ • జన్నపిదపఁ
గాని ప్రాపింపరానిధ • రానిలింప
జాతి గడెలోన నప్పాప • జాతి తొఱఁగి
కల్లు పెల్లాని వేఁటాడు • గరుసునోరసె. 84

క. స్వఘ్రాణానిలసౌరభ
మాఘ్రాణింపఁగ మదాళు • లాఖేటరతిన్
వ్యాఘ్రాదికభయదాటవి
శీఘ్రగతిన్ మెలఁగు నసతి • చెలువుఁడుఁదానున్. 85

మ. గతి మధ్య స్తన కుంతల స్తబక వీ • క్షా గర్వదుర్వార యీ
సతిచేమానమె యానమయ్యె నిఁక ని • స్సారసంబు ప్రాణంబు దా
ల్చుతగుల్గాదని రోసి యావృషలివా • లుందూపుఁ గ్రొమ్మంట కా
హుతియాబర్హిమృగేంద్రకుంభిచమరీ • యూథంబు నేణంబులున్.

సీ. జళుకులువారలె • స్నగదంచివెదురుబి
య్యమును బువ్వులపలె • నలఁతిలోవి
వార్చి డించినక్రొత్త • వంటకంబతిమాంత్ర
ధౌతశరావపా • త్రమునఁ జాల
వడ్డించి పలువన్నె • వన్యామిషంబులు
చుట్టువాఱఁగనుంచి • చొక్కటముగఁ
గాఁచినగురునెయ్యి • చేచాఁచఁజాలినం
తయుఁగుమ్మరించి త • త్తక్రపూర

గీ. మొకయలాబుశలాటుఖం • డోదరమునఁ
బూన్చి యటుడించి తానును • బొత్తుగలసి
సామిదష్టాన్నకబళముల్ • సామి కొసఁగు
నగుచుఁ జవులెచ్చరించుచు • నిగురుఁబోడి 87

శా. కాఁపుంగొంగిసురాసుఁబోఁడి పరలో • కబంతప్రాపింపుడున్
వ్యాపాదంబుననాతఁ డొందుగడ రూ • పాజీవరాజాననం
దాపంథచ్ఛదగుచ్ఛసచ్ఛవి మదాం • ధన్ బంధురశ్రోణి వీ
ణాపాణింథమపాణి నొక్కప్లవక • న్యం గూడి క్రీడింపఁగన్. 88

వ. అపవిత్రంబగుపుత్రలాభంబు దత్కళత్రంబునందు సంభవించె. నిట్లానష్టపూర్వద్విజన్ముండు కష్టమార్గంబున నెలసి నెలఁతయుం దానును బాలుమాలి మృణాళనాళపేశలంబగు ఫణాధరపరివృఢ ఫణాఫలకతలిమతలంబున నంటసిలంబడ నెడనెడం బెక్కుపాత కంబులు పార్జించుచు వర్తించివర్తించి యొక్కనాఁ డొక్కరుండు నుం గుక్కురకుమారయుగళంబుఁ గుపితశరభనిభంబగుదాని గళ గళాయమాన గళనిగళనియమితంబుగఁ గేలఁగీలించి యొంటిపా టున వేటపైఁగలతిపుట నూటాడుచు సమీపాటవీమధ్యంబుఁ జొచ్చి యాస్ఫోటించి పిక్కచెదరక దిక్కులుపరిభ్రమించి యద భ్రమదవిభ్రమ భూయిష్టంబులగు మృగంబులం దెగఁజూచి యేచి కన్నిచ్చకువచ్చు పెక్కనంజుడులు చేవడించక కావడించి ప్రొద్దస్తమించునంతకు నిజనిశాంతంబునకుం బఱతెంచునప్పుడు.

మాలినీ. కుపితశమనచక్షుః • క్రూరదుర్వారకీలా
స్ఫుటితమగువహ్నిన్ • దద్దివాకీర్తియిల్ మ్రి
గ్గి పడియె మధుపాన • క్షీబజాయాతనూజా
తపరిజనయుతంబై • దైవదుర్భావదృష్టిన్. 90

చ. తనగృహ మిట్లపత్యపశు • దారధనాదులతోడ మ్రగ్గఁగాఁ
గని వెఱఁగంది కందికను • గ్రింతల ముంతలఁబోసినట్లుబో
రనఁగడుబాష్పపూరములు • గ్రమ్మఁగ నేడ్చుచుమూర్ఛవోయియ
ల్లనఁ దెలిసెన్ వినిందితకు • లవ్యవహర్తమనోబళంబునన్. 91

క. ఇలఁజదికిలఁబడి పలుమఱుఁ
దలవోర్చుచు వికృతమగువ ♦ దనమున లాలా
జలములు తీఁగెలుసాఁగఁగఁ
బలుకు నతండాలిగుఱిచి ♦ పరిచితరక్తిన్. 92

ఉ. ఎల్లరునెల్లచోధనము ♦ లిచ్చి మృగాక్షులఁగొండ్రుగాని యో
పల్లవపాణి! యేఁ బరమ ♦ పావనవంశమునిల్చి కొంటి నీ
నల్లనిరూపు నిక్కమని ♦ నమ్మి ధుత్రివంబదిగాక నేఁడు వి
ద్యుల్లతికాధికాభినయ ♦ ధూర్వహమాటమెఱుంగనింతయున్.

ఉ. సన్నపుపిబ్బెముల్ గలుగు ♦ చన్నులఁబయ్యెదకొంగువాలఁగాఁ
గిన్నెరవీణమోపి శ్రుతి ♦ గీల్కొన సారెలు చక్కనొత్తి యు
ద్యన్నఖరప్రఘాణములఁ ♦ దంత్రులు మీటుచు నాలపించునీ
తిన్ననియెగ్గు నాచెవులఁ ♦ దేనియలొల్కుచవుల్ దలంచెదన్.

ఉ. ఈకడజాతినాతికి హి ♦ హీ! మహిదేవుఁడు చిక్కెనంచు నన్
రాకముఁ బోకకున్ జనప ♦ రంపర కెంపగుచూడ్కిఁ జూచి యం
బూకృతమాచరించుటకు ♦ బుద్ధిఁదలంక కలంకముక్తచం
ద్రాకృతిఁబొల్చునీముఖమునం ♦ దవ్వృతస్థితిఁగాంచిమించుటన్.

ఉ. పుత్రులు లేరె! యెవ్వరికి ♦ భూమి మదన్వయవర్ధనుల్ భవ
త్పుత్రులవంటివారు మును ♦ పుట్టరుగాక తదాస్యకాంతి, త
ద్గాత్రవివృద్ధి, తద్భుజయు ♦ గస్ఫురణంబు, తదుక్తిలక్ష్మి, త
న్నేత్రసరోజపత్త్రరక్ష ♦ ణీయత, చూపఱఁజొక్కఁజేయవే.?

క. అని తన యాలిని దనయా
లినిగని మఱికాని కుడువవ ♦ లెఁ గూడు జలం
బునుద్రావవలె ననుచు నన
శనమున నతఁడేగఁజొచ్చె ♦ జనరహితమహిన్. 97

క. కాఁగలపుణ్యుఁడు దుఃఖపు
వ్రేఁగు వహించుటనెపోలె ♦ విషమాటవిలోఁ
దూఁగుచుఁ దూలుచు నీరము
లీఁగుచుఁ దలవాంచి యురక ♦ యేగుచునుండెన్. 98

తే. నీచమగు మేను పాఱంగ ♦ నైచుకరణిఁ
బడి సరోరుహనేత్రున ♦ పారకరుణ
నధమలోకంబువిడిచి య ♦ య్యమరపథముఁ
జూచుటకుఁబోలెఁ దనుతానె ♦ లేచు నతఁడు. 99

వ. ఇట్లనుద్దిష్టప్రయోజనుండై బహుయోజనంబులు నిర్భోజనుండు నిరంబుభజనుండునై యాంసుజనుండు పెక్కుదినంబు లాక్రాంతమహాగహనవిహరణుండై యచ్చోట నిశాటపతివక్షఃకవాటపుటవిఘటనపటుచటులనఖరముఖరత్నాభరణాయమాన త్రిభువన భరణుండగు నృసింహుం డుపసంహృత వైకుంఠనగరనివాసుండై విజయంచేసియుండు నప్పుణ్యప్రదేశంబుం బ్రవేశించి. 100

ఉ. చేరువచేరునై కడుఁబ ♦ చేళిమమై తనుడాయుపూర్వసం
స్కారతపఃఫలంబున భ ♦ జద్వృజినావలినాశకృన్నృకం
ఠీరవదేవనిత్యసద ♦ నీకృతసంగమతీర్థరాజవా
ర్ధారల నాడి తత్పరమ♦ధామపతిన్ బలుమాఱుఁ జూచుచున్. 101

సీ. ఒకయింత తెప్పవే ♦ యక చూచుఁ దెలివారిఁ
దలఁగొట్టుకొనిదుఃఖ ♦ జలధిమునుఁగు
బిలముతెఱవుమంచుఁ ♦ బృథివిలోఁ జొరఁబాఱు
సమధికస్తంభోద్భ ♦ వము గమించుఁ
దిరియువాఁడును బోలె ♦ దెసలకుఁ జెయిచాఁచుఁ
దొరఁగు నస్రాంబునిఁ ♦ దొప్పఁదోఁగు

హా! పోయితే! యని • యయఱచు భార్యగుఱించి
బహువిధానక్తి వి • భ్రాంతిఁబొందుఁ
గీ. జేరఁగారానిదర్శన • స్థితి వహించు
బాడబస్ఫూర్తి లోఁగొన్న • పగిదినుండు
దానవారాతి కాఁబూని • తదవతార
దశకమును మున్న తాల్చె నా•ధరణిసురుఁడు. 102

క. ఉడుగనిపస్తులఁ జెవులను
గడియలునడ మేను వడఁకఁ • గాలము గడవం
బడమిఁ బుడమివేలుపు వడి
చెడి పుడమింబడియె విగత • జీవుఁడునయ్యెన్. 103

ఉ. ఈవిధమైనయయ్యధము•హీనవుమే నవుడెక్కఁ గాక ఘూ
కావలిదావకీలలగు • నల్కలుముంగల మొల్కలెత్త దం
తావళజాలనీలమగు • దండధరానుచరాగ్రణీబలం
బావలఁదోనలాఁచి వెస•మూతనపుందనువాఁగి రేగఁగన్. 104

సీ. లలనాధరోష్ఠలా • లాజలాన్వితముగఁ
గ్రోలెమద్యముపేరి• కులమునెల్ల
వావివర్తనలతా • వావంత దలఁపక
కన్నిచ్చవడ రేఁచెఁ • గామవికృతి
జనులు పుత్రివ్వఁగఁ దిట్ట • నడికోర్చి యాఁజించె
బశ్యతోహరవృత్తిఁ • బసిఁడిప్రోగు
కన్నపెట్టియుఁ ద్రోవ • గాచికొట్టియుఁజంపె
లెక్కకుమిగులుభూ • లేఖవరుల
గీ. మఱియు నీకీతికూర్రిరుల • మైత్రివడసె
నితరపాతకములుచేసె • నెన్నియేని

వీనిఁబోదువుఁడు కట్టుఁడు ♦ వ్రేయుఁడనుచు
జమునిదూతలు బాధింప ♦ జడిసి యతఁడు. 105

క. ఆక్రోశంబొనరించె ది
శాక్రాంతన్నాదముగ వి♦ శంకటగతి నా
త్నక్రమమగు నామెుఅవిని
నక్రోధాక్రమణనిపుణ ♦ సంభ్రమ మడరన్. 106

మ. అమరద్రోహివిరోధి ము న్నచ్చట ర ♦ క్షార్థంబుగానిడ్డచ
క్రము విక్రాంతివహించి భాస్కరసహ ♦ స్రక్రూరమై వచ్చి య
య్యమదూతావళి హావళిందెరల వి ♦ ప్రాధీనబంధప్రితా
నము ఖండించె నఖండితారసిఖస♦న్నాహంబు దిగ్గాహిగన్.

క. శీకులును గాందిశీకులు
నై కాలానుగులు గునుక ♦ నపుడరుదెంచెన్
శ్రీకాముకపారిషదా
నీకములు సుదర్శనాది♦ నీరజములతోన్. 108

క. అరుదెంచి జముపురికిఁ జను
తెరువున మరలించి తెల్ల ♦ దీవి తెరువునన్
హరిభృత్యులు నడపించిరి
గరుడాంచితయానమున ని ♦ గమశర్మాఖ్యున్. 109

సీ. ఉత్తాలఫణిభుగ్గ ♦ రుత్తాలవృంతాని
లాశాంతఘర్మరాంబు ♦ వయ్యె మేను
ప్రత్యగ్రముక్తాత ♦ పత్రీభవచ్ఛ్వేష
వారితాతపమయ్యెఁ ♦ జారుమౌళి
సూత్రవతీశదో ♦ శ్వేతోదత్తావకా
శామరంబయ్యెఁగ ♦ టాక్షవిహృతి

భృగు భరద్వాజ ప్ర • భృతికృతస్వస్తివా
గ్భరముఖరముల య్యెఁ • బార్శ్వతలము

గీ. లరుణకిణసహస్రాభ • మభ్రగంబు
నగువిమానంబు పై నెక్కి • నిగమశరత
తీండ్రఁబుండరీకాక్షుకోదండు • తండ్రిఁబోలి
పరమధామంబునకుఁబోవు • పథమునందు. 110

సీ. ఆజానుదీర్ఘంబు • లై హరినణిమయ
స్తంభంబులకుఁ గుల • స్వాములగుచు
దివ్యగంధముల ను • ద్రేకించి విద్యుదం
కురరేఖలకు జోడు • కోడె లగుచు
దలచుట్టుఁదిరిగిరాఁ • గలిగి పాండురపద
పత్రంబులకుఁ బ్రాణ • బంధులగుచు
సకలంబు వెలిఁగింపఁ • జాలి బాలార్కబిం
బములకు ననుబింబ • పఙ్క్తులగుచు

గీ. నాల్గుచేతులు గాంచన • నలినమాలి
కలు వెడఁదకన్నులాస్యప్ర • భలు చెలంగ
గుముదుఁడనుపేరఁ బరమేశుఁ • గొలిచినిలిచి
యున్నవాఁ డాతఁ డిప్పుడు • నోమునీంద్ర!. 111

తే. పుండరీకుండు శంఖక • ర్ణుండు వామ
నుండు కుముదాక్షుఁడును విజ • యుండు జయుఁడు
సర్వనేత్రుడు ననుపార్శ్వ • చరులలోన
హరికిఁగుముదుండు మానసీ • యత వహించు. 112

క. అమృతమయమూర్తి బుధహిత
విమలవిభోద్భాసి మసృణ • విలసనశుభల

క్షేత్రమహిమవర్ణకుఁడు విధుఁడట
కుముదానందప్రదాన • కుశలుఁడు గాఁడే?. 113

శా. ఏవంభూతమహాప్రభావనిధి లో • కేశుం జితక్లేశు మం
దావిర్భావహసైకమాత్రదళితో • ద్యద్దైత్యగర్వాంధకా
రావేశున్ నరకేసరిన్ గొలిచి ని • త్యప్రీతి నున్నారు వా
గ్దేవీవల్లభ ముఖ్యనిర్జరులు త • త్క్షేత్రాధిరాజంబునన్. 114

క. ఆనెలవున నఘనిశల
వీనులకుం దోఁచు నేచి • విధినందన! వై
మానికనాయకకృతఘం
టానాదము నృహరిబిగువు • నగవుంబోలెన్. 115

క. ఆక్షేత్రంబున నృహరికి
దక్షిణదిశ నే వసింతు • తత్పరమతి నీ
యక్షులతో నీపరమధా
ధ్యక్షులతో నీనగేశ్వ • రాత్మజతోడన్. 116

క. మాతృవధము, పితృవధమును,
భాతృవధము, గురువధంబు, • ప్రకటించియు నో
ధాతృసుత! యలిగి సురపుర
నేతృతఁ దెలియంగ నెట్టి • నీచుఁడు నచటన్. 117

క. కావున నరులకుఁ దక్షే
త్రావాసమొనర్ప నైహ • కాముష్మికముల్
చేవలఁతురుగసుచుఁదలకొను
నావుడు నాప్పుడుమగుతించి • నారదుఁడనియెన్ 118

క. దేవ! భవత్కృప నరప్రగ
దేవమహాక్షేత్రమహిమ • దెలిసితి నస్మ

ద్భావము ప్రమోద మేదుర
భావము గైకొనియెఁ జనియెఁ • భ్రమరాదములన్. 119

క. దైవము తీర్థము క్షేత్రము
నావాచంయములు గుహుఁడు • నడిగిన మీరల్
భావించి తెలుపుతత్త్వము
నావీనులఁ జొనపు మనుపు • పనుఁబురవైరీ!. 120

తే. అనుడు నుడురాజమకుటుఁ డి • ట్లను నృసింహ
తీర్థమునకు భిదేళిమ • దిక్కునందు
సిద్ధమాంచవవినుతప్రసిద్ధి • సిద్ధి వెలయు
నాద్యమై ఘర్మవీరామ • హాసవంతి. 121

తే. తీర్థసాగావతంస మ • తీర్థ మభిమ
తార్థదశ్రీలఁ జంద్రభా • గాఖ్య నందు
నందుఁ దపమాచరించి ము • న్నాదె నిందుఁ
డమరతతిలోన రుంద్రభో • గాతిశయము. 122

ఉ. తీర్థకు లర్థిఁగొల్వఁదగు • దానికి యోజనమాత్రభూస్థలిన్
దీర్ఘపదాస్పదం బఖిల • దివ్యనుతివ్యవహారయోగ్య మి
ష్టార్థసమర్థనక్షమము • నైతమమున్ విరియించుఁ జాతకా
నర్థము పౌండరీకమను • నర్థము దూషితరోషభూషణా!. 123

శా. నక్షత్రంబులకున్ క్షపాపతికిన్ • నాకున్ ద్రియామాచరా
ధ్యక్షద్వేషికి భానుపుత్రికి • మరుత్కల్లోలినీవేణికిన్
బక్షిశ్రేణికిఁ బక్షివల్లభునకున్ • భాసిల్లు దానన్ సమ
స్తక్షేత్రంబులలో ననూనమగు నే • తత్క్షేత్రమిమాక్షింపఁగన్.

క. "ఇదమిత్థ"మ్మని యేనును
మది మితిసేయంగనేర • మానీశ్వర! త

ద్విదిశప్రభావ మోపిన
విధమున వినిపింతు నీకు ♦ విను దృఢబుద్ధిఁ. 125

తే. జమునిచెలియలు నిర్ఝర ♦ శైవలినియు
బెరసి మెఱసిన నడుచక్కిఁ ♦ బేరుగ్రిచ్చి
ఋషులు తెల్పినతీర్థము ♦ లెల్లఁబౌండ
రీకషోడశకళఁ బోల ♦ లేక జడియు. 126

సీ. పాతకవ్రాతభూ ♦ జాతజాతానలం
బాశ్రితాభీష్టపా ♦ కావసరము
విషనిరాట్పర్యంక ♦ విహారణస్థానంబు
నిఖిలపుణ్యక్షేత్ర ♦ ముఖముకురము
నమదస్మదాదినా ♦ నామరున్నాధంబు
వర్ణితాఖిలపుణ్య ♦ వైజననము
దైత్యభిన్నగరమా ♦ తాగ్రివరస్థానంబు
వాఙ్మనసామేయ ♦ వైభవంబు

ఆ. వె. వంకు వామదేవ ♦ వాల్మీకి వరతంతు
గర్గ గార్గిపుత్ర ♦ గౌత మాత్రి
జహ్ను జామదగ్న్ని ♦ జాబాలి జైమిని
ప్రియకరంబుపౌండ ♦ రీకమనఘు!. 127

మహాస్రగ్ధర

కననీ గోడ్రాలు బిడ్డఁ ♦ గగనకుసుమముఁ ♦ గల్గనీ రాయిమాటల్
విననీ ముక్తుండు వెండిన్ ♦ విపులఁబొడమనీ ♦ వింటివా? పాండురంగా
వనిఁ బౌనఃపున్యజన్య ♦ వ్యవహృతిఁ గన వే ♦ వంకదుష్పంకశంకల్
వన రాశింజొచ్చునేత్రై ♦ వడివడియుడఁగున్ ♦ వారిజభూప్రిణసూతీ!.

తే. క్షితిఁ గురుక్షేత్రముఖమహా ♦ క్షేత్రతలము
లందుఁ జేయననశ్వరం ♦ బగుచు నిగుడు

దురితతతి గిట్టి నిజశక్తిఁ ♦ దునుముఁగాన
మేటియాక్షేత్రమొకపరి ♦ పాటిగాదు. 129

క. దాన స్నాన నిధన వాః
పానాదులఁ జేయనెట్టి ♦ ఫలములు వెఱచో
నౌనవి సకలముఁజేకుఱు
మానవులకు నందు నిమిష ♦ మాత్రమునందున్. 130

శా. ధర్మస్తేయము బ్రహ్మహత్యయు సురా♦పానం బగమ్యారహః
కర్మంబుల్ గృహదాహ ధేనువధ వా♦క్పారుష్యముల్ మున్నుగా
దుర్మార్గుల్పచరించుదుష్కృతతతుల్ ♦ దూలున్ మృగేంద్రధ్వనిన్
మారోర్ములు వడు లేటిమూఁకలనఁ ద♦న్నామంబువాక్రుచ్చినన్.

సీ. ఉరసిజాదృతవీణ ♦ సరసిజాసనురాణి
పూర్వకోటిగ మహా ♦ ద్భుతచరిత్ర
గజవైరివాహదు ♦ ర్గాదేవి పశ్చిమ
కోటిగ లస్తక ♦ క్రోడసీమ
భువననాయకి గాఁగఁ ♦ బొగడొందె యోజనా
ర్ధము విస్తృతియుఁదద ♦ ర్ధంబునిడుపు
గలిగిన తత్క్షేత్ర ♦ కార్ముకంబుధరించి
జగదేకధన్వి శ్రీ ♦ శార్ఙ్గపాణి
గీ. తీక్ష్ణశరములు దొడిపి యు ♦ దీర్ణకలుష
విషమలక్ష్యపరంపరల్ ♦ విఱుఁగసేయుఁ
గాన నదియ శరణ్యమై ♦ దీనుమిగులు
నైహికాముష్మికాకాంక్షు ♦ లగునరులకు. 132

తే. ఆత్మనామవసచ్ఛతు ♦ రక్షరముల
యందుఁ బురుషార్థములు నాల్గు ♦ ననఁగిపెనఁగి

తలలుముదిరినదురితదం • తావళములఁ
బొండరీకంబు హరిలీలఁ • జెండివైచు. 133

శా. ఆక్షేత్రంబుననుండు నట్టనడుమన్ • యక్షాక్షకేళీ రతుం
డక్షోభ్యుం డజరుం డనాదినిధనుం • డక్షామరక్షామయుం
డీక్షామాత్రకృతాఖిలుండు నవశ • క్తీశుండు కృష్ణుండు ప్ర
త్యక్షంబై యనుదున్ మరున్ముని యుమా•ప్రాణేశుతో నిట్లనున్.

క. అద్భుతమయ్యెడు నిఖిలజ
గద్భరితుఁడు యోగిహృదయ • గమ్యుం డచ్చో
నుద్భవమొందుట కీకథ
సద్భద్రా! నొడువు సుప్ర • సన్నత ననుదున్. 135

ఉ. ఆ పురవైరి పల్కఁ గల•హాళిఁ గుశేశయపాత్ర! విన్ము మున్
ద్వాపరముజ్జగిల్లుతఱి • దాంతుఁడు శాంతుఁడు హృద్విపక్ష శి
క్షాపటుశక్తి విష్ణుపద • సంభృతభక్తియునై జనించె ని
ష్పాపుఁడు పుండరీకుఁడను•బ్రాహ్మణుఁడొక్కరుఁ డక్కజంబుగన్.

సీ. పాతకంబులఁ బంచ • బంగాళములఁ జేయుఁ
గనుగొన్నమాత్ర మో • క్షంబునొసఁగు
మాన్యమౌ పుష్కరం • బునకు నల్లగ్గాపం
పకు నిది యనఁదగుఁ • బ్రకటమహిమ
బిందుసరఃప్రతి • బింబమై పశ్చిమ
ద్వారమునకంబై • గరముమేటి
యగుఁజంద్రభాగ మ • హాపుష్కరిణితటం
బునఁ జూత ఖర్జూర • పనస జంబు

గీ. కాంచనయుతంబు నృత్యచ్ఛి • ఖండికూజ
దిష్టపరపుష్ట గాయద • లీంద్రజుష్ట

మలసకల్హార పవన న ♦ మాఁగదళము
నైన యాశ్రమముఁ జేరించి ♦ యందునతఁడు. 137

సీ. నిండుమనంబున ♦ నుండు నారాయణుం
జెఱఁగించెనో నీట ♦ వఱలునునికి
నొసలిలోఁపలిచక్కి ♦ నెసఁగు చంద్రుఁడుదిద్దె
నో మింటవేఁ్రలెడు ♦ దీమసంబు
మూలాలవాల స్థలీ ♦ లేలిహానంబు
గాలిపెనో పవనంబు ♦ గ్రోలునేర్పు
కమలంబు లిరుమూఁడు ♦ గఱపెనో నూర్వ్యావ
లోకనంబునకాత్మ ♦ లోఁగను ధృతి
గీ. యనఁగఁ దత్త్క్రియలయందు ♦ నలఁత లేక
భూరికైవల్యసామ్రాజ్య ♦ భోగకాంక్ష
బాధనిష్ఠానురక్తిఁ ద ♦ పంబొనర్చు
కుదిసి ముల్లోకములును గ ♦ గ్గోలుపడఁగ. 138

గీ. భక్తిసంయుక్తియను పోఁతి ♦ పాల నొయ్యఁ
జెట్టుకట్టుచు మునిశాఖి ♦ నిట్టచూప
నిజమనోమార్గసంవస ♦ న్నీలవర్ణ
కైతవంబున లోఁ జేగ ♦ గలయ నూరె. 139

గీ. పుండరీకాఖ్యుఁడగుటనో ♦ పుండరీక
నేత్రభృంగంబు తనలోన ♦ నెలవుకొనఁగ
క్షితిసురేంద్రుఁడు తపమిట్లు ♦ చేయుచున్న
కాలమున నేగె ధర విష్ణుఁ ♦ గనుగొనంగ. 140

గీ. డెందమునఁబుట్టునలఁత ము ♦ కుందువలనఁ
దీర్పనూహించి చనుమహీ ♦ దేవికొనఁగ

గలశపాథోనిధానంబుఁ • గన్నుఁగవల
తెలివి బలితంపునమృతవ • ర్తియునుబోలె. 141

సీ. నీరజోదరయోగ • నిద్రావరణసీమ
చతురంబు సితసామ • జపరిభునకు
పానలుబ్ధాబ్దపఙ్క్తి • పాకల్పనము సూతి
కానికేతనము పు • ష్కరసదనకుఁ
గామధుకన్నంధాన • సీమధ్యదేశంబు
రసపతీ దేవతా • విసరమునకు
గోత్రభిల్లోకచ • క్రోరద్భగ్గోత్రంబు
మందురాస్థాన మ • మర్త్యహరికి

గీ. కాయమానంబు బలిగృహం • గణవసుధకు
సకలవాహినులకు జనాం • తికపదంబు
సారలోహరరము భూధ్రి • వైరిబద్ధ
బుద్ధిఁజొరఁబొంచియున్న దం • భోళికద్ధి 142

చ. అమితపిశాచభర్తతిపు • రాంతకుఁ డొందిన రాజశేఖర
త్వముఁ బెనుగొల్లఁ డచ్యుతుఁడు•దాలుచు శ్రీపతిభావముః మరు
త్క్రమనులు కూటిపేదలటు • గాక సదా యమృతాన్నభోజులౌ
క్రమము సుధాబ్ధిపుణ్యమునఁ•గల్గినవంచు నుతించులోకముల్.

ఉ. ధేనుగజాశ్వరత్నసుద • తీప్రముఖాఖిలవస్తుకోటి వై
మానికభర్త మున్గొనియు • మచ్చరమూరఁ బయోధిలోఁతుగా
గొనసెనకొల్పెనో బలుమొ • గుళ్ళ విప్లుష్టకరీపపిండరే
ఖానిభవృత్తి నత్తెఱఁగు • గా కలసీ రవిదారివ నేటికిః. 144

శా. అంతర్మగ్నదిగంతదంతికటని • ర్యద్దానధారాఝరా
కాంతంబుల్ నిజవేగభగ్నవపురుగ్ర•గ్రాహముల్ మేఘఘో

షాంతేవాసివిశంకటధ్వనులు నా ♦ గావాసగాహుల్ పయ
స్సంతానంబులు గ్రాలుపాలకడలిఁ ♦ జాగ్రత్ప్రచారంబులై.

శా. మాణిక్యంబులు మున్నగానిగుడుభ్రా ♦ వ్యాఘ్రభంగసత్వంబు ల
క్షీణశ్రీఁ గెరలన్ జలద్విపకర ♦ చ్ఛిన్నప్రవాళద్రుమ
శ్రేణిం గర్వముడిగ్గి యూర్వ్వదవసం ♦ శీర్ణంబులై కానన
క్షోణుల్ వోలె దలిర్చు నిచ్చలు సుధా ♦ కూపారపారస్థలుల్. 146

క. తరుణప్రవాళశోణో
దరతలమై శంఖచక్ర ♦ ధరమై వరపు
ష్కరపుష్కలమై హరికర
సరసీరుహ మనఁగఁ గలశ ♦ జలనిధి చెలఁగున్. 147

తే. నూత్నవీచుల సముపోఢ ♦ రత్నపుష్ప
నికరనిబిరీసమగుసీరు ♦ నించి తెచ్చి
యబ్ధివేలాసమాభ్యాగ ♦ తాతురాచ
లార్థులకు సర్థిఁ బాదార్ఘ్య ♦ మాచరించు. 148

తే. వార్ధి నావర్తగర్తప్ర ♦ వర్తులగుచు
నుదరరత్నాంశువులు గ్రమ్మ ♦ త్రిదశు లమర
తరులు నటకంగఁ దన్మూల ♦ తలము లమృత
సేకమున వెండి చిగిరించు ♦ చిగురులనఁగ. 149

వ. ఇట్లగణితగుణాభిరామంబగు నమ్మీనధామంబు సంగ్రామభీరుం
డును బోలె బెనువాలుగంటులం గనుపట్టి కుశలభటునిము క్తం
బగు విశిఖంబునుంబోలె నెల్లకందువులనుమీఱి పాటలస్ఫురితంబై
జరఠవిలోచనంబునుంబోలె నీరుపాపలం బొడువుటగలిగి పేదవడి
నపుడమివేలుపుంబోలె బలియింటివాకిటనడంగి వీరభద్రగదా
విదారితంబగు పూషార్కవదనగహ్వరంబునుంబోలెఁ బలువరుస.
బిగి దెరల నొరలి మతంగకులకన్యకయుంబోలెఁ బలుకందగు

నిలుకడ దాల్చి విభావరీవిరామసమయంబునుంబోలె వెల్లదీవియ లమించుటకు గుఱియై మఱియు నొక్కొక్కచోటఁ గుముదో దర విశదంబులు నొక్కొక్కయెడ నీలోత్పలమాలికామేచకం బులు నొక్కొక్కకడ శుకచంచూపుటపాటలంబులు నొక్కొక చక్కి శుక్తిశబరోదరంబులు నరుణోపల పట్టంబులం బొట్ట వెంచుచు నిట్టలంబుగ మిట్టించు వేలానిలసముద్భూతనూతనశీకర నికరంబులవలన నలినభవాండంబునకుఁ గర్పూరకరండభావంబు నుత్పాదించుచు నుత్తాలకాలస్కంధపలాశకులాసితద్యుతికూలం కషంబులగు శైవాలవల్లీ మతల్లికల నల్లిబిల్లిగొనుకల్లోలపఙ్క్తి వాళశాఖాశిఖలవలన నుపవాసక్లేశంబున నుడ్డుకుడిచి వెలుపటి కిం బుటమెగయుచు నుద్దామధూమధోరణీవ్యాజంబునం దలలు వీడ నీడాడంబోడచూపు నిబిడబడబానలకీలాకలాపంబులశంక నంకురితంబు సేయుచు సలిలకరటి చటులతరరదనశిఖరవిఘటిత గర్భగిరిగైరికసంక్రమగారుణంబులగుమృదుసముదితతరంగ కిశో రంబులచేతఁ బిహితావకాశంబై లక్ష్మీనారాయణశరీరాగూఢవి సృమరఘుసృణ రజోరంజితంబును తదీయవిలుంఠనావిర్భూతప్రీ డాపీడనంబునగుతలిమతలంబువిలసనంబు వశీకరించుచు సాత్వి కుఁగియ విధువిజృంభణముదితంబును,బంటకారుపగిదిం బ్రిసన్న శరీరంబును,సత్యలోకంబు నాకృతిం గమలభూయిష్ఠంబును, విలా సినీకరంబుకరణి వివిధమణికిరణపుంజరంజితోర్మికంబును, బరబ్రి హ్మంబువిధంబున సహార్యపదంబునై యొదవునాఱవకడలి పుడమి ముద్దియకుఁ దద్దయుఁ బ్రియంబు పుట్టించె నిత్తెఱంగున. 150

ఉ. ఎన్నఁగ నింత రత్నచయ ♦ మింత గభీరిమ యింత దానసం
పన్నత యింతశుద్ధి యని ♦ బ్రిహ్మయు నోరుమెదల్ప లేనియు

త్యున్నతిగన్న పెన్గడలి • నుత్థితమై వెలిదీవి చెన్నగున్
వెన్నెలయేటిలోనఁ బ్రభ • వించినకప్రపుఁగొండకైవడిన్. 151

శా. ఘాతాతంక మపేతపంకము బుధ • స్తుత్యంబు నిత్యంబు వి
ఖ్యాతం బాతపశీతవాత సహ సాం • ద్రానందయోగీంద్రసం
కేతం బాతతభూతి భూతిలకల • క్ష్మీకారి తోరంబు నై
శ్వేతద్వీపము దీపితంబగు జగ • త్సేవ్యైకభవ్యోన్నతిన్. 152

ఆ. వె. వణఁకుగుబ్బలికిని • వైడూర్యశృంగంబు
మొలచినట్లు మిన్ను • మోచియున్న
తెల్లదీవియందు • దీపించు వైకుంఠ
పురము కనకవప్ర • పరివృతంబు. 153

ఉ. సారసువర్ణసీరమయ • సాలవిశాలము నీలవర్ణసం
చారచమత్క్రియాచరణ • శాలియు నై పురి చెన్నగున్ మహా
మేరువుకౌఁగిటం బొలుపు • మీఱి మహోత్కటకూటసంచర
ద్వారణరాజమై సొబగు • దాల్చినరోహణశైలమో యనన్.

సీ. త్రైవిక్రమాంఘ్రి మున్ • తవిలి పీడినపద్మ
జాండఖండములీల • నలరుఁ గోట
పలుమాఱు గమఠాధి • పతిపూని డించుమం
దరములభాతి సౌ • ధములు వెలయు
నిజవిహారార్థంబు • నృహరిద్రిమై హరి చేయు
వసతులో యనఁ గేళి • వనములెసఁగు
శాంబరీ మత్స్యసం • చారోచితాపర
శరధులక్రియఁ బద్మ • సరసులమరు
గీ. నఖిలభువనాంతరాళపు • రాధిదేవ
తావితానంబు తత్సేవ • కై వసించు

సరసిఁ జూపట్టుదురు శర • త్సమయపూర్ణ
రాజవదనలు వైకుంఠ • రాజధాని. 155

సీ. జలకేళివీచీవాత్యఁ • జలిదాఁకెఁ గా యని
యక్కున నందంద • యలమియలమి
ప్రామిత్త్రియా కొత్తి • రాయిడిఁ బొందెఁగా
యని సన్నపొత్తుల • నునిచి యునిచి
వాపోయివాపోయి • నసివాడి యాకఁట
బెగడెఁగా యని యుగ్గు • వెట్టి పెట్టి
పెనుజీఁకటులు గ్రమ్మ • పెక్కైటపసియించి
వెఱచెఁగా యనిపుల్లు • విఱిచివిఱిచి

గీ. మంచిలక్షణములఁ బుట్టు • మచ్చవాఁడు
నేత్రములు విప్పనట్టి యీ • నెత్రుగందు
వఱలనే తెంచె నెవ్వారి • వాఁడొ యనుచు
విలయహారిఁ దెచ్చి పెనుతుర • వీవ్రటినతులు. 156

వ. మఱియు నప్పురంబు పలుదెరలుతిరిగివచ్చుట నాఖేటస్థలంబును నర్తనప్రదేశంబునుం బోలె లెస్సవారింగలిగి గజగ్రహణసంవిధానంబును, సుజనునింబోలె పెక్కుపట్టులంగనుపట్టి కురువింద మందిరంబును, కశ్యపమునీశ్వరుంబోలె హరికి గిరిగుహయును, మాధవునకు నుపవనవిశేషంబును, చక్రికి శ్రీఖండతరుకోటరంబును నై యడరం బుడమినిడువాలుగంటి తడవు మెచ్చుచుం జొచ్చి వియచ్చరసంబాధబంధురంబు నిసర్గశృంగారతరంగితంబు నగు రాజమార్గంబునఁ జనిచనిముందట నేత్రసన్నిహితజగత్త్రయంబునుంబోలె బహువిధజనాకీర్ణంబై యుదీర్ణవైభవంబున వర్ణింపందగి బృందారక:ద్విరదంబు చందంబున వలభిదారూఢోపరిభాగంబును జాంగలక్షేత్రంబువై చిత్రి యవనికామహి-

తంబు నాటకసంధానంబుకై వడి శుద్ధమిశ్ర విష్కంభ సంభృ
తంబును దధీచి శరీరంబుకరణి సురభిగోముఖావిద్ధంబునై యొప్పు
గూఢపదతల్పు దివ్యభవనంబు దఱిసి విరసజనహృదయంబులం
దగులువడని బ్రహ్మవిద్యయుంబోలె నజిహ్వప్రకారంబున సప్త
కక్ష్యాంతరంబులతిక్రమించి ముందట. 157

సీ. నవసుధా పరిఘాంబు ♦ నివహ ముబ్బెడుచోట
మెఱుఁగుఁబుత్తడికోట ♦ మించుచోట
నిగిడియాఁగులకెంపు ♦ నెలకట్టుగలచోటఁ
గల్వకావిరి కారు ♦ క్రమ్ముచోట
సలరుముమ్మొనలక ♦ ట్టావు లూరెడుచోటఁ
గెలఁకులకొలఁకులు ♦ దొలఁకుచోట
గంధర్వగాంధర్వ ♦ గంధ మింపగుచోట
గరుడకేతనములు ♦ గ్రాలుచోటఁ

గీ. బరమయోగివరేణ్యాని ♦ ర్భరసమాధి
సౌఖ్యసంపదనిరపాయ ♦ సంప్రదాయ
సిద్ధి దులకించుచోట న ♦ శేషభువన
వివిధధర్మంబు లావిర్భ ♦ వించుచోట. 158

క. బహుయోజనవిస్తీర్ణము
బహునారీజనయుతంబు ♦ బహువిధమహిమా
వహము నగునొక్కకేళీ
గృహమున నానందకోర ♦ కితమానసుఁడై. 159

మ. కలదోఃకంకణఝంకృతంబుల మరు ♦ త్కన్యల్ సుధాబిందుపి
చ్ఛిలనీహారమయూఖబింబసదృశ♦స్వర్ణాననశ్రేణి వ
ర్తిలనొయ్యొయ్యనఁ బసూఁగుఫణభృ♦త్ప్రేంఖోళికల్ చ్చిని
ట్టలపుంజన్గవఁ బోలు మున్నొరగుముం ♦ డాచేసి యుల్లాసియై. 160

క. దీపించువానిఁ ద్రిభువన
దీపకుఁ డగువానిఁ జంద్ర • దినకరమయపీ
యూషాపాతదళితనిజభ
క్తాపద్ధ్వాంతప్రవాహుఁ • డనఁ దగువానిన్. 161

తే. నగవు నురువులు మణిపూర • నలినహంసి
కుంతలగ్రాహములు నేత్ర • కుముదరుచియుఁ
గలుగు తనుకాంతికాళిందిఁ • గన్న తరుణ
తరణియునుబోని యురముర • త్నంబువాని. 162

తే. పుండరీకతపోజాత • భువనపీడ
విన్నపము సేయు నజునంస • వీథిఁ గేలు
సాచి హేమాద్రికంధరా • సక్త మేఘ
మాలికంబగు గగనంబుఁ • బోలువాని. 163

తే. లలితలక్ష్మీనఖాంకుర • లాలసమునఁ
గమ్రకల్హారదళగంధి • గౌరవమున
నతులనై పథ్యరత్నచం • ద్రాతపమున
నొప్పుమీరిననును సేస • కొప్పువాని. 164

తే. ఊరుయుగళంబుమీఁదఁ జె • ల్వారు నడిమి
తానవంబు నెపంబున • దనుజసదన
నిర్మిత స్తంభసంభవ • నిజపురాణ
పురుషహరిలీలఁ దెలిపెడు • పొలుపువాని. 165

తే. అభినవాయాతుఁ దనపుత్రు • నజునిఁ గాంచి
సంతసంబున నాభివే • శంతజలజ
ముబ్బి వెలిగ్రాయు పుప్పొడి • యొఱపు నెఱపు
హాళిఁ దిప్పుట్టంబు కటిసీమ • నమరువాని. 166

తే. అడుగునడుగులఁ బొడముచు • హ్నాంపుమీాల
మేనిచిప్పలువోలె నా • నా నిలింప
కనకకోటీరహీరాగ్ర • ఘృష్ణమున
మెఱుఁగువచ్చిననఖపఙ్క్తి • మించువాని. 167

తే. ఆద్యుఁ బ్రణవస్వరూపు వే • దాంతవేద్యు
మోక్షవిశ్వోపదేష్ట ని • రుక్తకజనను
విష్ణుఁ బ్రభవిష్ణు నిత్యవ • ర్ధిష్ణుఁ గాంచి
మ్రొక్కె నారీజనోచితం • బుగ ధరిత్రి. 168

క. మ్రొక్కి వినుతించెఁ దనమది
నెక్కొనునెగులెల్ల నేల • నెలఁతుక కన్నీ
రొక్కొక్కబొట్టు మెఱుఁగుం
జెక్కుల దిగజాఱ గోరఁ • జిమ్ముచు హరికిన్. 169

క. బలువేఁగునొప్పి నిమ్మై
నిల పలికినపలుకుకతన • హృదయము గలఁగెన్
నలినోదరునకు విలయా
నిలయాతాయాతచలిత • నీరధివోలెన్. 170

వ. ఇవ్విధంబున నమ్మధుమథనుండు వసుంధరమీాఁదంగల కనికరంబునం దరంగితంబగునంతరంగంబు తదభిరక్షణంబున కభిముఖంబుగావించి యటమున్న యకాండప్రళయంబగు పుండరీకుతపోదహనంబు దురవగాహంబును ద్రిభువనదాహ దోహదోహళంబునగునని విన్నపంబుచేసి•డాసియున్నవిరించిం గించిత్ప్రహసితాననుండై కనుంగొనుచు. 171

సీ. శాంభరీకచ్ఛపే • శ్వరకంఠసందీప్త
తాపింఛవల్లీమ•తల్లియనఁగఁ
బవనపారణపతి • స్ఫాటికస్తంభజం
భద్విషన్మణిసాల • భంజియనఁగ

సవనవరాహాదం • ష్ట్రాగ్రఖనితగ్రహాగ్రిత
కనకాక్షఘనకాల • ఖండమనఁగఁ
గకుబంతకరివర • స్కంధసింధుద్వీప
సాంసారికాసిత • హంసియనఁగ

గీ. భూరిభూభృచ్ఛిఖోద్యన్మ • యూరియనఁగ
నృగు భగీరథ భరతాది • నృపభుజాగ్ర
ఘటితకాలాగరుస్థాస • కంబనంగఁ
దగువసుంధరఁ గృపఁ బల్కు • దైత్యభేది. 172

శా. ఓయంభోరుహపత్రనేత్ర! మది నీ • యుద్వేగముఁ మాను దై
తేయప్రాయనృపాన్వవాయముల మ • ర్దింతుఁ భవద్భారముఁ
బాయం ద్రోయుదుఁ జేయుదుఁ సుఖులగా • మద్భక్తియుక్తాత్ములఁ
మాయామానుషమూర్తినై పొడమి నా • నావిక్రమక్రీడలఁ.

సీ. క్రూరాసిధారావి • దారితద్విపకుంభ
కూటముక్తాశుక్తి • గోస్తనములఁ
బటుగదాపాతని • ర్భగ్నసైంధవశిర
స్స్రవదస్రకుంకుమ • స్థాసకముల
శరలూనరథకేతు • సౌవర్ణకింకిణీ
కుసుమగుచ్ఛచ్ఛటా • గుంభనముల
ముసలమర్దితపదా • తిసహస్రభూషాన
వీనరజఃపటీ • వేల్లనముల

గీ. విజయలక్ష్మికి నైపథ్య • విభవ మొసఁగి
చటులరోషకషాయితా • శయవిరోధి
యూథమథనక్రియాహేతు • యుద్ధకేళిఁ
దేలి నీకిత్తు నానంద • మోలతాంగి!. 174

వ. మత్కృతంబులు మదీయరచితంబులు నగు నగణితాహవక్రీడ నంబుల సక్రోధవిరోధివధం బొనరించి తదీయకంఠనాళకరాళ రుధిరధారాసారంబుల నీకుం దాపోపశమం బాపాదించెద. పాప కారినిరసనంబు నాకు నవశ్యకృత్యంబగుట యెఱుంగవే? యు త్తరంబగుభవద్వారంబు తొలంగించుటయుకాదు. సముత్పాదిత త్రిభువనోపప్లవంబగు పుండరీకతపోదహన విహారంబు వారించు తలంపునున్నయది. యిన్నలువ యిప్పు డిటమున్న తన్నమిత్తం బని పనివిన్నవాఁడు. ఎన్నికదినంబులన్నియు శుభోదర్కంబు లయ్యె నని పుడమిపడఁతి యడ లుడిపి సగౌరవంబుగా వీడుకొ లిపి పరమపురుషుం డంతర్ధానంబునొందె. శతానందుండును సానం దంబుగ యథాస్థానంబునకుం జనియె నిట్లు. 175

ఆ. వె. పుండరీకుతపము ♦ భూదేవిభారంబు
ఫలమునందఁజేయఁ ♦ దొలఁగఁ ద్రోయఁ
గోరి మర్త్యుఁడయ్యె ♦ శౌరి పరార్థమై
పురుషవరులు వికృతి ♦ పొరయుటొప్పు. 176

సీ. వసుమతీభార ని ♦ ర్వాపణోద్యుక్తుండు
వర్ధితయాదవా ♦ న్వయపయోధి
దేవకీవసుదేవ ♦ సేవధి నందమం
దిరరసాలావాస ♦ పరభృతంబు
పూతనాప్రాణసం ♦ ఘాతవాతూలాహి
శకటాంగవిఘటన ♦ చటులబుద్ధి
సమదతృణావర్త ♦ సంవర్తసమవర్తి
పాతితార్జునపాద ♦ పద్వయుండు
గీ. వత్సహృతాన్వయకం బభి ♦ వ్యధితబకుఁడు
మర్దితాఘుండు కాళియ ♦ మానభేది

నిష్ఠురానలపారణ • నైష్ఠికుండు
కృష్ణుఁడాశ్రితలోకవ • రిష్ఠుఁడలరు. 177

సీ. కనుగట్టి గాంగేయ • గర్భు డాఁగురుమూఁత
లాడించె వత్సాప • హరణవేళ
నాలమందలఁబోవ • శైలమెత్తెడిపూన్కిఁ
గేలిమై కందుక • క్రీడసలిపెఁ
బాటించెఁ గంబాల • యూట రాసక్రీడ
నాభీరభీరువ • ధ్యాంకపాళి
వెలయించె యక్షాక్ష • విహరణం బలకాధి
రాజకింకరశిరో • రత్నరాజిఁ
గీ. దన్నుబిల్లాడె సంగుష్ఠ • దళితసర్ప
తనుసుదర్శననామవి • ద్యాధరేంద్ర
కేశినజఠరచ్ఛలమున న • గ్రజుఁడుదాను
నందసూనుండుబృందావ • నంబునందు. 178

వ. ఇవ్విధంబున నమ్మధుకైటభవిరోధి మాయామానుషవిగ్రహంబు నంగీకరించియు నమానుషంబులగు విక్రమవిశేషంబులం బ్రవర్తించుచుండె.అంత నటమున్న యవ్వెన్నునకు మనఃప్రీణనంబు గావింపందలంచి విరించి నిఖిలభువనమోహినియగునొక్కశక్తిఁ బుట్టించుటయు నమ్మత్తకాశిని తదాదేశంబున నందుమఱందియగు శతగోపుండను గోపాలునకుం గూరిమిపుత్త్రియై పెరుగుచుండె. అంత దంతావళమరాళశిఖావళగమనంబులగమకంబు దమకుం దొడవగుచు నిగడునడవడుల బెడంగారి బంగారంపుమెట్టకెందమ్ములకు నెత్తురుంబొత్తుచుట్టంబులనం జూపట్టు చిగురుటడుగులును, దారలగౌరవంబును ముత్తియంబుల క్రొందళుకును జంద్రమండలంబునఖండలావణ్యంబును నేవగించు చరణనఖము

కురంబులును, మకరధ్వజ శరధి శాలిగర్భ గోపుచ్ఛ కాహళా సందర్భంబుల సౌభాగ్యంబు నావరించు చిఱుతొడలును, వలుదత నంబులు సలపందనంబులు నిద్దంపుఁదనంబులు తద్దయుం గలిగి కరి కరాకారంబులై కరభనిభంబులై కనకకదళీ మృదులంబులునైన పెందొడలును, కరటిశిరః కఠినంబును రథాంగరమాధురంధరం బును పులినఘనంబునగు జఘనంబును ఆవర్తవర్తులంబును ని తాంతపున్నాగ లతాంతకాంతంబును నతిగంభీరంబునగు నాభీ సరోవరంబును, అసితబిలేశయ బాలికంబునకు నేలికయై చలిచీ మచాలునకుం బోలికయై శైవాలవల్లికిం దల్లియై చెలువారునూగా రును, ఆగడపలంగడియనై చివీచీరేఖలంబోఁదోచి కుసుమనా రాచు కేళాకూళింగలజాళువా సోబనంబులఁ బ్రతిఘటించు త్రి వళీవిభాగంబులును,కమలకోరక కనకకలశ కరికుంభ ప్రముఖంబు లగునుపమాద్రవ్యంబులక్రొవ్వడంచిపచారించిపిక్కటిల్లి పెరిగినిక్కి కక్కసించికవ జక్కవలఁ బెక్కునలలం బెట్టుచుఁ జూపట్టుదోర్మూలకూలం కషంబులగు కుచలికుచంబులును,ప్లక్షపల్లవవల్లభంబును చపేటపు టపరిస్ఫుటంబును నగు వేదీమధ్యనిభమధ్యంబును,ఫణిఫణాఫలక భాసురంబులును తాంబూలీదళతరుణంబులునునై నిగనిగనిపసిం డితగడుందెగడు కరమూలంబులును, కందర్పకళలచెన్నునం బూవు టెత్తులయెత్తున సోగతీఁగలబాగున బుజగలిగినబుజంబు లును, కలువతేకులచెలువున జోకమీరు వాలారుకొనగోరులు ను, పవడంపుం జివురులపగిదిఁ గలరక్తాంగుళిప్రవాళంబులునుం గ లిగి నెత్తురుట్టిపడుకరతలంబులును, కంబుబిబ్బోకావహంబును క్ర ముకతరుకమనీయంబును కోమలాంశుమత్ఫలాముకుళ మ్మోహానం బునగుకంధరాభోగంబును, సమ్మిశ్రిపటఫలద్వయశోభాద్వైత నిబిడంబగు చుబుకంబును, చక్కెరలధిక్కరించి తేనెలంబోనాడి

చెఱకురసంబుల నిరసించి మధురిమ నమరునధర బంధుజీవ ప్రసూనంబును, మొల్లల నుల్లసంబాడి యూణిముత్తియంబుల నుత్తరించి సుధాబిందువులఁ బలువరుసల సరసంబాడుపలువరుసయు, సంధ్యారాగరంజితంబగు కళారాజరేఖపొత్తు నడయు నుత్తరోష్ఠపుటంబును, పరిస్ఫుటనాసికాసుగంధనిశ్వాసధారాధోరణీ నిశితమార్గంబునుంబోని యయ్యూర్ధ్వోష్ఠబింబ ఫలంబుమీఁది నిమ్నభావంబును, సూనసాయకుదోనివిల్లును పల్లవకరవాలులాంగలాయుధంబును సామివికసితచంపకకోరకంబును నువ్వుంబువ్వును నవ్వుచు నివ్వటిల్లు నుల్లసితనాసికాశిఖరంబును, సితమయూఖరేఖా సఖంబగు నొసలును, నింబకిసలయంబులకపనయంబొందించు ముక్కును, నరంటిమొక్క మొనలియాకుతెక్కల నెక్కనక్కంబు సేయుచుఁ గాయజుసింగిణులవంగడంబగు నెలవంక కన్నుబొమల కొమలును, చకోరంబులప్రాకారంబును జేరలతీరును సారసంబుల దారసంబును మీలమేలును మెఱపులయొఱపును మరుతూపులకోపును నుత్పలంబులయొప్పును కైరవంబులగౌరవంబును నేణనేత్రంబుల వైచిత్రియు విసూత్రితంబులుగావించి మించు శ్రవణపుటకూప పతయాళువులగు విలోలవిలోచనంబులును, దర్పణంబులదర్పంబును సరోజంబులయోజయు సుధాకలశంబుల విలసనంబును నంబురుహబింబంబుల మదంబునుంబోషించి యుశేషకళాకలాపపాణింధమ స్వర భాస్వరంబగు వదనవలయంబును, శ్రీకారంబులజోకయుఁ దొమ్మిదింటి లెక్కలయొమ్మికయు మోదుగు విరులసిరులును బోసరించి వాసివడయుశ్రుతిశష్కులికలును, నిష్కలంకంబులై నిబిడంబులై నిద్దంబులై నీరంధ్రంబులై నీలంపుగుంపులసొంపు లామతించు మంచి నెఱికురులునుం, గలిగి

వలరాజునెత్తపలకతళుకునం గనుపట్టువీఁపున నేపారి యాపారిజా
తామోద మేదురవిలాసంబులభాసిల్లి వెండియు. 179

ఆ. వె. వివిధయువతికోటి ♦ వేమఱు సృజియించి
యవ్వధూటిఁ జేయ ♦ నజుఁడుతలఁచి
కేలుఁదోయిఁగడుగ ♦ వేళ్ళపుల తుదనంటు
జలకణంబులేమొ? ♦ సతినఖాళి. 180

తే. అంబుజాననపెందొడ ♦ లరఁటులగుట
దానఁగలిగిన లావణ్య ♦ సూనభరము
వలని పైజేకు లోకరెండు ♦ వ్రాలి బోర
గిలఁబడినరీతి మీఁగాళు ♦ లలరుసతికి. 181

క. మదిరాక్షి జంఘ లంగజు
గదలగు నూహింపఁ గావు ♦ కాహళులైన
న్నదుకువడక గీపెట్టక
పదనుదివిసి రాగిదేటి ♦ పలుకకయున్నే ?. 182

తే. కరికరంబులు త్వగ్దోష ♦ కల్మషంబు
సపనయింపంగ సతియూరు ♦ లై పొడమియుఁ
బుష్కరంబులతగులంబుఁ ♦ బూనె చరణ
దంభమునఁ బూర్వవాసన ♦ తలఁగ దెట్లు. 183

తే. బిసరుహాననకటిసీమ ♦ పృథివియగుట
నిక్క మటుగాకయున్నఁ బై ♦ నెలవుకొనునె ?
కాంచియును మధ్య మాయయు ♦ గమ్రనాభి
లక్ష్మియు ద్వారవతియు స ♦ లక్షణముగ. 184

తే. సకియనాభియమునసుండి ♦ జవ్వనంపు
బాలకృష్ణుండు వెడలింప ♦ బయలుపడిన

కాళియఫణీంద్రుఁ డేమొ? రో ♦ మాళి మధ్య
విష్ణుపదమున నణఁగిన ♦ విధముగలిగె. 185

ఉ. మానవతీలలామతను ♦ మధ్యమమన్ గజద్వైరి కుల్కి త
ద్యానమరున్మదావళము ♦ యౌవనపుంబొదరిల్లు దూఱఁగాఁ
గానఁగవచ్చు కుంభములు ♦ గావుగదా? కుచకుంభయుగ్మకం
బౌనటులైన వల్లభన ♦ ఖాంకుశరేఖలు గల్గి మీటగున్. 186

తే. వళులులావణ్యవారిధి ♦ వలన నిగుడు
వీచిలతికలు కాఁబోలు ♦ వెలఁదికేలు
విపులకంకణ మంగుళీ ♦ విద్రుమంబు
మత్స్యరేఖాంకితమునగు ♦ మహిమకలిమి. 187

తే. ముదితకరమూలములయొప్పు ♦ మ్రుచ్చిలించి
యీకయుండిననొక్కొ? నా ♦ ళీకభవుఁడు
ఫణిగణంబులఁ దద్భోగ ♦ పద్మరాగ
యోగమున ఊలు మోపించు ♦ చున్నవాఁడు. 188

ఆ. వె. కంబుపాణి తనకుఁ ♦ గాంతుండు గాఁగల్గు
బెఱిఁగి కంఠకంబు ♦ నింతి దాల్చె
నొక్కొ? యొప్పగాదె? ♦ యుత్తమసతులకుఁ
బతులు పూనినట్టి ♦ వ్రతముదాల్ప. 189

తే. సోమబింబాస్యదశనవా ♦ సోమతల్లి
యొప్పుచంద్రిక నెఱడాలు ♦ గుప్పళించి
జిలుఁగుఁ బలుచనివాసోవి ♦ శేషములకుఁ
జెన్నొసఁగుఁ గాదె? యెటువంటి ♦ కన్నెకలిమి. 190

తే. అలరుఁదేనియ నానిచి ♦ మొలకగట్టి
శర్కరాబీజములు సుధా ♦ శాదభూమి

భావజుఁడు విత్తమొలచిన ♦ పైరుపేర
వెడవిలాసంబు పూఁబోఁడి ♦ పెదవిపగవి. 191

తే. దాడిమీబీజరాజి కెం ♦ దళుకు మొల్ల
మొగ్గలపిసాళిమును ముత్య ♦ ములసుపాణి
తమ్మిపువ్వింటఁ గొలువున్న ♦ నెమ్మి వడయు
దంతురాలక సుస్నిగ్ధ ♦ దంతపఙ్క్తి. 192

తే. క్షీరకంఠంబులని బ్రహ్మ ♦ వారువముల
గెంటసంబాడు నడగల్గు ♦ కిసలయోష్ఠి
సుస్వరము లెక్కగను నోటు ♦ సూపి నిత్య
పల్లవగ్రాహిపాండిత్య ♦ పరభృతములు. 193

క. వదనారవిందదళమున
మృదుగతిఁజనుమందహాస ♦ మిష చంద్రికల
మ్మ్రదదంతావళగమనకు
నుదఢిశయసదృక్చకోర ♦ యుగహర్షదముల్. 194

తే. యువమనోజాంగలక్షేత్రి ♦ ముత్తరించి
గరుసువడదున్నుమదనలాం ♦ గలికుహలము
కామినీమణిముక్కటు ♦ గాకయున్న
నాసికాభరణపుఁగట్టు ♦ నాటునోటు?. 195

క. బిసరుహరజమునఁ బ్రైకం
దుసిమిన దగదగవెలుంగు ♦ నుడురాజుక్రియన్
బిసరుహపాణిముఖాంబుజ
మనసమాయుధసాధకుంభ ♦ మై జృంభించున్. 196

క. ఆవృత్తోర్మిలులితరా
జీవములకు మరుపతాక ♦ జీవంబునకున్

జీవంజీవంబుల కా
జీవంబులు చెలువకన్ను ♦ సిరులమెఱుంగుల్. 197

తే. వాసుదేవాదినవశక్తి ♦ వైభవంబు
రుక్మిణీసత్యభామల ♦ రూపరేఖ
యిదియె వహియించు నన నల్వ♦యిడినపదునొ
కొంటిలెక్కనఁ గనుబొమ్మ ♦లువిద కమరు. 198

చ. పడతిముఖాంశునిష్కములు ♦ భాసురవర్ణ లలాటపత్త్రికం
బిడి ఋణలీలఁ గైకొనియె ♦ నిందుఁడు,నద్దము,సాక్షిగాఁగ నె
న్నఁడొ జలజాత మప్పుజత ♦ నంబుగఁ దీర్పనిబల్మినోకొ వే
రడుసున నీట నొండ నిల♦నాఁగినఁదూఁగినఁనోర్చుచుండుటల్. 199

తే. సితకరశ్రీఁ బయోరుహ♦శ్రీని జేయు
కాంత మొగ మని శుత్రిపుటీ♦కైతవమున
నలువవ్రాసినశ్రీకార♦ములయుగంబు
వర్ణనాతీతరుచిమించు♦కర్ణయుగళి. 200

సీ. ముఖమంబురుహ మని ♦ ముమ్మరంబుగ నప్ప
ళించు తేనియదిండి ♦ లెంకలనఁగ
నాననచంద్రుని ♦ యంకకర్దమ మొక
కడ కోసరించిన ♦ పొడవనంగ
నధరసుధాపూరి ♦ తాస్యహేమకలశి
మూసినసీలంపు ♦ మూఁకుడనఁగ
వదనపద్మనిధిపై ♦ వ్రాలినయువమనో
మోహాంధకారస♦మూహమనఁగఁ
ఆ. వె. గలుకుఁదనముఁజాలఁ ♦ దఱచుఁదనంబును
నెరులసిరులు గలిగి ♦ విరులపేరి

కీర్తి బుగులుకొనఁగఁ • గిసలయాధరగొప్ప
కొప్పుకప్పుమీరి • యొప్పుటొప్పు. 201

క. వలరాజు కేలివాలుం
బలకయు బలెనలరు వేణి•పాణింధమమై
లలితాంగి వెన్నుపట్టియ
ధళధళ మనుకుందునంపుఁ • దగదుర్ దెగదుర్. 202

శా. ఈధారర్ భువనైకమోహనకళా•హేలావిలాసంబులర్
రాధాకన్యక ధన్యకాంతిఁ దనరా•రర్ దద్వశాశారతిస్
గోధుగ్బాలకదివ్యమూర్తియగుశ్రీ•గోవిందుఁ డంభోజినీ
మాధుర్యంబునకగ్గలించు నళిన•మాంద్రాకృతింగైకొనర్. 203

క. ఆరాధామాధవులకుఁ
గోరిక లన్యోన్యహృదయ•కోటరముల నం
కూరితములయ్యె దినముఖ
వారిజగర్భములనుబ్బు•వాసనలక్రియస్. 204

శా. చాణక్యప్రథిత ప్రభావ! సుషమా • సర్వస్వపుష్పాస్త్ర! శ్రీ
వాణీనిత్యనివాసనేత్రముఖ! సే • వాసావధానాఖిల
క్షోణీనాథ! చమూపనందన భుజా•కోదండలంకారి! య
క్షీణోదర్క జితార్క! సూనృతలతా•శృంగారచైత్రాగమా!.

క. సకలస్థానసరోవర
నికరమరాళాయమాన • నిజకీర్తివిభా
ముకురప్రతిఫలితదయా
సుకృతవితరణ ప్రతాప • శుభముఖ్యగుణా!. 206

మాలిని. వితరణరణదక్షా! ◆ వేదవేద్యాసపక్షా!
చతురమతివిశేషా! ◆ సారసంగీతపోషా!
క్రతుభుగధిపభోగా! ◆ కావ్యదత్తానురాగా!
ప్రతిభయభుజగర్వా! ◆ భక్తికాభ్యాసశర్వా! 207

## గద్య

ఇది శ్రీ పరమపదనాథనిరవధికకృపాపరిపాక
పరిచిత సరసకవితాసనాథ రామకృష్ణ
కవినాథ ప్రణీతంబైన పాండురం
గమహాత్మ్యంబను పరమ భా
గవతచరిత్రంబునందుఁ
దృతీయాశ్వాసము.



శ్రీరస్తు.

# పాండురంగమాహాత్మ్యము.

## చతుర్థాశ్వాసము.

క. శ్రీద్యుతిసువర్ణ రేఖా
విద్యోతితసదననికష! విద్వదనీక
ప్రద్యోతన! నుతగుణశత
వేద్యా! రామానుజేంద్ర వేదాద్రీశా!. 1

వ. ఆకర్ణింపు మానిలింపనదీకిరీటుండు హాటకగర్భసంభవునితో నిట్లని యె. అట్లు దినదినప్రవర్ధమానంబగుననురాగంబు చిగురుగొమ్మ నుం జేగ ద్రైకొనసాగుచు నికిందనికి రాధ మాధవునిం దనకు నధి నాథుఁ గాఁగోరి గోవర్ధనాచల సమీపవర్తియగు ఋణవిమోచన తీర్థంబున నందపంబు సేయం గడంగి. 2

సీ. ననలకొప్పిందోడిను యొత్తినఁ గంటగిలు మస్త
కం బెట్టులోర్చెనో కఱకుజడలు
కస్తూరితిలకంబు గాలివాటిన నేర్చు
నొస లెట్లు ననిచెనో భసితమునకు
వజ్రాలనూలునో ర్వని కటీతటి యెట్లు
తాళెనో పటుదుర్భ దామకాంచిఁ
జిలుఁగుదువ్వాలు వింత బెళకిన గరుదాల్చు
తనువెట్టు లోర్చెనో ధాతువస్త్ర

గీ. భరణమున కంచుజనము ల • చ్చెరువుఁ గొందఁ
గొమ్మ గావించెఁ దప మట్టి • క్రూరనిష్ఠ
గడలి కంపించుక్రియ జగం • బడలి వణఁకెఁ
దత్సమయజాతహేమంత • తరుణవాత్య. 3

శా. తత్తాదృజ్మదజృంభమాణతరుణీ • తారుణ్యసంపద్దశా
ప్రోత్తుంగ స్తననిస్తులోష్మకవచంబుల్ • పూనఁ గానోఁచుటం
జిత్తానందము గల్గు భోగునకు ని • స్త్రింశోగ్రసంపాతమై
యాత్తాలంబగు సీతుకందవ కరం • బుద్వేగ మొందింపఁగన్. 4

తే. చంద్రబింబాస్య కుచశైల • జన్మభూమి
గాన రోమాఫుఁబోలెన • క్కుడిఁదిచలికి
నించుకంతయుఁ గంపింప • దివముకొనుచు
ముజ్జగంబులు పచరింప • మూఁటిలెక్క. 5

తే. పారగంబునఁ దోఁచిన • పసిఁడితీఁగ
పగిది గాల్లె రాధ చం • పకసువర్ణ
వర్ణమగు మేను కుముదధ • వళతుషార
పటలకంచుకవేల్లన • ఘటనకలిమి. 6

తే. సవ్యకాలాగరూద్వర్త • నముల సతుల
చన్నుఁగొండల నుష్ణాగ్ని • సంభవించె
మతిసమగ్రులు ధూమాను • మానకలన
నగ్నిసాధింతు రచలంబు • లందు నెప్పుడు. 7

తే. సురలు కళలెల్లఁ గ్రోలిన • సోముతనువు
కప్పురముగుమ్మరించిన • గనకక్రోవి
పుప్పొడేనియచనినయం • భోరుహంబొ?
యనఁగ మంచింకి బ్రహ్మాండ • మగలెఁ జలిని. 8

క. అగలుం గుంకుమపువ్వును
దొగరుంజేలలును సీతుఁ • ద్రోవం గలవే?
పొగలేనిమురుమ్మరంబులు
మగువలపాలిండ్లు భోగ • మహనీయంబుల్. 9

క. పైనిగుడుమంచుతువ్వర
వానలచేఁ దఱిసి కమల • వనలక్ష్మి హరి
ధ్యాననిమీలితలోచన
యా నలరాధావధూటి • కనుగలమయ్యెన్. 10

తే. కాలుఁ గాలును గేలును • గేలుమోవి
మోవియును దార్చి భోగిస • మూహ మమరె
నూహసేయంగ భోగిస • మూహమునకుఁ
బొసఁగ మసకంపుఁబెనఁకువ • లెసఁగుఁగాదె?. 11

క. శ్యామలకాలాగురునవ
ధూమ మెదకు సుఖమొనర్పఁ • దోరపుఁగన్నుల్
వే మొగుచుకరణి సౌధ
స్తోమ మమరెఁ గప్పఁబడిన • సోరణగండ్లన్. 12

క. అంతవసంతము జితహే
మంతము దీపించి మత్త • మధుకరకలభా
క్రాంత మురుపుష్పరసవే
శంతము సకలద్రువులంబి • సాళము చెలఁగన్. 13

ఉ. కెంజిగురాకుడాలు దుల • కించిన ధాతుపటంబుచాయఁజే
యం జదుకెక్కుపుప్పొడుల • నంటిన తేఁటులు భూతిభృజ్జటా
పుంజముఁబోలఁగా విపిన • భూములలో మధులక్ష్మి పొల్చె నీ
లాంజనవర్ణుఁగోరి తప • మట్లొనరించుమృగాక్షికైవడిన్. 14

క. ఆవిర్భవించె నీల
గ్రీవాలికకీలికీల ♦ కేవలసఖమై
పూవులకారుడివోవం
గా వేసవి హాసవిపుల ♦ ఖరకరమగుచున్. 15

వ. అప్పు డప్పటుగభస్తి హస్తియుం బోలెఁ బరిక్రీడప్రమోదావ
హాకరప్రచారుండై, దవదహనంబు కురుమహీవిభుండునుం బోలె
స్వగోత్రనిర్భేదనిపుణంబై, మల్లియలపెల్లు కన్నడకవితావితా
నంబునుం బోలె షట్పదవృత్తవిలాసభాసురంబై, సరసులు సర
సులుం బోలె వనితావిహారమహనీయంబులై రహివహించె. అం
చలంచలం జంచలాచపలంబులును విపులంబులగు పడమటి పవ
నంబులు పొరుగులయుపవనంబులం బెరుగుకరువలివారువంబు
లకు గమనాభ్యయన గురువులుంబోలె వడిమెఱపి సుడిసె. యసిత
యగు వసుధఁ గాఁడినెఱియలువాఱినం దదుదర విస్ఫురితాంత్ర
లతామతల్లికలపెల్లువం బాతాళవ్యాళంబులు గానవచ్చె. పెచ్చు
వెరుగు ఖరకరకరనిపాతంబుల నాతప్తంబులగు నెలవులం దొరఁ
గి పరఁగువెలఁదివెన్నెల నీర్వట్టువెన్నెలపిట్టలు పొట్టలు నిండ నా
స్వాదించె. రక్కసజవ్వనులు మవ్వంపుమచ్చికల నిచ్చలు గ్రీడిం
ప నాప్రీడావతుల యతులనాభీ వివరంబుల నింకినవియుంబోలె
నదులయుదకంబులింకె. విచికిలమాలికాలంకృతమౌళిభాగులును
నారంజితధాతుపటల పదభాగులు నగుభోగులబాగున గుర్జ్డు
మోచు నెఱచీమలచాలు చెమ్మయిమ్ముల్రం గుమ్మరం దొడం
గె. వ్యావహారికసత్యత్వంబు ప్రకటించు ప్రపంచంబుచేత వం
చితులగు నెఱుకలేనికరటులకరణి హరిణంబులు మరీచికావీచి
కాపానవివశంబులై దిశలఁ బరిభ్రమించె. ముంచుకొనుసంపెఁ
గల సౌరభంబునకుం దాళని రోలంబంబులలీల వియోగిలోకఁ

ఖులు విషయవిముఖంబులయ్యె. ఇసుక మెదువు నెలవులం బన్నిన పసుపుటాకుంజప్పరంబులలోనం గుప్పళించిన కప్పురంబుతోడి కురువేరుపరిమళంబులును జాజివిరులవలపును వట్టివేళ్ళవాసనలుఁ గల ప్రపాపాలికాపఘన వర్జితంబులగుకలశోదకంబులు గ్రోలి సేదదేఱి తెరువరులు తాలవృంతానిలంబుల బలుపుకొలిపి మున్నుపరిక్షీణంబులగు ప్రాణపవనంబులం బోసరింపం జేసిరి. తత్కాలంబున. 16

క. ఆపద్మిని దినకరకర
తాపమునకు నోర్చి ఘోర ♦ తపమొనరించెన్
శ్రీపతియడుగుల గొడుగుల
ప్రాపొదవిన వారిఁ దాప ♦ భరమేలంటున్?. 17

తే. ఇట్టు లత్యుగ్రమగుగ్రీష్మ ♦ మేసరేఁగి
కాలవశమునఁ దనుఁదాన ♦ దీలుపడియెఁ
"బెచ్చువెరు గెట్టిదియు హెచ్చు ♦ పేర్చుటెల్ల
స్రగ్గుటకె" యని లోకోక్తి ♦ చాటుగాఁగాదె?. 18

క. దీపమణఁగఁ జీఁకటియును
గోపముడుగ శాంతిగుణముఁ ♦ గోల్కొనుక్రియ నా
టోపోద్భటమగువేసవి
కైపుసడిలఁ దోఁచెఁ గారు ♦ కాలము దళమై. 19

క. ఆకాశతత్వతనుఁ డగు
కాకోలగ్రీవుకంఠ ♦ కాళిమ యనఁగాఁ
గోకిలనీలము జలధర
పాకము పర్యాయవృద్ధిఁ ♦ బ్రబలఁదొడంగెన్. 20

సీ. ధళుధళుక్కున నింగిఁ ♦ దాటించెఁ బలుమారు
నీరాళ్ళగొందిఁగ ♦ న్నియమెఱుంగు

పౌలస్త్యపవనసం ♦ పాతజాతప్రీతి
నివిరినమ్రాఁకుల ♦ కెలమివచ్చెఁ
బ్రథమోదబిందుసం ♦ భారంబు మందునూ
నియ యయ్యెఁ బగిలిన ♦ నేలమేని
కుఱుము మంతురసాని ♦ యనుబోలెఁ గనిపించె
దోరంపుమణుల వి ♦ దూరభూమిఁ

గీ. గరలి సకిలించె పఙ్క్తుఖ ♦ మఱువమావు
పరిమళము చూచెఁ గరి శుల్క ♦ పల్వలంబుఁ
గడిమి చిగిరించెఁ గాజివం ♦ గడము సనిచె
సఖిలహితమైన మేఘోద ♦ యంబు నందు. 21

తే. కారుచిచ్చను భృగురాము ♦ కారణమునఁ
బెటిలి నిర్వంశమైనభూ ♦ భృత్కులంబు
క్షేత్రముల వంశవృద్ధి రా ♦ జిల్లెమఱియు
జలధరోదయవిప్రప్రి ♦ సాదలబ్ధి. 22

తే. ప్రిబలువడగండ్లు నిండ్రిగో ♦ పములు జంబు
ఫలములును బోల్చెఁ బచ్చిక ♦ పట్టులందు
వనధిసిరానఁ దెరలు స ♦ మ్యక్కులనెల్ల
నంబుదంబులు వెలిగాప్రిసె ♦ నఱుగకనఁగ. 23

తే. మోవిచెలువంబు గేదంగి ♦ పూవుజేగు
సోయగముసూఁపుకన్నుల ♦ సొబగు గెకుర
బర్హి బర్హ ప్రిభయుఁ జూపి ♦ ప్రిత్రిఘటించె
నంబుధరకాలసౌభాగ్య ♦ మంబుజాక్షి. 24

క. సలిలంపువృద్ధజలధర
సులుపూనినయూఁతకోల ♦ మొత్తములకిప్రియక

దొలువాన కాళ్లు లెసఁగెన్
కలహంసకులంబులెల్లఁ ◆ గలఁగంబడఁగెన్. 25

శా. అద్రిగ్రామము లుర్వరాల బలఘో ◆ షాడంబరంబుల్ విమో
గిద్రోహం బొనరింప వారినిధికెం ◆ గేలంటఁగా వాహినుల్
భద్రేభప్రతిమానమూర్తియగుచున్ ◆ పాథోధరశ్రేణి కుం
భద్రోణంబులు గుమ్మరించె విమలాం◆భఃపూరధారావళిన్. 26

క. పాపట తెలుపు నడిగి నా
సాపుటముక్తాఫలప్ర ◆ చారంబై రా
ధాపృథువక్షోరుహముల
పైఁబైఁబ్రథమోదబిందు ◆ పటలము నిగిడెన్. 27

సీ. పెరిగి సూచీముఖా ◆ భేద్యంబులగు నంధ
కారధారాచ్ఛటల్ ◆ గాఱుకొనినఁ
గర్జద్వరాపాద ◆ కంబులై దంభోళి
గంభీరరవములు ◆ గడలుకొనిన
ముజ్జగంబుల ముచ్చ ◆ ముడిఁగింపఁగాఁజాలు
నీఁదగాడుపులు బి ◆ ట్టెదురుకొనిన
దుర్గమకర్దమ ◆ స్తోమసంఛన్నభూ
ముల సోనవానలు ◆ ముంచుకొనినఁ

గీ. జెదరకఱకాలఁ గన్నువ ◆ చ్చినవిధాన
నాథసంకేతముల కేగు ◆ నడికిరేలు
కాయసంభవబాధాన ◆ హేయమగుచు
స్వైరిణీకోటి నిర్భయ ◆ స్వైరధాటి. 28

క. త్రిదశగురుప్రతిమానులు
నిది వగ లిది రాత్రి యనుచు ◆ నేఱుపఱుపలే

రు దళితహారినీలమణి
చ్ఛదనీలము మొగులు సూర్య • చంద్రుల మిగులన్.
క. తరణిలయానంతరమున
గరమమరు దిగంతములను • ఖద్యోతంబుల్
మరలఁగఁ దైె జనసృష్టికిఁ
బరమాణుచయంబు గూడఁ • బడుచందమునన్. 30
సీ. ఇంద్రచాపంబుగా • దిది మాళికలమున
నవరించుబర్హిపిం • ఛంబుగాని
భిదురఘోషంబుగా • దిది పాంచజన్యసం
జాతగంభీరఘో • షంబుగాని
యాశ్రయించినబలా • కావళిగా దిది
హారిముక్తాహార • యష్టిగాని
యిది కోలమెఱుఁగుగా • దుదిరి బంగారంపుఁ
బసిమిగ్రమ్మెడుపచ్చ • పట్టుగాని
గీ. వృష్టిగా దిది కరుణాంబు • వృష్టిగాని
నీలమేఘంబుగా దిది • నీలవర్ణుఁ
డౌర! నామ్రోలఁ బ్రత్యక్ష • మయ్యెననుచు
హర్షపులకితతనువయ్యె • నవ్వధూటి. 31
వ. ఇట్లనవరతధ్యానధారాప్రవాహమగ్నహృదయయగు నాగగ
నావలగ్నకు నిఖిలజగద్వలయంబును విష్ణుమయంబై తోఁచె.
నంత భక్తవత్సలుండగు శ్రీవత్సవక్షుండు. 32
సీ. అరచంద్రులోనిచి • హ్నాంశంబునుంబోలె
నుదుటఁ గస్తురిబొట్టు • పదనుకొనఁగ
గగనంబునందలి • ఖరమరీచియుఁ బోలె
నురమునఁ గౌస్తుభం • బొఱపుమీఱ

సురభూజశాఖలఁ ♦ జుట్టు తేఁటులుఁ బోలెఁ
గేలఁబచ్చలకడి ♦ నూలు మెఱయఁ
గొదమసంపెఁగమొగ్గ ♦ తుదఁ బొన్నవిరిపోలె
ముక్కున ముంగఱ ♦ ముత్యమమర

గీ. నీలగిరిఁగప్పు వెన్నెల ♦ నిగ్గుఁబోలె
నవకమగుమేన హరిచంద ♦ నంబు వొదువ
వివిధమణిభూషణప్రభల్ ♦ వెలయ ఫలిత
కల్పతరులీల రాధయ ♦ గ్రమ్మున నిలిచి. 33

ఉ. శ్రీదనరన్ గృపారసము ♦ చిల్కఁ దపోనలజాయమానహృ
త్ఖేదము మానిపించి తన ♦ కేలను గే ల్దెమలించి నిర్భరా
హ్లాద మెలర్ప నయ్యువతి ♦ నర్ధ శరీరము నట్లు ప్రోచె న
య్యాదవరాజవంశమణి ♦ యదిజ నేలినశూలిపోలికన్. 34

క. రాధాసంగమముఁదొతని
మాధవుఁగని మోటువడిన ♦ మాడ్కిఁ దెరలె శం
పాధరము తనదువర్ణము
బాధితమగునేని వెలుకఁ ♦ బాఱుఘనుండున్. 35

క. నీలాంజనవర్ణుఁడు రా
ధాలీలావతిని బెనఁగి ♦ తన రెడుకరణిన్
గాలము శరత్సమాగమ
హేలాసౌభాగ్యమహిమ ♦ నేపువహించెన్. 36

సీ. కలఁకనీరెంతయు ♦ గతకల్మషముఁ జేసెఁ
గతశాపలముఠీతిఁ ♦ గలశసూతి
పాపటదీర్చె భూ ♦ భాగంబు నాస్యాన
శాదంబుశకటాఘ ♦ చక్రిధార

శిఖి తాండవము కళా • సికఁ జేసి నడలించెఁ
గలుకుటీఁకలపేరి • కాసెబిగువు
లుడిగినజడివాన • లుదయించె వెండియుఁ,
గరిఘటామదవృష్టి • కైతవమున

గీ. ఱెల్లు శోభిల్లె మంకెన • లుల్లసిల్లెఁ
గాలకంధరవాహంబు • గజ్జరేఁగె
ముదితశతగోపకన్యకా • వదనతులిత
లలితరుచిఁ బొల్చె రాకాక • ళాధరుండు. 37

క. చనుమొలకలుగల కన్యా
జనములఁ బురుడించె బద్మ • సరసీరేఖల్
ననవిలుతుమిట్టకోలలు
వనరుహముకుళములు గాన • వచ్చుటకతనన్. 38

క. అల రాధికాధరాధర
దళముల యమభర్త నిలుచు • దంతక్షతరే
ఖలు నోలెఁ గ్రొత్తమంకెన
యలరులపైఁ దేఁటులమరె • నాసమయమునన్. 39

తే. పాంచజన్యంబు రాధికా • చంచలాక్షి
కంధరకు నోడి యెచటనో • క్రాఁగిపోవఁ
దద్గతధ్వని తచ్ఛ్రుత్గ • దాయయనియె
చేరె వృషభంబుకంఠకు • టీరవాటి. 40

తే. పుండరీకుని రక్షింప • భూమిభార
మణఁప నవనీతలంబున • నవతరిలిన
యల్లునిగుఱించి వచ్చు దు • గ్ధాబ్ధి యనఁగఁ
జంద్రికాపాండుజలధర • చ్ఛాయ వొదలె. 41

సీ. కలుగకుండిన నేమి ♦ కడిమిపువ్వులతావి
ననిచిన మరువమొం ♦ తటికి నోప
దొదవకుండిన నేమి ♦ మదకేకినటనంబు
చాలదె? యంచల ♦ సంభ్రమంబు
మెఱువకుండిన నేమి ♦ మెఱుఁగులపొలప మే
తనాత్రో ప్రములె? శాలి♦ధళధళములు
సుడియకుండిన నేమి? ♦ ఝోనవానలవెల్లు
గజదానవృష్టికిఁ ♦ గడమ కలదె?
గీ. కారుకాలానఁ గలిగిన ♦ గౌరవంబు
చౌకయ్యె తోఁచె శరదృతు ♦ సౌష్టవమున
నురలి తొల్లింటియధికారి ♦ యోసరిలిన
వెనుకయధికారియవి కావె? ♦ విభవకళలు. 42

ఉ. పాఁడియుఁ బంటయుంగలిగి ♦ పంకవిహీన మనోహరాంబువుల్
వేఁడిన నెల్లచోటఁ బ్రభ ♦ వింపఁగఁ భానుఁడు శీతభానుఁడుఙ్
గాఁడిన మేఘకాళమవి ♦ కారము దూరముసేయ నెంతయుఙ్
నాఁడెముచూపె శారదది ♦ నంబులు నిర్మలమూర్తి కాకృతిఙ్.

సీ. రక్షగట్టిరి మహీ ♦ రమణు లశ్వములకు
భూరిసీరాజన ♦ పూర్వకముగ
ఫలకగ్రహణముఁ జౌ ♦ పదములగరిమంబుఁ
బఱఁగె బాలకులకు ♦ గురువులిండ్ల
దుమికి చిచ్చఱతోర ♦ ణములు దూరినవారు
దూఱరైరి కృతాంతు ♦ తోరణములు
భుజియించెఁ బ్రజభోజ్య ♦ భోజనంబులు సిగ
బంటగాఁ దొల్కొత్త ♦ వంటకముల

గీ. నఖిలదిగ్జయకాంక్షఁ బు • ష్పాయుధుండు
వెలిగుడారంబులో వచ్చి • విడిదిచేసె
మురళిమ్రోయించెఁ ద్రిభువన • మోహనముగ
రాధకింపుగ నాదినా • రాయణుండు. 44

వ. ఇట్లు నిజజలనిమజ్జజ్జంతుజాలంబులకు ఋణత్రియవిమోచన హేతువగు నాఋణవిమోచన తీర్థంబునం దపంబుచేసి రాధకృతార్థయయ్యె నయ్యాదవకిశోరంబును గృశోదరీసహాయుండై మాయాశబలితుండగు జీవపురుషుని పరసున వివిధభోగపరాయణుండై పరఁగుచుండె నయ్యెడఁబుండరీకుని ప్రకారం బాకర్ణింపుము

క. ఉపమింపఁగ రాని తప
స్తపమునఁ గడువాఁడి మీరు • ధరణీసుమన
స్తపనుఁడు కమలవికాసం
బెపుడును నుడివోనితావి • నింపువహింపన్. 46.

క. ఆద్యశివాగ్నిస్థితమై
యుద్యజ్జ్యోతిర్జ్వాలాస • యుతమై స్వశిరః
పద్యోద్భవమై కడు నన
వద్యము సౌదశశతార • వనజమునందున్. 47

చ. జొటజొట ధారగావడియు • చుం గడలేత్తసుధారసంబు గ్రుంగుటగుట నప్పటప్పటికిఁ • గ్రోలుచు నాలుగు రెండుమూలలన్
గుటిలతదాల్చుభోగినిగ • గుర్వొడ మించుచు దక్షిణశ్రివ
స్తటవిసరత్ప్రమోదనిన•దంబునఁ జొక్కుచు మబ్బుగ్రిక్కుచున్.

ఉ. విచ్చినకమ్మదమ్ములకు • విందులు పెట్టు వెడందకన్నులున్
బచ్చనిపట్టుఁ బేరురముఁ•బొ్రికినమచ్చయుఁ బీలినెట్టెమున్
బచ్చికచాయయుం జిఱుత • పాయము గల్గువెలుంగు నిచ్చలో
రచ్చయొనర్ప నందలిప • రాకునఁ దేలుచు వేడ్కనేలుచున్. 46

చ. గురుజనభక్తియుం గపట ♦ గోపకుమారపదాబ్జశక్తియున్
దరలఁగఁ బాపభూరుహవి ♦ తానము లీనముగాఁ జెలంగుభా
స్వరతరయోగసీధువున ♦ సౌఖ్యమునొందుచుఁ జిద్విసాంకురా
హరణమొనర్చి భూమిసుర♦హంసముచాలఁబ్రశంసనొందఁగన్.

సీ. తనమొగంబులు ప్రాఁత ♦ మినుకుమానికముల
గము లుద్భవిల్లెడు ♦ గనులు గాఁగఁ
దనకమండలువారి ♦ దనుజారిపాదార్ఘ్య
మలవరించుట కూట ♦ చెలమ గాఁగఁ
దనమది నెద్దిదోఁ ♦ చిన నదియొక్కొక్క
రూపాంతరంబునఁ ♦ బ్రోది వడయఁ
దనకట్టునజినర ♦ త్నము సృష్టిదీక్షకై
కప్పినయదివోలెఁ ♦ గప్పుదేర

గీ. వీచువీవన చేఁబూని ♦ వెనుకఁదనకుఁ
జిఱుతచనుదోయి యొరగుగాఁ ♦ జేసి పలుకుఁ
జెలువ గొలువఁగఁ దొలుకారు ♦ కలఁకపులుఁగు
మాంపురాహుత్తు నిలిచె బ్రా ♦ హ్మణునిమ్రోల. 51

చ. నిలిచి నిలింపలోకతటి ♦ నీతటినీరజహేమనీరజో
జ్జ్వలబిసనాళఖాదనము ♦ వంకస పొంకముమీఱుక్రొవ్వునన్
గళముగదల్పలేని తుర ♦ గంబు దటాలున డిగ్గి నమ్రతా
కలితశరీరునిం దిగిచి ♦ కౌఁగిటఁజేరిచెఁ బుండరీకునిన్. 52

ఉ. చేరిచి సేమమే? సితకు ♦ శేశయలోచనగోచరాత్మ! నీ
వారికి నీకు నన్న విని ♦ వారిరుహాసనుఁ బల్కె నమ్మహా
దారుఁడమేయభద్రసము ♦ దాయ నిదానము నీవువచ్చుటన్
సారసగర్భ! యింకఁగొన ♦ సాగుఁజుమీ కుశలంబు మాదెసన్.

క. అని పరమాసనమిడి త
న్ననిమిషులర్చించునట్టు ♦ లర్చించె జగ
జ్జననస్థితిలయకారణ
జననజనిన్ సుజనమతి ర ♦ జనిరజనీశున్. 54

క. అర్చించి నిలిచి చేతులు
గూర్చి పురస్థలికిఁ జూచిఁ ♦ గోవిందపదా
బ్జార్చారసపానవిధుం
డర్చితతదితరుఁడు క్షితిసు ♦ రాగ్రణి పల్కెన్. 55

సీ. విజ్ఞానవంద్యుఁడీ ♦ విశ్వనిర్మాత యా
త్మారాముఁ డీత్రిలో ♦ కాధికారి
భూరిమధ్యజనితరు ♦ ద్రుం డీమహామతి
యజ్ఞాతచర్యుఁ డీ ♦ ప్రాజ్ఞతముఁడు
సర్వావయవజప్ర ♦ జావ్రజుఁ డీవేల్పు
ముఖ్యాత్ముఁ డీత్రయీ ♦ మూలభూతి
దక్షాదికప్రజో ♦ ద్భవహేతు వీయయ్య
కర్త్రైకసాక్షి యీ ♦ నిర్మలుండు

గీ. శాంతుఁ డీతండు వాఙ్మనః ♦ కాంతుఁ డితఁడు
వంద్యుఁడీతండు సజ్జనా ♦ వళుల కెపుడు
ననఁగ వెలుఁగొందునీవు నా ♦ కతిథివైతి
వేను తొలుమేనఁ జేసిన ♦ దెట్టినోమొ? 56

మ. అరుణావిష్కృతి భాస్కరోదయముఁ బ ♦ ద్మామోద మంభోరుహా
కరముల్ వేలుపువిల్ ప్రవర్షణమునోం ♦ కారంబు మంత్రాక్షర
స్ఫురణంబుల్ ప్రకటింపఁగా మొదల ను ♦ ద్భూతంబులై నట్లు లీ
శ్వరుఁడే తెంచుటకున్ ద్వదాగమముహా! ♦ సంసూచకంబయ్యెడన్

ఉ. త్వాదృశులందు నందకము • దాలుచు వేల్పు వసించునట్టు ల
ర్వాదుల నూఁది యుండఁ డని • యాడుదు రట్లగుటన్ సమస్తవ
స్త్వాదయహేతుభూతి వెలుఁ • గొందెడుమీ రిట కిట్లువచ్చుటన్
శ్రీదయితాగమంబు కడుఁ • జేరువయౌనని నిశ్చయించితిన్. 58

క. నా విని నగుమొగమున న
ద్దేవజ్యేష్ఠుండు వాసు • దేవప్రియు సం
భావించి సజలజలధర
రావ నిభ గభీరకంధ • రధ్వనిఁ బలుకున్. 59

చ. ఒసఁగెద నీకు వేఁడు వర • మో పరమవ్రత! యెద్దియేనియున్
మసలక యన్న నన్నయన • మన్వితుఁ డిట్లను నట్టిదేనియున్
బిసరుహగర్భ! దుర్భవవి • భేదనుపైఁ దలఁపుం దదీయసం
గసుఖ మఖండధర్మపరి • కర్మముఁ గూర్మినొసంగు నాకొగిన్. 60

చ. అనవుడు నట్లయిచ్చి కమ • లాసనుఁడా శమశాలిఁ బల్కె నో
మునివర! నీవుసేయుతప • మున్ జపమున్ బెరరేఁప నెల్లి నే
టన భవదగ్రవీధికిఁ గ • డారపటుం డిట వచ్చు మున్నె యా
యన నినునేలినాఁడు చరి • తార్థుఁడవీవు చతుర్థసంపదన్. 61

క. నీ యీ క్షేత్రము నో ముని
నాయక! దేవర్షి నరగ • ణప్రార్థితని
శ్శ్రేయసవదాన్య మగునని
పోయెఁ బయోజాతసూతి • పోయిన నతఁడున్. 62

ఉ. ధాతఁదలంచి మ్రొక్కి యవ • దాతసరోజదళాక్షుఁ గాంచి లో
బ్రాఁతి పెనంచి యన్నలువ • పల్కులు సత్యములొక్కొ? వాక్కథా
ప్రోతముకుందుఁ డెందు నను • బోఁటికి దక్కునె? దక్కకేమి? భ
క్తాతురతాపహారి దనుజారియ • నా వినమే? బుధోక్తులన్. 63

సీ. అవచూడబ్రహ్మబ • హ్మమున నొండొంటి సి
క్కములంటి చల్లించి • క్కముదలిర్పఁ
బంటకార్వాలిదమిత్ర • దంట గెంటనమూడు
వెడ దళన్నులకాంతి • వెల్లివాఁడువ
మెఱుఁగుఁజెక్కులమీఁద • మిట్టించి మొసలివా
గడమద్దికాయల • తళుకు లమర
వక్షస్థలమున శ్రీ • వత్సకౌస్తుభవైజ
యంతు లిందిరతోడి • వంతువడయ

గీ. నిమ్ననాభియుఁదివళివ • క్షితజఠరము
కరకలితచిత్రిభస్త్రశం • ఖములు నమర
మనమ్మనంబున నేపార్తు • మలయుచున్న
ధూర్తబాలుఁడు నామొ్రలఁ•దోఁచునొక్కొ.? 64

క. అని యీగతి మీమాంసా
వనిమానసమృగము దిగ్భ్ర • వైష్ణవరత్నం
బునకు నిజదక్షిణేక్షణ
వనజచ్ఛద మదరె శుభని • వహాపిశునంబై. 65

తే. నాఁడు మఱునాఁడు నవ్విప్రు • నందనురదు
ధాతమాటల చందంబు • దానవారి
తనకడకు వచ్చురాములు • తలఁచితలఁచి
ముచ్చటలమోటితరఁగల • మునిఁగితునిఁగి. 66

వ. మూఁడవనాఁడు యథాకాలపరిబుద్ధుండై పూర్వాశ్రిత సిద్ధా
శ్రిమంబున బద్ధపద్మాసనాసీనుండై. 67

క. కరివదనదేవతామిళ
దరుణాభచతుర్థళాథ్యా• వాదిమసాంతా

క్షరయుతమగు నాధారాం
బురుహంబునఁ గలుగువలపు • బుగులుకొనంగన్. 68

క. పూనఁ దటిత్ప్రభ షడ్దళ
మై నలువ వసింపఁ బాది • లాంతాక్షరసం
ధానస్ఫుటమగు స్వాధి
ష్ఠానాబ్జమునందు వెడల • సత్సౌరభముల్. 69

క. డాద్యము ఫాంతమమును నీ
లద్యుతియుఁ బురాణపురుష • లాలితము సుధీ
వేద్యము నగుదశపత్రిస
ముద్యన్మణిపూరకమున • మొలవఁగఁదావుల్. 70

క. శైవము ద్వాదశదళరే
ఖావళితకరంబు కమ్ర • కనకచ్ఛాయా
శ్రీవహము నౌ ననాహత
మేవేళంజెడనిగంధ • మిగురొత్తింపన్. 71

క. పదియాఱు రేకులందును
బదియాఱుసొరంబులుండఁ • బరమజ్యోతి
ష్ప్రదమై సురమునివశతన్
బొదలువిశుద్ధమునఁ బొంక • ముగఁ బరిమళముల్. 72

క. దళయుగమున హంక్షంబులు
పొలుపొందఁ జిదంశమగుచు • భూరిమణివిభా
వలిఁ దగునాజ్ఞాపురమునఁ
గలవాసన లేసరేఁగి • కడలుకొనంగన్. 73

ఉ. ఇంతకు నూర్ధ్వమై శిరసు • నిక్క నధోముఖమూర్తిఁ బొల్చి యు
త్యంతవికాసశాలియయి • యూర్ధ్వశివాశ్రయమై సహస్రప

త్రాంతరచిత్సుధారసమ ◆ హారఘురదుర్దిన మాంచరించు న
ద్దాంతరపుష్పవనం గలుగు ◆ తోరపుఁగంపులు పెంపుమీఱఁగన్.

చ. కనదయుఃప్రభావిభవ ◆ గర్వ మఖర్వముగా నొనర్చుచుం
దనువు తళుకుక్కనన్ మెఱవఁ ◆ దత్సరసీరుహపత్త్రి పేరిని
చ్చిన వడి నెక్కి నిక్కి నిజ ◆ జిహ్వకఁజాఁచి లలాటమధ్యసం
జనితసుధామయూఖసుధ ◆ సర్పపురంధ్రిక గ్రోలి సోలఁగన్.

క. హ్యానమ్రణిసూత్రాకృతియగు
చిన్మూర్తిఁ బురాణపురుషు ◆ శేషావాసుం
గన్మొగిచి లోనిచూపున
సన్మ్రొక్కుఁడతండు చూచుసమయమునందున్. 76

దండకము.

కశిదియసుకు ధేనుకున్ ధేనుకత్కిలదంభోళిసంస్తంభిదోస్తంభసం
భూతశౌర్యాగ్నిచేఁ గాంచి గోలోకముంగాచి గోవర్ధనక్షోణిభృ
త్కందరక్షోణిఁ గ్రీడించు విన్నాణిపెన్నాటకంబైన కాగ్రిన్నులన్
గల్గుపెందళ్కులన్ స్నిగ్ధన్ జిల్కునెమ్మోమ్మునుజాబిల్లి శోభిల్ల నుత్ఫు
ల్ల గల్లద్వయిన్ హత్తి మత్తిల్లి నర్తించుచున్ మాకరాకార రేఖా
భిరామంబులౌ కుండలంబుల్ సమగ్రప్రభా మండలంబుల్ చలిం
పన్ నిలింపాశుగాసాకృతిన్ మాసరంబైన మాయూరపింఛంబుతో
నైక్యముంబొందునిక్కంబుచే గొప్పయై కొప్పుగన్పట్టఁ గన్పట్టఁగాఁ
గోరి వెంటన్ మహోఘాలపట్టంబుపై నెట్టుకో, నిగమకమల గంధము
ల్సంఘిలం జేయునాసాపుటన్ బ్రిస్ఫుటస్ఫూర్తివర్తింప దృప్యద్ధను
స్సంపదల్ పెంపుమీఱంగ రంగద్రుచిన్ శాక్వరస్కంధబంధుత్వ
గంథంబు రూపించుమూఁపుల్ పురాయింప నింపారు రేఖాత్రయీా
మైత్రి నేత్రప్రియంబిచ్చుచున్ గంబుపాకంబునం బంధురంబై వల
త్కంధరంబొప్పఁ గ ప్పెక్కునీలంపుఁగంబంబులంబోలు బన్గేలు లీలా

విభూషావళిం జాలభాసిల్ల నుల్లోకసౌందర్యధుర్యస్థితిఁ విస్తృతర
జానురసీమజీమూతమై హారవర్ణోపలశ్రీశిరాణించు మించుం బు
రాశింపఁగాఁజేయు నచ్చోన యుచ్చ్యాన జానుచ్ఛవిఁ దుచ్ఛముం
జేసి కంజాతవాసాంఘ్రికంజాతలాత్తాంకశంకావహంబైన పంకేజ
రాగం బిగుర్పంగ, శ్రీచరణయుగళ హాటకంబై కనద్ధాటికోద్వృత్త
లాక్షోటులూటాడుచున్ జాటువాచాటతం జాటి ముప్పేటగాఁ జుట్టి
నఁ దీగచుట్టుల్ గటిఁ సంఘటిల్లన్ దటిల్లేఖ లేఖర్షభుం జేరి
రంజిల్లునా నుల్లలత్కాంతి గోయష్టి యుత్కృష్టమై హెచ్చుగా ని
చ్చకుఁ వచ్చుచున్ గచ్ఛకాయల్ కరాధిష్ఠి తాజాండపండంబు
లోనాఁ గడుఁ జిత్రభస్త్రంబునఁ నిల్చినంబొల్పుగాఁ గల్పక స్వ
చ్ఛగుచ్ఛంబు సత్యార్ధమై నిత్యముం గ్రొత్తగాఁబూనియున్నాఁడనఁ
భవ్యశంఖంబు సవ్యాగ్రహస్తంబునం దిమ్ముగా దివ్య భూషావిశే
షార్భటుల్ గ్రమ్మ లేఁదెమ్మెరల్ గ్రమ్మఁగాఁ నమ్రదిక్పాలకమ్రి
స్తుతుల్ స్వస్థలంబంట గానంటఁగారాక రాకాసుధాభానుభానూజ్జ్వల
జ్జ్వాలకీలాకులప్రౌఢరీఢాకృదారూఢగాఢత్విడౌఘంబుమోఘంబుగా
మేఘవీథిం ధరాధో జగద్ఘోరణిఁ దోరణుల్ గట్ట, యాదవ రమణుం
డు నాభిసంజాతకంజాత జాతుం డఖండాంఘ్రిపీఠీభవద్విశ్వవిశ్వంభ
రాభాగుఁడాభోగవద్భోగి భోగాసనుం డాసవామోద మాధుర్య ధు
ర్యాసుర స్త్రీ కపోలద్వయీ పత్రరేఖాపకారక్రియా క్రూరచక్రాం
కుఁ డోంకారసర్వస్వ నిర్వాహకుం డుర్విచే దుర్వహాంగప్రభాగుర్విచే
నోషధుల్ గన్న పృథ్వ్యవ్యక్ష్యపృథ్వీశముఖ్యుండు పుండ్రేక్షు కోదండ
లక్ష్మాభుఁ డంచద్దరస్మేరసారుండుదారుండు దారోత్తమల్ నీళయుఁ
బాలయుఁ లక్ష్మియుఁ పక్షమ్రలాక్షీ శిరోరత్నముఁ భూమియున్ భా
మయుఁ బ్రేమఁగామించి వెన్నాడఁగా మించి పంచాబ్దుఁ డయ్యుఁ
గడుఁ బ్రౌఢలౌ బోడలుం జూడగాలేని పెన్నిక్క నిక్కంబ యా
విష్కృతింజూపి దీపించియుండఁ. 77

క. కనుదెఱచి తనపదులోనం
గను దేజము మ్రోలఁగాంచి♦కమలాసనుఁ డా
డినయట్ల నిక్కమయ్యెనె?
విసఁ గననిది క్రొత్త యనుచు♦వెసనుత్థితుఁడై. 78

సీ. చామర ధ్వజ శంఖ♦చాప ప్రముఖచిహ్న
లలిత పదార్పణా♦లంకృతమహీ
దళితోపరిత్వగు♦జ్జ్వలదంశుమత్ఫలా
స్తంభాభిరామోరు♦దండయుగళు
వరదానముద్రాబ్జ♦ధరణభూషితకటి
న్యస్తకుంచితసము♦న్నతభుజాఢ్యు
సింహావలగ్నల♦క్ష్మీప్రపరిహాసి తో
యజగర్భగర్భవృ♦త్తావలగ్ను

గీ. జలదసంకాశు నిర్వ్రిడ♦జఘనదేశుఁ
గోటికందర్పలావణ్యు♦గుణశరణ్యు
విష్ణు నిజభక్తవర్ధిష్ణుఁ♦గృష్ణుఁగాంచి
పఱచె సాక్రోశుఁడగుచు నా♦బ్రాహ్మణుండు. 79

చ. పఱచిన దేవకీసుతుఁడు♦పక్కననవ్వెనఁ గ్రమ్మఱిల్లి మైఁ
దఱచుగ రోమహర్షణము♦దంచితభక్తిభరాకులత్వమే
ర్పఱచుచుఁ గేల్మొగిడ్చి పలు♦పల్కులతళ్కులసన్నవెన్నెలన్
బఱపుచుఁ బ్రస్తుతించె ముని♦బంధవిభంజను భక్తరంజనున్. 80

మాలిని. విధి శివ సనకాదుల్♦వేదముల్ గూడి నిన్నో
మధుమథన! యితం డి♦మ్మాత్రిక్కవాఁడంచు నెన్నన్
విధురులయినచోటన్♦నేర్చునే? గాఢమోహాం
బుధి వడిఁబడుచు న్నా♦బోఁటి నీవాట మెన్నన్. 81

తరల. హరిహయోపలభూధరాకృతి•నంద మొందినయట్టినీ
యురుభృగుస్తుతిపాత్రమున్ గట•కోజ్జ్వలంబు నఖాంఘుర
త్సురుచిమిత్రమునై నపాదము•నందునించె నంగ ని
త్యరతిఁబూని తలంతుఁ దాపని•దాఘవృత్తినివృత్తికిన్. 82

భుజంగప్రయాతము.

స్ఫురన్నాభిగర్తప్ర•భూతాంబుజాతో
దరక్షోణిలో వేల్పు•తాతన్ విధాతన్
నిరాతంకసర్గైక•నిర్ణేతఁ గంటన్
హరీ! తాతకుం దాత•వై యుంటయొప్పన్. 83

స్రగ్విణి. నీతిమై వైన్యభూ•నేతవై రత్నసం
ఘాతదివ్యౌషధి•గ్రామముల్ భూతహృ
త్ప్రీతిఁగన్పట్టవే•స్ఫీతహస్తోత్కటన్
భూతధాత్రీగవిన్•బూతనాఘాతనా!. 84

లయగ్రాహి.

ఆగమసముద్ధరణ!•రాగరసలంపట!సు•భాగమనియామక!ర•సాగర
మఠారీ!
భోగపదవీనిహిత•భాగవత! భూగగన•భాగపరిపూర్ణపర•భాగవరపు
రగాప్తీ!
త్యాగగుణధుర్య!ముని•యాగపరిరక్షక!హ•లాగతసమిద్విజయ!•సా
గత మతాహ్లో
ద్యోగకలికాలకలు•షాగకులిశాంక! కొన•సాగినకృపన్ మనుపు•యో
గిహిత! మమ్మున్.

మ. రవిధామంబులు సిద్ధమంత్రములు చం•ద్రజ్యోత్స్నికల్ సన్మణి
ప్రవరశ్రేణులు భవ్యభేషజతతుల్•పాథోధరంబుల్ సుధీ
భవనిస్తారక! సేమమిచ్చి జగమున్•బాలించు మర్యాదనీ
యవతారంబు లశేషలోకహితచ•ర్యాధుర్యసంచారముల్. 86

ఉ. అంజన,పుంజనవ్యతర♦మైం తగునీతిరువేంకటప్వక
ల్మంజులుకంగఁ జేకుఱుఁ జుమీ కమలేక్షణ! సూక్ష్మదృక్కులా
గంజభవాదివృద్ధులకు♦గాఢతరాక్షరలక్ష్మి యెందుఁ గా
నంజనుఁగాదె? కప్వకత♦నఁ మునుదోపనియక్షరస్థితుల్. 87

క కమిచి యజ్ఞుమేజ్ఞత్పణకా
ష్ఠములఁ బరిపూర్ణవృత్తి♦సమకూరెను నీ
యమిత మహా మహిమార్ధికిఁ
గమలభవప్రముఖులెన్నఁ♦గాబుద్బుదముల్. 88

పృథ్వి. జగత్పతి! భవత్పాదా♦బ్జయుగభక్తిసంయుక్తితో
నగుప్పోడువ నన్యథా♦గతియెఱుంగ కెవ్వాఁడునీ
యగణ్యగుణకీర్తనం♦బధిగమించుటల్ మించెనే
నగాధభవసాగరం♦బతఁడు దాఁటునొక్కత్తునన్. 89

క. భవదంఘ్రిదూరునకుఁ బు
ణ్యావసతి సులభంబె? వెఱతు♦నన్యభవంబుల్
సవరింప యుష్మదర్చా
ప్రవణమతిం జేయుమన్నుఁ♦బరధామపతీ!. 90

క. జయవిజయపూర్ణపార్శ్వ! వి
జయ జయ కల్పవధుకిణ!♦సమదదనుజరా
డ్జయసంరక్షితభువనా!
జయజయ! సగుణాగుణాత్మ!♦జయ శార్ఙ్గధరా!. 91

సీ. నడతునీక్షేత్రంబు♦నకుఁ జెయిచాఁచియ
ర్చింతునీనమిత్రన్♦సేవకులను
మొక్కుదునీపాద♦ములకు జిహ్వావీధి
నీనామములు వకా♦ణింతునెపుడు

నర్పింతు నీసేవకై సర్వదేహంబుఁ
జింతింతు నీలీలఁ జిత్తసరణిఁ
దనివోక నీచక్కఁదనము సంవీక్షింతు
నీయవధానంబు నెమ్మిఁబొందు
గీ. బ్రహ్మరుద్రాదులకుఁ గానఁబడని నీవు
నేఁడు నామ్రోల నిలిచితి నీలవర్ణ!
వర్ణనాతీత మత్ప్రాగ్భవపవిత్ర
పుణ్యపరిపాక మేరికిఁ బొగడఁదరమె?. 92

శా. నిత్యస్ఫూర్తిసనాథులై రి విధి కంతేకాలముఖ్యుల్ కృత
క్షిత్యానంద! యనాదిమూర్తివగు నీచేఁ దత్సనాథత్వసం
పత్త్యావిష్కృతి నాకునుం గలుగుఁ దత్ప్రాయుండనే? కాననే
మృత్యుక్రూరభయంబుఁ బాసితిని జుమ్మీ నీదయాసంపదన్. 93

మ. అని లోకత్రయమోహనుండగు రమాప్రాణేశు నెమ్మోమునం
దనచూడ్కుల్ నిగుడంగ భూమిసురరత్నం బూరకున్నంత నే
మునుగా ధాత్రిసమన్వితాఖిలమరుత్సఖ్యుల్ తగన్ మ్రొక్కిమో
ద్పవ కేలింపఁగ నమ్మురీశ్వరుగుణంబుల్ సారెగీర్తించినన్.

క. విని ముగ్ధహాసరుచి రా
ననుఁడై తనచుట్టునున్న నానామరరా
జనికాయముతోఁ బలుకున్
దనుజారి మహీసురాస్యదత్తేక్షణుఁడై. 95

సీ. దాంతుండు సత్యసంధాధురంధరుఁడు మ
ద్భక్తుండు పితృహితోద్యముఁడునైన
యుద్ధరామరనూతికీప్సితంబొసఁగ నే
వచ్చుచో మీరెల్ల వారునితని

కరిమ్రలిసాహాయ్యంమాచరించుటకునై
నేతెంచినారు నాకెవ్వరేని
హితులు వారలపనులెల్ల మీయవికాస
పరతాపతప్తులు పరముదేక

గీ. ముదితు లస్మత్ప్రశంసాభిముఖులునైన
వారు నాథ క్తులగువారి వారియందుఁ
బ్రీతిగలవారి నే నుద్ధరింతుఁ గీడు
వలన వారలకంటె సంవశ్యమగుట. 96

క. సద్భక్తసేవచేతను
మద్భావము తుష్టిగన్నమాడ్కిఁ దరుశిలా
ద్యుద్భాగప్రతిమార్చల
ముద్భరితముగాదు నిక్కముగఁ దలపోయన్. 97

మ. వలనా యేటికినాశ్రయించిమనఁగా వానీరమున్ నీరమున్
దలవెత్తే పచరింపనేటికి సమిద్దానంబు దానంబు న
చ్చలమా యేటికినెత్తిఁగొట్టుకొనఁగా సన్యాసము న్యాసమున్
గలిఁ దేఁజాలుమదీయభక్తిరుచిభక్తశ్రేణి కశ్రాంతమున్. 98

తే. సర్వధర్మవిహీనప్రచారుఁడైన
నాత్మ మద్భక్తి గలదేని యతఁడ చూవె
నాకు నత్యంతహితుఁడు సుశ్లోకరతుఁడు
నిఖలధర్మప్రవర్తననిశ్చితుండు. 99

ఆ. వె. అస్మదంకధారియగుభక్తనరుమేను
నాకుఁ గూర్చినట్లు నాకులార!
వదలకేవసించునై కుంఠనగరంబు
నందుగోలుపదంతరంగమునకు. 100

క. నాయందు భక్తుఁడుండున్
బాయక యే నధివసింతు భక్తునియందున్
మాయిరువురకుం గలుగున్
గాయప్రాణానుకూల్య కౌశల్యంబుల్. 101

ఆ. వె. మహితపుణ్యులైన మద్భక్తవరులకుఁ
గానివాఁడు నాకుఁ గానివాఁడు
భాగవతుల నన్ను భావించి యొకటిఁగాఁ
గన్నవాఁడు నన్నుఁ గన్నవాఁడు. 102

క. మీయెడ మద్భక్తిగుణో
చ్ఛ్రియము గనుఁగొంటి నేను సత్యంబు బహూ
పాయంబుల మద్భక్తుని
కై యిటకేతెంచుట న్వియచ్చరులారా!. 103

మ. సురకర్మంది హిరణ్యదైత్యసుతు వ్యాసున్ శౌనకున్ శ్రీపరా
శరు రుక్మాంగదు నంబరీషు నరమాజానిన్ వసిష్ఠున్ బురం
దరపుత్రున్ శుకు దాల్భ్య భీష్ముల వెఱఁగొందం జేయు మద్భక్తిత
త్పరుఁ డీపుణ్యుఁడు పుండరీకుఁ డితనిన్ భావింతు వేలీవులన్.

ఆ. వె. వినుఁడు మీకు నేనిఁ గనరానియీహితం
బీతపస్వివరుని కిత్తు నేఁడ
యొద్ది వేఁడె భక్తుఁ డద్దియ యొసఁగంగ
గట్టినాఁడఁ గేలఁ గంకణంబు. 105

క. అని దేవకీకుమారుఁడు
మునివదనముఁ జూచి పలుకు మోదాంబుదగ
ర్జనమనఁ బ్రసాదసాగర
జనితధ్వని యనఁగ నిగుడ సరసారభటిన్. 106

ఉ. నీపితృభక్తి నీతపము నీవనిశంబు నొనర్చునర్చయు
ద్దీపితహర్షుఁ జేసె జగతీసురనందన! నన్ను నీకు నా
రూపము భక్తిమత్సదనరోహణశైలము చాలదక్కఁ గాం
క్షాపరిపూర్తిగా వరము సంగెద వేఁడుము యథారుచిప్రభా. 107

క. భాగ్యమనై యిహపరపరి
భోగ్యార్థమనై యగణ్యపుణ్యమనై నై
రాగ్యజ్ఞానోన్నతులగు
యోగ్యతములపాల వాలి యుండుఁడుజుమీ. 108

వ. విశేషించి నీయెడం బ్రసన్నుండనై యున్నవాఁడ నభీష్టదృష్టిఘ
నాఘనంబగు మదీయఘృణాగుణంబునకు భాజనంబవైతివి. జగ
జ్జాలంబున వస్తుజాలంబు నీకుదుర్లభంబులే దనిపలుకుయదువల్ల
భువలనం బ్రబోధితుండై. 109

సీ. పుండరీకుఁడు పల్కెఁ బుద్బుదాభములైన
సిరులు నిర్గామింపఁ జేరి కల్ప
విటపి గుల్మక్రమముల్ వేఁడు వెఱ్ఱి గలాఁడె?
నిఖిలదుర్లభుఁడగు నీవు నన్నుఁ
గరుణింతు వరమిత్తుఁ గాతు నీడేరుతు
ననియుఁ బల్కె భయమేది యద్భుతార్థ
మర్థింతు నిపుడన్న యట్ల యస్మన్నామ
చిహ్నితై తన్మహాక్షేత్రతీర్థ

గీ. మధ్యస్థలమున నిలువు నా మునవిఁ జేసి
సకలజనులకు మోక్షరాజ్యము నొసఁగుచు
నిదియ నాకోర్కె జగదేకహితము నిదియ
దీని మిగిలిన సిరి యొల్ల దేవదేవ!. 110

వ. అని వెండియు నతండు చాపలాతిశయంబునఁ జర్వితచర్వణంబుగా సర్వసుపర్వదుష్ప్రాపంబగు నీరూపంబు కృపాపరతంత్రంబగుచు నాకునగపడుటకు భూతవాత్రితంబులు పరిభూతాద్భుతరసమసృణ మానసంబులగుచున్నయవి. భవదీయంబగు నకారణ సుకృతత్వంబునకు నియంతయుం గలఁడె? యుత్తరంగంబగు సంసారతరంగమాలి మున్నుంగుచుఁ బొనుంగుపడి యనంగీకృత విజ్ఞానజ్ఞానవిలాసులై దోషంబులఁ జేసిన కరువులనందగు నలసులకు వెలసులభంబు నధికఫలంబును నగుయుష్మద్దర్శనంబు. భవభయకర్శనంబు నుపసర్గజలద వర్గస్పర్శనంబు నపవర్గ దర్శనంబు ననగుఁగాక. ఏతత్క్షేత్రంబు నీయాజ్ఞ నశేషక్షేత్రవిశేషోత్తంసంబగుంగాక. ఈతీర్థంబు నస్మన్నామాంకిత సమర్థంబున నుత్తమంబగుంగాతమని. 111

ఉ. ఆనతమౌళియై యటులుఁ బ్రార్థనఁ జేయుమునీంద్రు శాంబరీ
మానుషవేషధారి దయ మానమనస్థితి బిగ్గనవ్వచుఁ
బీనులఁ దాఁకుగన్నడల వేమఱు చూచుచుఁ బల్కుఁ జల్కుఁ పూఁ
దేనియసోన వెల్లువలఁ దెప్పెలఁదేలెడు మేలిపల్కులన్. 112

సీ. అతిదుర్లభంబు వేఁడితి దుర్లభుఁడనైన
నేనీకుదక్కుట మానివర్య!
త్వత్ప్రియార్థముగ నీస్థలమున పరివార
యుక్తుఁడనై నిల్చి యున్న నన్ను
సేవించువారెల్లఁ జిరపుణ్యవంతులు
నిహపరసుఖలాభ హృష్టమతులు
కలికాలకల్మష గరళకూటాటోప
కాకోలకంఠులు గళితభవులు.

గీ. నయ్యెదరు సర్వదివ్యోత్త•మాస్పదాఖ్యఁ
బూని యీక్షేత్రమును దీర్థ•మును సమస్త
భువనవర్ణితవిఖ్యాతిఁ•బొదలుగాత
మెల్లపుణ్యస్థలములకు•నెక్కుఁడగుచు. 113

క. త్వన్నామచిహ్నితంబగు
నిన్నెలవె తెల్లనీవి•యేనుండుటకున్
మన్నించి భక్తవాంఛా
భ్యున్నతులొసఁగుటయె నాకు•యుక్తవ్రతమున్. 114

సీ. వినుధాతృసుత! యప్పు•డనిమిషు లసురారి
కృపకు[illegible]చ్చెరువొంది•కేలుమొగిచి
పరమేశ! యోభక్త•పరతంత్ర!
భావానువర్తి! పరబ్రహ్మ!•వరద! నిన్న
నరచేతిమణిఁ జేసి•యవనివారలకెల్ల
నపవర్గమొసఁగునీ•యయ్య నెట్లు
వోలు? విశ్రాణన•సాలంబు యాచక
కాంక్షితమాత్రాప్తి•కారణంబు
గీ. నీకె తగు నీతనికె తగు•నిఖిలగమ్య!
పూజవడయఁగఁ బూ[illegible]ంచఁ•బొగడువడయ
నని మురద్వేషిఁ బుండరీ•కునిఁ బొగడుచుఁ
జనిరి సమ్మర్దముగ నిజ•స్థానములకు. 115

ఆ. వె. పొగడిరఖిలమునులు•జగము లానందించె
నాటపాటచూపి•రమరరమణు
లాదినంబు సుదిన•మయ్యె దుర్దినమయ్యె
విబుధతరులతాంత•వృష్టిఁ గురియ. 116

సీ. శిఖిపింఛధారియై • చేదోయి కటినిల్పి
హరితీర్థమునఁబశ్చి • మాభిముఖుఁడు
క్షేత్రింబునందుఁ బ్రా • గ్దిగభిముఖుండునై
రెండుమూర్తులుదాల్చి • యందునతని
పదపీఠమైయొప్పు • ఫణిభర్త రమ గొల్చు
హ్రీ యన శ్రీ యన • రెండుగడలఁ
జామరహస్తయై • ఛందోమయాకృతి
ఖగలోకనాథుఁ డ • గ్రమున వెలయు
గీ. దక్షిణంబున సనకప్ర • ధానమునులు
దాను బొగడుచు సేవించుఁ • దమ్మిచూలి
యేను రుద్రులు సేవింతు • మెడమవలన
వెనుకనుండు దురింద్రాది • విబుధవరులు. 117

వ. వత్సా! శ్రీవత్సలాంఛను భక్తవత్సలంబు నీవు నెఱింగినయదియ కదా? విను నుత్తరంబున మెఱుంగుటొల్లియగొల్లదొర కరకలిత చిత్రభద్రజలజశుక్తియు విరచితవినతముక్తియుఁ కుటిలకోమలవినీలకుంతలనికరుండును, నపరిమిత కరుణాకరుండును, కటితటఘటితదోస్తంభ యుగళుండును, జటులనిశాటగళ నిగళుండును, మకరకుండల మండితకపోలఫలకుండును, యదుకుల తిలకుండును, క్షుల్లకాశక్యసఖ్యాభిరామమృదులోరుద్వయుండును,నద్వయుండును, బుండరీకప్రభృతిమునిజన సేవ్యమానుండును, ననూనుండును, నఖండజ్ఞానానందైక విగ్రహుండును విదళితజగన్నిగ్రహుండునై పంచాబ్దంబును, పంచశరసహస్రాతిశాయివిలసనసరసంబును, నిచ్ఛాదిగంబరంబును, నైన పాత్రయంబును నవరత్నసానుసాహ్రయంబును, బాహ్యాభ్యంతరికద్వారాష్టకవిస్పష్టంబు నదభ్రంబు, నభ్రంకషంబును శరదభ్రశుభ్రంబును, నగుమహా

ప్రాసాదంబునందువాసవ వైశ్రవణ వైవస్వత ప్రముఖ మఖ
భుగలఘుకిరీటమణిగణ ఘృణిమంజరీపింజరీకృతంబగు శేషపీఠం
బు నధిష్ఠించి చరణద్వయాంతరాళోపలాలిత గోయష్టి లతామ
తల్లియై భువనత్రితయ కామిత కల్పవల్లియు నైన తన యా
కృతి యవికృతిభావంబునం బ్రభవింపఁ దత్తత్తీర్థమధ్యంబుల
నంగీకృతాధ్యాసీనుండై వాసుదేవాదివ్యూహంబులు జ్ఞానక్రి
యాది శక్తులు వసురుద్రాదిత్యాది మరుద్విశేషంబులు నశేష
నిగమంబులు నఖిలశుద్ధాంతంబులు సమస్తతీర్థస్థానంబులు సకల
మంత్రరహస్యంబులు సర్వగంధర్వ స్వరసారస్యంబులు విశ్వవి
శ్వాని నైశ్వర్యంబులు ననశ్వరసంపదలం బొదలి సేవింపఁ బెంపు
మెఱసియుండె నని వెండియుఁ గుండలికుండలుం డిట్లనియె. 118

క. నారద! ధృతహేమరసా
సారచ్ఛురితంబు విష్ణుసదనం బది వే
దీరచితారాత్రికతతి
భూరమణీమణికిరీటముం బురుడించున్. 119

క. అలతీర్థసలిలక్షేత్ర
స్థలిలీలావిగ్రహద్వితయయుతుండై భా
సిలు పౌండరీకవల్లభుఁ
దలచినఁ గనుఁగొన్నఁ గరగింతుము లిహపరముల్. 120

క. వినఁబడఁడు చెవులఁ గన్నులఁ
గనఁబడఁడత్యుగ్రనారకవ్యధ చేతన్
బొనుఁగుపడి జడియువైష్ణవుఁ
డనవధిమురరిపువర్తియయ్యెఁ గుమారా!. 121

చ. ఇరుగడలన్ ద్విరూపములఁ♦గృష్ణుఁడు దైత్యనిరాకరిష్ణుఁ డ
ప్పురుసుననుండ నన్నడిమి♦భాగమునందు వసింతు రెవ్వరా
నరులు మనుష్యరూపభర♦ణంబునఁ గ్రీడయొనర్చు యక్షకి
న్నరగరుడోరగద్యుచర♦నాథులుగాఁగొని మ్రొక్కఁగాఁదగున్.

ఉ. ఎయ్యది దివ్యసేవ్యతర♦మెయ్యది మానిమనోభిగమ్య మా
నెయ్యది నీవు నేను భజియింపఁగ♦వింపగు నెల్లనాఁడు నా
దయ్యపువెల్గుసుమ్ము సక♦లస్థితి వెల్గెడుపుండరీక నా
గ్ధాయ్యలఁ బ్రజ్వరిల్లుచు జ♦గత్త్రయదుష్కృతదాహదక్షమై.

మ. అలసంబుల్ మునిరాట్ప్రణీతములు ప్రా♦యశ్చిత్తముల్ పాతకం
బుల నిర్జింపఁగ విష్ణుభక్తియ తగున్♦బో దానికిం బూనఁ బా
ములసద్గ్రాటులు చీరలం దుడిచినం♦బో నేర్చునే? మాంత్రికా
కలితాహిప్రతివీరమంత్రపదరే♦ఖాశ్లాఘుచేతంబలెన్. 124

సీ. జగదధిష్ఠానంబు♦సచ్చిదానందాత్మ
కము నందనందనా♦ఖ్యము క్షేత్ర
తీర్థస్థితము పృథ♦గ్గీపితంబు నృసింహ
రామ మత్స్యాదివి♦గ్రము లెట్టి
యవి యనఁదగియుండు♦నట్టిదయగు దాని
హేతికు లఘుతమః♦ప్రోతమతులు
గాంచి యర్చలయం దో♦కటిగాఁగఁ దలఁచి వి
శ్వస్థనంబొనరించి♦గరుసు లేని

గీ. రౌరవంబులడింది పా♦రంబులేక
వసరుదురుగాని విజ్ఞాన♦వంతులైన
వారు శిలగాఁగఁదలఁచ రె♦వ్వారు దృష్టి
గోచరబ్రహ్మమనిచూచి♦కొలిచి యునికి. 125

శా. ఆవాణీరమణుండు ప్రార్థనముసే • యన్ దేవకీదేవియం
దావిర్భావమునొంది యేరికి నల • భ్యంబైన శేవన్ జగ
జ్జీవాతుస్థితి నుండునిందుదొర వి • స్మేరాననున్ నిత్యసం
సేవం దెల్పు నితేంద్రియుండు తమము • జించుంగనుండ త్త్వమున్.

తే. భక్తిగద్గదరీతి వా • గ్భరము లొలయ
నటనమునఁగూడి గోపికా • నాథుమ్రోల
నిలిచి కీర్తించుపుణ్యుండు • నలినబంధు
దళనమొనరించి తత్త్వప • దమునకరుగు. 127

క. హరి సోపహార లక్ష్మీ
శ్వరు నెవ్వగుచూతు రట్టి • వారలు సకలా
మరపూజ్యులు వారందునఁ
బొరసినపుణ్యము లగణ్య • ములు గుణజలధీ!. 128

క. ఇతిహాస పురాణ కథా
శ్రుతిస్మృతులు నందగోప • సుతుకట్టైదురన్
సతతము పఠియించుమహా
మతి పరమపదంబు నందు • మతిమన్మిత్రా!. 129

క. తీర్థముననాడి బ్రహ్మ
భ్యర్థితలీలావతారు • భక్తాధారున్
బార్థసఖుఁ గొల్వగలమా
ర్తాంగులకున్ గలవు సచ్చి • దానందంబుల్. 130

సీ. భ్రూణహంతను సురా • పుఁడు బ్రహ్మఘాతియు
గురుతల్పగ స్తేయ • గోవధోప
జీవి పితృద్రోహి • శిశుహంత పరదార
రతుఁడు నిందకుఁడు స • ర్వస్వభోక్త

సత్యరిక్తుండును • సర్వాభిమర్శి పే
శికుఁడు సర్వాపలా • పకుఁ డశుచియు
నిజధర్మవిద్వేషి • నీచుండు పాషండ
పరివంచుండు స్వేచ్ఛావి • హారహారి

గీ. కృతమెఱుంగనివాఁడు సూ • నృతములేని
వాఁడు నమ్మినఁ జెడఁజూచు • వాఁడు మొదలు
పాపకారుల కేనియుఁ • బౌండరీక
తీర్థహారిమూర్తియుగ మిచ్చు • దివ్యపదము. 131

చ. అలఁతపిసాళినవ్వు మధు • రాధరబింబఫలంబు తమ్మితే
కుల నగుసోగకన్నులు ప్రి • కుంచితకుంతలచారుఫాలముల్
బలుచనిచెక్కులుం గలయఁ • బర్వినకుండలరత్నకాంతులున్
గలశిఖిపింఛలాంఛను మొ • గంబు గనందగు ధూపవేళలన్. 132

క. క్షణము క్షణార్థమైనఁ బ్రది
క్షణలలితంబగుపయోధి • శయనువదనవీ
క్షణ మొనరించుకృతికి నా
క్షణమునఁ గల వఖిలసుకృత • జాతఫలంబుల్. 133

సీ. ముచ్చంకమురువుతో • మురళి యొక్కొకవేళ
మ్రోయించు భువనైక • మోహనముగఁ
గ్రీడించు నొకవేళఁ • దోడిబాలురఁ గూడి
యక్షీణగతిఁ గుబే • రాక్షకేళి
సవరించు నొకవేళ • జలవిహారము చాలఁ
బ్రేమభీమరథీగ • భీరవారిఁ
గొలువుండు నొకవేళ • నలినసంభవ పుండ
రీకాస్త్రదాదులు • ప్రీతిఁ గొలువ

గీ. సురగరిపువాహనమున నొ◆క్కొక్కవేళ
వేడ్క వేంచేసి మెఱయుఁ ది◆క్స్వధులందు
నెన్నికల్పంబు లరిగిన◆యేనయేండ్ల
వెలయుప్రియంబుగలకొ◆య్య◆విట్ఠలయ్య. 134

శా. శ్రీరంగంబున ద్వారకన్ గయఁ గురు◆క్షేత్రంబునన్ నైమిశా
ఖ్యారణ్యాంజనశైల పుష్కర మహేం◆ద్రా నంతశయ్యాహరి
ద్వారశ్రీపురుషోత్తమంబుల నయో◆ధ్యన్ సేతుగంగాభిసం
గారూఢస్థలిఁ బౌండరీకమున దై◆త్యారాతి యుండుఁ గడున్.

క. హరియుత్తరభాగంబునఁ
బురుషుఁడు దాఁ బాపమైనఁ◆బుణ్యంబైనన్
సురకానియెత్తు చేసినఁ
బరిణతమై మేరుసుధర◆భారముఁజూపున్. 136

సీ. నమార్జనమున ధ్యాం◆క్షము నుపలేపనం
బున మరాళము రంగి◆మున విచిత్ర
శుకము దీపాంకుర◆ప్రకటనంబునఁ బాము
పదపద ప్రతిష్ఠాను◆భవముకతన
నరఘుయు నూడన్న◆పరిషేచనంబున
ధేనువు మోక్షంబు◆ తెఱువుగనిరి
గాన నేతత్పరి◆కల్పనంబునఁ బాండు
రంగాదినాథుఁ జే◆రంగవలయు

గీ. ననిన నారదుఁ డిట్లను◆నభవ! జ్ఞాన
విరహితంబులు జడములు◆వీనికిట్లు
మనుజకృత్యంబు చేకూరె◆మధువిరోధి
మెట్లువరమిచ్చె నని వేఁడ◆నీశుఁడనియె. 137

ఉ. మూర్తిమదిక్షుకార్ముకకస•ముజ్జ్వలకీలికయుఁబోని చంద్రికా
స్ఫూర్తి వెలుంగఁ జేయుచు న•భోవనకేసరిచంద్రుఁ డుబ్బఁగాఁ
గార్తికపూర్ణిమన్ యదుశి•ఖామణి యొక్కనాఁడుచూళికా
నర్తితపింఛగుచ్ఛలస•నంబున భీమరథీతటంబునన్. 138

మ. సురలీలావతులున్ నరాంగనలుచ•క్షుశ్శ్రోత్రకన్యల్ స్మర
జ్వరపీడాశయలై తనుంగొలువ రా•సక్రీడఁ బెంపొందమై
కరలీనోర్మిక లంగుళీచలన రిం•ఖత్కాంతులై క్రాలఁగా
మురళీనాదవినోదకేళిఁ దవిలెన్•మోదంబునాదంబుగన్. 139

క. ఆనాదము దప్పన జగ
తీనివసనొక్కనిహోమ•ధేనువొకటి సాం
ద్రానందమొదవ విని తన
మేనుమఱచి కురిసె నపరి•మితదుగ్ధంబుల్. 140

ఉ. కాననగంధవాహవశ•గంబగుటన్ వెస నొండుతత్పయః
ఫేనకణంబు వచ్చి ముర•భేదను మౌళి నలంకరించె శ్రీ
జానియుఁ బాటదూని నిజ•సౌధమునందు సుఖించుచుండె నా
ధేనువు లెన్నఁగా ముదిసి•దేహమునూడ్చి భవాంతరంబునన్. 141

క. హరిమౌళిపతితనిజదు
గ్ధరసోత్కర ఫేనకణకృ•తపరమసుకృత
స్ఫురణంబున నొకక్షత్త్రవ
వరునకుఁ దనుజాతయగుచు•వసుధం బుట్టెన్. 142

వ. సుశీలాభిధానయగు నబ్బాల గుణభాస్వరయై యథోచితకాలం
బున. 143

ఉ. తాళి విభుండుగట్టినమొ•దల్ పతిదేవత యానుశీల పెన్
గోలతనంబునన్ మగఁడు•కొట్టినఁ దిట్టిన రట్టుచేసినం

శాలి దినంబుఁ దచ్చరణ♦తామరసంబులు గొల్చి నేలయుణ్
శోలు నేయిటా పెకంచుఁ గృత♦బుద్ధులు వృద్ధులుప్రస్తుతింపఁగన్.

సీ. రూపహీనుఁడు మహా♦క్రోధనుఁ డతిలోభి
బద్ధమత్సరుఁడన్య♦బుద్ధి మాయి
చంచలస్వాంతుండు♦సకలబంధువిరోధి
బహుశపథోక్తిలం♦పటుఁడు శఠుఁడు
సంతతావిశ్వాస♦సస్యప్రరోహుండు
గర్వపర్వతమస్త♦కస్థితుండు
కలహాశనుండు త♦ర్కక్రియాకుశలుండు
సంగతోన్మాదో త్త♦మాంగకుండు

గీ. నగున యేనియు నటువంటి♦మగనితోడఁ
గాపురము సేయు సతి దొడ్డ♦గరితయగుచు
గసిడిక్రోఁతకు నోర్చి లో♦విసిగికొనక
ధాత దూరక తండ్రి సేఁ♦తకు వగవక. 145

శా. ఆతీవ్రాంశుని వేఁడికోర్చి మనుషా♦యాదేవియుం బోలె స
త్పాతివ్రత్యగుణాభిరామయగు నా♦భామాలలామంబు సం
ప్రీతిం జేయు ననహ్యదర్శనములన్♦బిర్వేఁకులం బెట్టుదు
ర్జాతుల్ పీతదయానయుల్ దదుచితా♦చారంబులన్ నిచ్చలున్.

ఉ. కొన్ని గణింగి కొన్గొనిసి♦కొన్నితుటారములాడి మానఁటా
కెన్నక నిన్నినాళ్ళకివి♦యిన్నని కూటికిఁ బిచ్చపాటిగా
మన్నన్న "మహాప్రసారమ"ని♦హర్షరసోల్లసదానసాబ్జయై
యున్నలినాక్షి భర్తయిడు♦నన్నియగైకొనుము ప్రిక్కధావ్యముల్.

సీ. చతురాననాత్మజ్ఞనా♦చరణంబు తొలినాటి
ప్రాఁచివన్నియమతో ♦ప్రుడువమటగాఁ గ

గోమయగోముఖశ్రీముంగిటఘటించు
టలు ముఖమజ్జనకలన గాఁగఁ
గమనీయపూర్ణకుంభముల పూజాక్షిప్తి
కుచలికుచాకల్పరచనగాఁగ
నన్నసంపాదనార్థాగ్నిఁ బుట్టినధూమ
పటలిసంస్కారధూపంబుగాఁగ

గీ. విఘటితకవాటకద్వారవిశదనయన
యర్చితాధరగేహాళికాధరోష్ఠ
భాండగోపనయవనికాంబరపరీత
యింతి గృహలక్ష్మిపత్యంతకాంతిఁదనరు. 148

సీ. పరిస్తుతంబని పదార్థములు రాజులవేఁడి
కొని తెచ్చి యమ్మించుకోమటిండ్ల
మూసిముల్లడిచి గుమ్మలకొల్చిపై మొత్తు
లూడ్వఁడు పస్తైననుండుగాని
యెట్టిచుట్టంబేనియింటి కేతేర శేం
డవమూతకమూ దెల్పియవలఁ జొనుపు
మునుపరిశీలితముచేసినపైఁడి రాకున్న
ముచ్చిచ్చునను వేఁగువచ్చుదనుక

గీ. "వనరు శాకాయ లవణాయ వా"యటంచుఁ
బెనగు "ధూళిః పరగృహే దపి"యనునాస
ముంచి యీఁగకుఁ గాటు పామునకు బలియు
నొసఁగఁడని భర్తకై పొక్కునువిద మదిని. 149

వ. ఇవ్విధంబున నవ్విధుబింబవదన వివిధ కుటిలాచార చతురుండగు జీవితేశ్వరు నీశ్వరుంగాఁదలంచుచుఁ దదుపాసనంబు తనకు నిహా

పర సిద్ధిసంసూచకంబుగ నిండుడెందంబునం గోచరింపంజేయుచుఁ
గీర్తితచరిత్రంబునం బ్రవర్తిల్లుచుండు నంత. 150

క. అట నొకనాఁ డాభూసుర
కుటుంబినీసదనమునకుఁ ♦ గుహానావటువుం
బటువగుమైఁజిగిఁ దెగడుం
బుటువగునొకవడుగు వచ్చె ♦ భుక్త్యాపేక్షన్. 151

వ. వచ్చిన నమ్మచ్చెకంటి గెంటనినెయ్యంబు లియ్యంబగు నంతఃక
రణంబున నడలు గడలుకొన గ్రామాంతరాన క్రుండగుప్రాణనా
థుండు తనుంబిలిచినయట్లయిన లోనింటి బోన మాని త్రొంగిచూ
చు తెఱిం బొడకట్టి బొట్టునకు మేధావి మేదునలవాటునం గందిన
యంగుళీద్వితయంబు దేటిగుట్టినం బృథగ్వర్ణపూర్తులగు సంవ
ర్తికలుగల జలరుహంబనఁ బ్రశస్తంబగుహస్తం బెత్తి "స్వస్త్య
స్తుతే" యని యాశీర్వదించుటయుఁ గృతనమస్కారయై యాసా
రసామోద మ్మృదులస్వరంబున నిట్లనియె. 152

సీ. ఎందుండి రాక? యిం ♦ దేతేరఁ గత మేమి?
గ్రాసార్థిభావంబు ♦ గానవచ్చె
నగునన్న నట్లని ♦ మొగసాలనుండుఁ
డాయన యూరలేఁడు మా ♦ మార్ధమునకై
కావింతు నన్నసం ♦ స్కారంబు మీ రార
గింతురుగాని వే ♦ గిరమె యనుడు
మాణవకుఁడు పల్కు ♦ మగువ! నేఁడెన్నాళ్ళ
నుండియు గుడువఁ గూ ♦ డోడ్వకునికి
గీ. వేఁడియగుదాఁక నోరువ ♦ మాఁడుగలిగెఁ
బులిసినది గల్గె నన్నంబు ♦ పోఁకయంత
యొసఁగి క్షుత్తార్పు వెసచల్లి ♦ మొసవన్నైన
తాప ముడిపించుకొంచుఁ ద ♦ పంబు కలిమి. 153

తే. అనుడు నెలనాగ యిట్లను♦ననఘ! నీకుఁ
జలిది యే నెట్టు లిడనేర్తు♦క్షణములోన
వంటగావింతు భుజియించి♦వలయు నెడకు
నేగు నా విని సతిఁ బల్కె♦దాఁ గపటుఁడు. 154

తే. త్రోవ గమియించుచోట నో♦పూవుఁబోఁడి!
యవరవర్ణ సమాచార♦మ్మెఁ జెడదు
బ్రాహ్మణ్య మీతఁడ వేటికిఁ?♦బ్రాణరక్ష
నెఱపు మొకయింత మెదుకిన్ని♦నీళ్ళ నొసఁగి.

తే. వాఙ్మనఃకాయకర్మప్ర♦వర్తనముల
సంభవించిన పాపంబు♦సంహరించి
యతిథి గృహమేధికిచ్చు శా♦శ్వతసుఖములు
వినవె? "యభ్యాగత స్స్వయం♦విష్ణు"వనఁగ. 156

తే. అతివ! తీర్థాదరత్వర♦నరుగుదెంచి
త్రోవ నాఁకటివేళకు♦దొరకకున్కి
కాంచ నీయూర యేఁ గూటి♦కలన జఠర
వహ్ని నొక యేన కా దెట్టి♦వాఁడు నెరియు. 157

వ. నాతోడంగూడి యాడువడుగులు బడుగులయ్యును వడిచెడక కడఁక మెఱసి యేము సంకల్పించి మున్నె తేరసమకట్టిన పుండరీకంబునకుఁ బాండురంగసేవా సావధానులై చనిరి. నేను కూటిబీద తోడుదప్పిన తెఱంగున నిచ్చటం దడసితి వెండియు వినుము.

క. తరుణి! "క్షుధాతురాణాం
నరుచిర్న చ కాల" మనుచు♦నరు లాడుట లో
నరసి వివేకింపఁగఁ దగు
తెరువరులకుఁ బాయసంబు♦తిరిసినఁ గలదే?. 159

ఆ. వె. ఎంతబాండశుద్ధి • యెటువంటిగృహశుద్ధి
యెట్టిచిత్తశుద్ధి • యిచటచలిది
కూడు చిక్కనెడఁ బు • రోడాశమునకు నో
యమ్మ! సాటివచ్చు • నదియుఁగాక. 160

క. అనుచితశతము లొనర్చియుఁ
దనువులు రక్షించుకొనరె • దమశమతేజో
ధనులగు గాధిసుతాదులు
తనప్రాణము నిలుపుకన్న • ధర్మము గలదే?. 161

తే. తొలుత నే వేఁడినప్పుడు • చలిది నీకు
ననఘ! నే నెట్టులిడుదాన • నంటిగాన
యశనశేషప్రతికి నంది • యంబు వలదు
చాలుఁ జాలదొ యను వృధా • శంక విడువు. 162

క. సతి! యాత్మస్తుతి యతిగ
ర్హితమని నా పెంపు దెలుప • నే నొకఁడ మనో
గతిఁ దృష్టిఁ గనిన భువన
త్రితయమ్మునకుఁ బరితుష్టి • తిలకించుఁ జుమీ. 163

వ. అని యంతనిలువక. 164

క. పెట్టక పోనని యాఁకటఁ
దొట్రిగిలంబడుచుఁ బడుచు • దురదురఁ జని వే
పట్టింటఁ గూరుచుండిన
నెట్టు ననం జాల కమృ • గేక్షణ భీతిన్. 165

సీ. పరిహరించుట కీడు • తెరువరిఁ బసిబిడ్డ
నర్థి నాఁకటిచేత • నలయువానిఁ
బర్యుషితమును న • ర్పణసేయఁ జాలఁ బా
పము రాదె? యుపచార • పరత మెలఁగ

మిను కొక్కటిచ్చి పోమ్మనినఁ బోవునే పోవఁ
డగ్నిప్రియాసవిహ్వాలుఁ డితండు
చాలునో చాలదో చలిదియు మధ్యాహ్న
పాథేయ శేష మల్పంబె యగుటఁ

గీ. జాలకుండిన నగుఁ జెట్టుబాలుఁ డితఁడు
కొసరి గొంతెవఁ గోరికల్ గోరనేని
యిడక పోఁబోల దిడఁబోలు దీడు దివియఁ
బేరు రాకున్నె? తైర్థికుల్ ప్రేలుచులందురి. 166

తే. వంటయగుదాఁక నుండఁడీ వడుగు బండి
మీఁదఁ బోవుచున్నాఁడు మేటిధాటి
నైన దయ్యెడుఁ గాకేమి యప్పటికిని
మీఁదు గడగట్టి నేలంచు మించుఁబోఁడి. 167

శా. రారయ్యా! యని శుద్ధముచ్చరణు గోత్రాదేవతాపుత్రి వి
స్మేరాగ్నిప్రభుఁ గూరుచుండనిడి మోప్రేల్చెప్పట్టుగావించి నీ
రారం బండిన ప్రాఁత రాజనపుదివ్యాన్నంబునొక్కింత వా
ర్ధారాధౌతముఁ గుండయూడ్చి యొసఁగెన్ రంభాపలాశంబునన్.

తే. ఒసఁగి యవ్వ్యంజనంబు దధ్యోదనంబు
నారగింపుఁడు క్షమియింపుఁ డనుచుఁ బలికి
ముదిత ముదితాత్మభావసంపదయుఁ బోని
సలిలపరిపూర్ణమగు గిండి నిలిపి చనిన. 169

క. చే నాపోశన మున్నుచు
ధ్యానంబొనరించి యతఁడు తగు ననుమతిఁ జం
డ్రానన చేఁ గొని మొసఁగున్
ప్రాణాహుతి విరచితముగఁ బర్యుషితంబున్. 170

తే. తిరిగి చూచినయంత నా•దిగ్విప్రకీఁడు
సిక్థ మొక్కటియేనియుఁ•జిక్కనీక
మ్రింగి మీఁదులుచూచుచు•మృదులఫణితిఁ
బిలిచి యిట్లను శరదిందు•బింబముఖిని. 171

తే. చూడు మీసారిభాండమో•శోభనాంగి!
భిన్నటంబొండె దాఁటిద•ప్పినదియొండెఁ
గలుగు లేకుండ నూడ్చి తె•మ్ములఘుజఠర
జాతవేదంబు హెచ్చె నీ•స్వల్పభుక్తి. 172

చ. అనుటయు సంభ్రమంబడర•నంగన తొల్లిటినాటియామినిం
దనకని వండి సెంచికొని•నాథుఁడు పల్లియ కేగునెంజిలిం
దనికి భుజియింపకున్కి భరి•తంబయి యట్టిక సట్టుకట్టి యొ
ప్పునభినవోదనంబానఁగెఁ•బూని తదాజ్ఞనుశ్రావమూఁకుటన్.

తే. ఒసఁగి యెడనేప్పలోఁ గాఁగు•చున్నయాల
పాలు వడ్డించుటయు మాని•పాలు! వేళ
మాపలి వారలచేతికి•నందియిచ్చు
వడువున భుజియించె నదు విప్రు•గ్వంటకంబు. 174

క. భుజియించి మఱియుఁ దెమ్మని
గజిబిజి సేయుటయు నతియుఁ•గలఁగక వికస
న్నిజవదనయగుచు హస్తాం
బుజములు మొగిడించి పల్కు•భూసురసూతిన్. 175

శా. అన్నం బొండొక లేదు చల్దియది వి•నత్ధ్వశ్రమాగాఢ! తె
మ్మత్రపం దెచ్చెద సాధుగుప్తములు! స•వ్యంబుల్ కజాయంబు లిం
దెన్నే నున్నవి కొత్తయట్టికలఁ గా•దే లేచి వార్వ్వండు వే
గన్నిర్మించెదఁ గూడుఁ గూర మఱియుం•గైకోలు మేల్భుక్తికిన్.

ఉ. నావిని నాతిఁ బల్కెఁ గుహనావలు వోవనితామతల్లి! యో
పావనశీల! తైలపరిపక్వము లెన్నియుఁ దెమ్ము గాదనన్
లేవడియైన భుక్తిఁగొని లేవదిగంబడ దాఁక లింతయున్
ధావనమాచరించుకతనన్ దడవున్ నిలఁబోలదిచ్చటన్. 177

మహాస్రగ్ధర.

అనినన్ వడ్డింపఁ జొచ్చెన్ హరిణనయన నిండారుడెందంబుతో వే
గన భావిప్రాణనాథాగ్రహసహమతితోఁ గస్నుగ్నై కారమై నే
తన వండంబొల్చి చేతం దడవినఁ దుముర్రై తాలుటల్ లేక సద్యో
జనితంబుల్ వోలెఁ జాలం జవులొదవు సమచ్చండి కాపూపపఙ్క్తుల్. 178

వ. ఇట్లురుచిగ్రహణప్రవణపురుషోపజ్ఞకృతంబులు ప్రాణవల్లభసమ్యగభిరక్షితంబులు తదుపహితగణనావహంబులు నచ్ఛిద్రముద్రాముద్రితంబులు నై సజ్జనవితరణంబులగతి మహితభాజననిహితంబులు ననురక్తవధూహృదయంబులపగిది నతిస్నేహపిచ్ఛలంబులు నుపవనంబులయుపమ సురభిష్ఠంబులు నైన పిష్టవికారంబులు నిర్వికారుండై భూసురకుమారుండు నిరవశేషంబుగా నాహరించియు వెండియు నవనతాననంబగు మిథ్యాలజ్జాభినయనంబునఁదన బహుభోక్తృత్వంబునపశ్లోకకలుషితంబగునని విశంకమానమానసుండునుం బోలెఁ గానందగు నాపొట్టినెట్టికసీల దిట్టపడుచు కడుపునిండమి యెఱింగి తరంగితాద్భుతాంతరంగయై యాకురంగనయన యిట్లని వితర్కించు. 179

క. ఇసుమంతగాని లేఁ డీ
పసిబాలుఁడు కూడు గూటిప్రాయము వాఁడి

క్రొసరి బహుభక్ష్యరాసులు
మెసఁగెడి విసువఁడు పత్రితుష్టి మేకొనఁడు గదే?. 180

ఉ. మాయపుబిడ్డ యీనిసువు మానిసిపుట్టువుగాదు దేవతా
నాయకుఁడో? చతుర్ముఖుఁడో? నాభవబంధము లూడ్వనున్న నా
రాయణమూర్తియో? యెఱుఁగ రాదొకయించుకయుఁ బుభు
క్షుపైఁ
జేయిదొలంగఁ దప్పములు పెల్లె సమస్తమునంచు నివ్వెఱన్.

చ. తలఁచు మనంబులోన వసుధామరయాజకధర్మపత్ని ని
ర్మలకనకావదాతముఁగ రాళతరాలఘుబాలలీలమాలికో
జ్జ్వలము జగత్పవిత్రచరణసాక్షి ముదక్షి మదంగభాగతా
తిలకితవిభ్రమం బగు సుదీక్షమహత్వము దివ్యతత్త్వమున్.

క. సతి యీగతి "శ్రియమిచ్ఛే
ద్ధుతాశనా" త్తనుటయెఱిఁగి హుతవహు నఖిలే
ప్సితవితరణగుణలీలా
చతురం బార్థింపఁ దత్ప్రసాదముకలిమిన్. 183

సీ. ఒక కొన్నివడియంబు లొకకొన్నివరుగులు
నొకకొన్ని తెలఁగులు యొలుపుఁబప్పు
లొకకొన్ని దబ్బెడ లొకకొన్ని తాలింపు
లొకకొన్ని విధముల యొబ్బచేరు
లొకకొన్ని కలకల్పు లొకకొన్ని బజ్జులు
నొకకొన్ని రీతుల యూర్పువగలు
నొకకొన్ని సిగరులు నొకకొన్ని యరబళ్ళు
నొకకొన్ని బహుళ పూపోత్కరములు

గీ. వివిధఫలకంద మూలంబు లవియుఁ గొన్ని
యూరుఁబిండులు నొకకొన్ని యొక్కకొన్ని

యూరుఁగాయలు పచ్చళ్ళు•నొక్కకొన్ని
పెరుగు పాత్రైన నేతులు•పెచ్చు పెరుగ, 184

చ. అమితములై మహారసము•నం దపుడద్భుత మొందుచున్న య
న్నములు సుపక్వగంధముల•నందములై యటువోవుచోట స
య్యమరతరుప్రసూనతతు•లంగనపైఁ గురియంగఁ బుట్టుగం
ధము లిటుసిగ్గుచోటఁ దగుఁ•దద్ద్వితయూరచితోపగూహముల్.

శా. ఆలీలావతినిత్యసత్య శమ ధై•ర్యౌదార్యసంశుద్ధులం
జాలన్ మెచ్చి వటుత్వముం దొఱఁగి సా•క్షాత్కారముంబొందె ను
ద్వేలాలోలకృపా జపాప్రసవకాం•తిభ్రాంతికల్లోచనా
బ్జాళిందాశ్రితరాధికాసురతరా•గాంకూరుఁ డా శౌరియున్. 185

సీ. నీలంబు భక్తాను•కూలంబు హరిదంత
చేలంబు నవనీత•చోర మాది
మూలంబు గరుణావి•శాలంబు కృతజగ
జ్జాలంబు శ్రితలతా•వాల మమర
మేలంబు భవవనో•త్కీలంబు తల్పిత
వ్యాళంబు శిక్యావ•చూళ మమిత
లీలంబు హృతమరు•త్సాలంబు శశిసఖ
ఫాలంబు వరదాన•శీల మఖిల

గీ. కాలజంఘాల మసురకృ•త్క్ష్వేళ మతిక
రాళ మాపత్పయోదవా•తూలము నగు
యదుకులసరోమరాళంబు•నతివ గాంచి
నతియు నుతియు నొనర్ప న•న్నగధరుండు. 187

ఉ. ఆసతిఁ బల్కు నీహృదయ•మారయఁగోరియ యిట్లొనర్చితిన్
గాసి కుశేయాననలు•గల్గిరయేనియుఁ గల్లనిమ్ముత నీ

చేసినభాగ్య మేసఱియుఁ జేయదు నీయెదుటన్ మునీశ్వరా
భ్యాసదురాసదంబగు మ దాకృతి యీగతి నుల్లసిల్లుటన్. 188

క. సుచరిత్ర! నేఁడు నీ చే
తి చలిది భుజియింపఁ జాలు దృష్టియొదవెడిం
బచరణగా దిమ్మలు మును
రుచియింపదు శబరివిందు ప్రోవదివిందున్. 189

క. అతిమానుష వసిష్ఠారా
ద్రితనుగు మనువంటి నిప్పు వంటి దిరి యనన్
బతిదేవతవై మన నీ
గతి భావారూఢమయ్యెఁ గా జగములకున్. 190

చ. తనుశతకోటులెత్తి బహుధర్మవినిర్మితిఁ జేర్చి గాంచినన్
గనఁ గనలేని లేఁతలకు జాతి! యభోగ్యము భాగ్య మీవు ప్రా
గ్జననముఁ గందొనర్చితి వొకానొకయర్చన నన్నుఁ గూర్చి దా
నన నమకూరెఁ జుమ్ము సుజనవ్రజనందితచర్య నీదెసన్. 191

తే. అతివ! తొల్లింటిపుట్టువునందు నొక్క
మానివేలిమిజన్నై మసన్ననాఁడు
నామధురవేణునాదంబు నవది గరఁగి
తొరఁగఁ జేసితి సుస్నిగ్ధదుగ్ధరసము. 192

క. ఆపాలనురువు పవన
వ్యాపారముచేతఁ దెరలివచ్చి నిలిచె లీ
లాపింఛచ్ఛవి భక్తిన్
తాపింఛమదీయమౌళి తటిఁ గుచలికుచా!. 193

క. దానఁ బయస్సంతానము
గానంబున నన్నుఁ దనుపు దానవఘుతి చం

దాత్రీనన! తత్ఫలమునఁ గా
దా? నీకును దక్కెఁ-తిర్ల ముదము మదిఁబొదలన్. 194

ఆ. వె. ఒక్కఁ డక్రతసత్క్రి•యుండను విప్రుండు
గలఁడు ఘోరకఠిన•కలుషబుద్ధి
వసుధ నెల్లఁ దిరుగు•వసుధానువను పేరి
పట్టణమునను నుండుఁ•బుట్టువడుగు. 195

సీ. ధనవంతుఁడయ్యు నుఃద్వాహంబుదొఱఁగి మూ
తులునాకు పెఱవితం•తువులఁ దగిలి
కులవంతుఁడయ్యుఁ బె•ద్దలఁ బాసి విహరించుఁ
బాషండపండాను•బంధియగుచు
మతిమంతుఁడయ్యు నా•మ్నాయముల్ చెవిఁబెట్టఁ
డశ్లీలఖేలన•వ్యసన మెసఁగి
స్థితిమంతుఁడయ్యు ల•క్ష్మీకిఁగాక త్రిమ్మరు
పలుగూడు మరిగి యా•ధ్యులభజించి

గీ. తలఁచు బ్రహ్మస్వ దేవస్వ•ములకు నెగ్గు
కుప్పఁ జిచ్చిడి పేలాలు•కొఱకఁ దివురు
గ్రహణకాలంబులందు ము•న్గఁడు జలముల
సెబ్రిచెంచడ మాబ్రాహ్మ•ణబ్రువుండు. 196

వ. వాఁడొక్కకందువ నొక్కవెలయాలికింజిక్కి మహీమండల కుండ లంబగు పౌండరీకంబునఁ గొండొకకాలంబుండి యొక్కపెనుఁ బండువునఁ గన్నులపంటువగు మదీయనై వేద్యపరికల్పనంబు ధూపోత్సవానంతరంబున నెడముగాచి చూచి తననలయు తెఱం గునం జని బహువిధంబగు కాలంబు మని ముదిని తనువువిడిచి యత్యుత్తమంబగు ధర్మామతవంశంబునంబుట్టి పుట్టిన నాటనుండి

యుఁ జదువుచదువున నచతురుండై నిండుప్రాయంబున నిన్నుం జెట్టవట్టించి యిట్లున్నవాఁడు వినుము. 197

తే. తరుణి! మద్భక్తదర్శనోత్సవసుకృతము
పాపవహ్నికి సలిలమై భద్రమొసఁగెఁ
గాక లేకున్న నితఁడు ప్రాగ్జనినొనర్చు
కల్మషములకు నిష్కృతి గలదె? యెందు. 198

వ. అవ్విధంబుగ సోపహారంబగు మదీయరూపంబు నాకస్మికంబుగఁ గనుంగొని భస్మసాత్కృత దుష్కృతనీరసయవసరాశియై భూసురకేసరికిశోరంబై వాసివడసియు నతండు కట్టిఁడియగుటకుఁ గారణంబువినుము. 199

క. నీభావశుద్ధి యారయ
శోభనచారిత్ర! యేను జుణ్వై యతనికిన్
లోభక్రోధముల మనః
క్షోభము గావించి బాలిశుండ నిపింతున్. 200

క. పతి కొట్టినఁ బతి దిట్టినఁ
బతి నిర్దయుఁడగుచు నెట్టిపాటుపఱిచినన్
మతి నన్యధాత్వ మొందరు
పతిదేవత లతివ! నీకుఁబ్రతియగువారల్. 201

తే. నిష్ఠురత్వంబు తొలఁగించి నేటనుండి
నీకు ననుకూలుఁడయ్యెడు నీవిభుండు
మత్పదద్వయభక్తిసమగ్రలైన
మతుల నేవురఁ గాంచె దూర్జితవిభూతి. 202

ఆ.వె వెండిఁ బైఁడి దవ్వితండంబుగా మేలి
కూడుఁ బాఁడి యింటఁ గొలఁదిమీర

నోములెల్లనోఁచినను తేండ్లు బ్రిదికి నీ
భర్తతోడఁ బరమ♦పదము గనుము. 203

ఉ. మన్ననచేసినాఁడు ముర♦మర్దనుఁడంచు నహంకరింప కో
కిన్నరకంఠి! యట్లయినఁ♦గీడొదవున్ విను తొంటికన్న న
సన్నిహితాంతరంగవయి♦సత్యసమార్జవశుద్ధిలక్ష్మికిన్
వన్నియ పెట్టుమీ మహిత♦వర్తనకీర్తనలు నిర్వహించుచున్.

క. తృష్ణారహితులు మత్పద
నిష్ణాతులు నిత్యసత్య♦నిరతులు నగుశ్రీ
వైష్ణవులఁ గాంచి ననుఁగా
విష్ణుపదవలగ్న! గార♦వించి కొలువుమీ!. 205

క. అని వరమిచ్చి మహీసుర
వనితన్ మన్నించి భక్త♦వత్సలుఁ డిరెం
దననెలవునకు సుధారస
మునఁ గుముదినిఁ దేర్చి యరుగు♦పూర్ణేందుఁడనన్. 206

ఆ. వె. అట సుశీలమగఁడు♦నరుదెంచి యొకకొన్ని
దివసములకు దొరలఁ♦దిరియునాస
గోసి తనకులంబు♦వాసియు వన్నెయుఁ
దలఁచుకొనుచుఁ దెలివి♦మొలకలెత్త. 207

తే. అతనిఁ దమసొమ్ముచేసి ము♦న్నాఁగియున్న
మోహముఖులైనజ్ఞాతుల♦మూలఁదోచి
సంహృతాసురులైన ని♦ర్జరులకరణి
మది వివేకాదివర్గ మ♦భ్యుదయమయ్యె. 208

క. కోపంబునాఁగి మిక్కిలి
పాపమునకుఁలోగి బుద్ధి♦పశ్చాత్తాప

టోపశిఖిఁ గ్రాఁగి కరుణా
దీపవతీలహరిఁ దోఁగి♦విప్రుఁడు మఱియున్. 209

సీ. కాలిచవడ నిండ్ల♦కడ కేగి వనరుచుం
డెడువాఁడు వైరాగ్య♦నిష్ఠుఁడయ్యెఁ
గయ్యాలకచ్చెమ్మై♦కాలుద్రవ్వుచు సదా
మండువాఁ డతిశాంతి♦మహితుఁడయ్యెఁ
గసరి యెంగిలి చేతఁ♦గాకి వేయనివాఁడు
సతతాన్నదానప్ర♦శస్తుఁడయ్యె
బ్రహ్మకల్పముదాఁక♦బ్రతుకాసఁ గడకట్టు
వాఁ డస్థిరముగ వి♦శ్వముఁ దలంచెఁ
గీ. బాటిగాఁగొన కాపద్మ♦భవునినైన
నీరసము సేయువాఁడు వి♦నీతుఁడయ్యె
నోరులలచ్చికి ముచ్చిరి♦యడుకువాఁడు
సర్వసముఁడయ్యె విష్ణుప్ర♦సాదమహిమ. 210

ఉ. పాళముమీరు పెద్దపెద♦పాళములై బలితంపుఁగాఁగులన్
మూలుగుచున్న ప్రాఁబసిఁడి♦ముంచి ధనార్థులకిచ్చు విష్ణుదే
వాలయసుప్రతిష్ఠలకు♦నై యొసఁగున్ సతికేల నించు నా
నాలఘుకర్మనిర్మితికి♦నగ్రకులేందుఁ డనుగ్రహంబునన్. 211

క. ఆ యాలుమగలు విష్ణుప
రాయణులై పెక్కుగతుల♦వ్రతములు తఱితోఁ
జేయుచునుండఁగ నటని
శ్రేయసపదమైన పౌండ♦రీకక్షోణిన్. 212

మ. యమరాడ్దూతశిఖావతంసము చిర♦ప్రాణంబు దూరప్రియా
గమశంసి స్ఫుటకాకలీకలన మోక్ష♦ప్రక్రియాపాతదీ

ష్టము శీత ర్తుబలీయ మొక్క బలిభు•గ్రాజంబు రాజిల్లు శ్రీ
రమణాగారపురోద్ధరోత్థచలప•త్రిస్థూలశాఖాశిఖన్. 213

శా. తాత ల్తండ్రులు మామ లల్లురును ము•త్తాతల్ సహాయుల్ సహా
శ్రోత్రిల్ భ్రాతలు సేవకుల్ హితులు మి•త్రుల్ పుత్రులోలిం దివా
భీతాభీతములై తనుంగొలువఁగాఁ•బెన్మ్రాకలై వాయస
వ్రాత శ్రేష్ఠము గ్రాలు రేలువగలున్•భ్రాంతాగ మాంతంబు లన్. 214

చ. అది యొకనాఁడు విట్ఠలగృ•హాంగణభూబలిపీఠవర్తులా
మెదుకులు మేయఁ గన్నిడి య•మేయగతిన్ బఱవన్ దదాయత
చ్ఛదభవభూరిమారుతవ•శంబున నయ్యెడధూళిపోవ స
ద్భ్యదితములయ్యెదాన గుడి•యూడ్చినఁగల్గు నగణ్యపుణ్యముల్.

వ. ఇట్లతర్కితోపన్నంబగు పన్నగశయనసదనసమ్మార్జనసముది
తసుకృత పరిపాకంబునఁ గాకంబు నతిలోకంబయ్యె వినుము.

క. కలహంసమొకటి యదుకుల
కులహంసముగుడిఁ జరించుఁ•గుసుమాయుధకీ
ర్తిలతాగుచ్ఛము కైవడి
జలరుహాసంభవమరాళ•సంకాశగతిన్. 217

వ. ఇట్లు వర్తించివర్తించి. 218

మ. కుతుకం బింకక కుంకమదిరవమిళ•ద్గోరోచనాపంకని
ర్మితపత్రాంకకలంకితాంబుధికుమా•రీహారివక్షోరుహా
ద్వితయాస్ఫాలనలాలనోచితపయో•విస్ఫారకాసారసం
తతి నానీడభవంబు క్రీడసలుపున్•దద్దివ్యధామంబునన్. 219

సీ. మొనరెండుగాఁగఁ ద్రె◆వ్విన విద్రుమద్రుకం
దము నేలుముక్కునఁ◆దడవితడవి
మొగవిచ్చు పసిఁడి గే◆దఁగి ఱేకుగమి మించు
విశదచ్ఛదములను◆విదిర్చి విదిర్చి
నగుమొగంబుల దాస◆నపుఁగ్రొవ్విరుల నవ్వ
చిగురాకు నడుగులఁ◆జిమ్మి చిమ్మి
నిద్దంపుఁబందువె◆న్నెలగుత్తి కడకొత్తి
మలయు మైముంపులఁ◆గలఁచి కలఁచి

గీ. శార్ఙ్గిసౌధపరిఘూర్ణకా◆సారసార
సారసామోద మేదుర◆వారిఁదేలి
వచ్చి యాయంచ గుడిలోనఁ◆జొచ్చె నొక్క
నాఁడు పనలింటి బీఱెండ◆వేఁడిఁ దలఁకి. 220

క. అది తనదేహం బచ్చట
విదలింపం బక్షసలిల◆విప్రుషములచేఁ
జోదు కొదవించుచు గాడ్పులు
పొదవెట్టు రజోవికార◆ములు దూరముగన్. 221

తే. సలిలఖగమున కేతదా◆చరణమునన
కలిగె నాకస్మికంబుగఁ◆గంబుపాణి
గర్భగేహోపలేపనం◆స్కారసార
సుకృతపరిపాకనిరపాయ◆శోభనంబు. 222

క. శుక మొకటి చంచుజితకిం
శుకమై హరిహయశరాస◆సురుచిరవపురం
శుకమై కుసుమాకరకిం
శుక మానందమున నంద◆సుతుగుడిఁ బెరుగన్. 223

చ. అలమి త్రిలోకముల్ గెలుచు♦నత్తఱి తేరువహించుదోడిచి
ల్కలు దగఁగొట్టి ముందరికి♦లాగకయుండినఁ దాన తద్ధురం
బెలమివహింప మెచ్చి మరుఁ♦డిచ్చుమణీమయమాలికాత్రియిన్
గళమునఁ దాల్చుచిత్రశుక♦నాథుఁడు రేఖలపేరి నిచ్చలున్.

క. కీర మది యొక్కహరిపరి
చారిక చేరిక వసించుఁ♦జదివింపఁగ మే
పారసి యొసఁగి భవనమా
ర్గారాదులవలనఁ దన్ను♦సంరక్షింపన్. 225

క. దేవాలయమునఁ గొన్ని ని
జావాసమునందుఁ గొన్ని♦యుహాములు దగఁబై
చేవదలక పాటించుచుఁ
బూవుంబలెఁ బువ్వుబోఁడి♦పులుఁగుం బ్రోచున్. 226

మ. పసుపార్పుం దడిమొత్తు నెండ సెకఁగం♦పంబాఁగి మైదువ్వుచున్
వసయున్ వెన్నయు మేపుమేపునొసఁగున్♦వల్లించు శ్రీరామనా
మసుధామాధురి సాఘుకీతి కుచకుం♦భస్థాయిగాఁజేయుచున్
బిసపుష్పప్రియవాసరాగమములన్♦బింబోష్ఠి రాచిల్కకున్. 227

తే. కనకమణిపంజరంబుల♦నునిచియునిచి
చక్కెరయునుక్కెరయు సారె♦గ్రుక్కిక్రుక్కి
యొఱపుఁబలుకులు పలుమాఱు♦గఱపికఱపి
కలికి చిలుకలకొలికి రా♦చిలుకఁ బెనుచు. 228

మ. కలహంసోపమయానఁ జక్రకుచ పే♦ర్మిం ఖంజరీటాక్షిఁ గో
కిలసారస్వర బర్హిబర్హచికురం♦గీరప్రియాలాపఁ దా
య్యాలిఁజాలన్ మరిగెన్ శుకంబది మహీ♦యః ప్రేమఁగావించుచున్
బులుఁగుంబోఁడు ననందిపొందినగతిన్♦బొత్తొత్తులన్ మాతుఘన్.

తే. ఆశుకద్విజరాజున • కంతఁగొంత
కాల మరుగంగ నొకనాఁడుఁ • గలిగె బంధ
మోక్ష మాకస్మికంబ • నిర్ముక్తికలిమి
యాశుకద్విజరాజున • కద్భుతంబె?. 230

సీ. జనియించెనొక్కొ ప • చ్చనిమొల్క యనుబుద్ధి
గుఱిచ్చినపచ్చల • గోమరువలన
సమకూరెనొక్కొ దా • డిమఫలోద్భవ బీజ
మతి పద్మరాగసా • మగ్రివలనఁ
బొడకట్టెనొక్కొ జం • బూఫలం బనుమనో
భ్రమ మింద్రనీలవి • భ్రమమువలనఁ
దోతెంచెనొక్కొ మ • ధూకపుష్పములను
నాన హరున్మంజిము • త్యములవలన

గీ. దాది యటుపెట్టి పసుపాడఁ • దలఁగి చనుడు
బరణి మూఁకుట నెలకొన్న • బన్నసరము
గఱచికొనిపోయెఁ జిల్క ప • రిగల్భవిటుఁడు
బాలికామానసముగొను • పగిదినపుడు. 231

క. బారాదిసొమ్ములుండఁగ
హారమునే కొనుచుఁజనియె • నండజము ప్రియం
బారయ ఫలకాముకులగు
వారలు గుణవస్త్రసక్తి • వదల విడుతురే?. 232

క. ఆధవళకిరణముఖికి న
సాధునకు గాచరణ మపుడ • సవ్యాంబయ్యెన్
గోధుక్కృతిసతికి మనో
బాధకమగుకృష్ణధూర్త • బాల్యముఁబోలెన్. 233

మ. కటిఁ జేలార్ధము చుట్టి చిక్కనది మేఁ◆గన్పట్టఁ బాలిండ్లమీఁ
దట సంధించుచు నాగ్రిదేహలత మా◆ద్యద్వర్షధారావల
త్తటిదాకారముఁ జూపఁ దోఁపికొనుచుఁ◆ధమ్మిల్లబంధంబుముం
గిటికిఁ నుస్తని వచ్చె గోస్తనహార◆త్కీరగ్రహావ్యగ్రయై. 234

తే. వర్షధారావశేషాస్వ◆వాయయుక్తి
వాయువశమునఁ దెరలు ము◆వ్వన్నెవిల్లు
నేడ్క వెన్నాడుశశివో లె◆నెలఁది చాప
లమున నరమాహరించునొ◆కముదవులుచు. 235

మ. గుహామాతృస్థలికాక్షు సూత్రిను సితే◆క్షుచ్ఛేదగుచ్ఛచ్ఛటా
స్పృహఁ గై కొన్నశుకంబు నేమఱుతఁ జేఁ◆జేరాడు పూనాఁగ తో
బహుముక్తాసమితో స్త్రీ విల్చురతిగా◆ట్పట్టాశ్వమో నాఁగ న
మ్మహిళావిభ్రమ కీర మొప్పు ముఖసీ◆మాగామిముక్తాళియై. 236

వ. ఈచందంబునఁ గందర్పస్యందనంబు వినిందితుండన మందమంద ప్రచారంబును మలిమ్లుచుండన దుర్గమప్రవేశనిపుణంబును నవివేకియన శిథిలీకృత స్వపక్షంబును దనుజగృహీతజనకజయన రామానుసరణ సముచితంబును నై యున్మత్తుపోలికం జంచుచుంబితఫలంబికావ్యాజంబున లాల గ్రక్కుచుఁ బుష్పవద్బింబంబు విధంబున శకీరప్రభాదంభంబున నంభోధరంబులచేతఁ గప్పంబడుచు యోగిబాగున విచ్ఛిన్నచరణశృంఖలాచ్ఛలనంబున పాశచ్ఛేదంబు సేయుచుఁ బరవధూపయోధరంబుపగిదిఁ బట్టరాక నీతివిదుహృదయంబుగతి దూరదర్శనయోగ్యంబై కరువలిమురువునం బొడమి యడంగుచుఁ బర బ్రహ్మంబుచాడ్పున నగోచరంబయ్యును దదీయమాయావిలసితంబును నై సకలంబును నిజప్రతిభాసంబున యాథార్థ్యభూమిక నభినయించుచు శశాంకశిలాసౌధవిటంకంబుల నునుకువగొన్నతఱి శరన్నీరదవశంవదం

బగుశునాసీరశిలాశకలంబున మెలంగుచు నంతరిక్ష మహాప్లక్షం
బునకు నక్షామచంచు పుట ప్రవాళఖండ ప్రభాహిండనంబునం
దొరలినఫలవిటపలక్ష్మి నావహించుచుఁ బ్రమాదవిగళితంబగు
నగవిరోధికోలుపువీవనయచ్చరల పచ్చలకడియంబునడువున ని
రాలంబన స్థలంబునం బలుమఱు చక్రచంక్రమణ చమత్కా
రంబుసూపుచు సమీపారామశ్యామలపలాశపటల గర్భంబునం
దుముకుందవిగ్రహంబునందుభక్తిసమగ్రుండగు పురుషశ్రేష్ఠుం
డునుంబోలె నేర్పుఱుపరాక డిందుచు నందంద జాతిపులుఁగులు
మనుజగంధధురంధరంబగుటకు జగడంబుదిగిచినం గినిసి విసృ
మరతనూరుహదంతురకపోలాంతరంబును విఘూర్ణనవికృతవీక్ష
ణంబు నై క్షణంబు మణివలయ వలయితంబగు రతియువతిముం
జేతి రీతిం జెలువడరుమెడ నిగిడించి మగుడంబడి కాకుప్రకార
వికారస్వరంబుగ వాని నిరాకరించుచుఁబఱచునప్పుడచుఁజిలుకఁ
గరఁగినయదివోలె నయ్యన్ను వెన్నాడం బెన్నాటకంబై బోటి
కత్తియ లుత్తుంగకుచోత్సంగ సంగతకురంగలాంఛన కళావలో
కనంబున మునిముసినగవులు నెఱయ గోరువంక గాన వచ్చెం
గాని కీరంబు దూరంబయ్యెఁగదే యని గర్భోక్తివై దర్భంగూడి
యాడుచుం బాడుచు పంజరంబును జిలుకచాలు తెరయును చేరి
కచేసి మెలయింప నలయించుచు నడిఱెక్కగ్రిక్కిఱించుచు నొ
క్కమొండఁ గాలు నొడిచి ముక్కున నక్కంఠహారతరళంబు
నొక్కుచుఁ "జిక్కెంజిక్కె నిక్కడనిక్కడ నక్కయక్క" యని
చేటకానికరంబు పొలసిన పులుఁ గెఱింగి మొఱుంగు మెఱసి
తొలంగిన తెఱంగున డాయవచ్చినట్టుల మాయంబగు మాయ
లేటిపాటిఁ బోవంబోవ దూరంబగుచునుండు నెండమావుల మా
డ్కి దివియ నచ్చటనటించి మువ్వలోనిరాయి సోయగంబున

న క్కెంతవడి పట్టువడుట పచరించి ప్రచురరయంబున ఖచరపుర ప్రాసాదంబులు మోవంబూఁపున నెగసి తిరిగి పెఱతెరువునం బఱతెంచి పాండురంగాయతనంబు మధ్యరంగంబుచొచ్చి యచ్చట నిచ్చం దనయిచ్చనుండు దంశియంబుపై వ్రాల నిచ్చుట.

సీ. మదఘూర్ణదురుసంకు♦మదమలీమసకుచ
ద్విపమహోద్ధతిఁ గానుఁ♦దీఁగ నులియ
ఘనసారపుండ్రిక♦గ్లాబింబనికట ఘ
ర్మహిమాస్తి మోముదా♦మర చలింప
నాసికానూత్నగం♦ధఫలియూరుపుఁదావి
నధరదంతపదమ♦త్తాళి విరియఁ
గింకిణీక్వణనశం♦కిత గర్జితస్రస్త
కాంచిచంచలగతి♦యంచ జడియ

గీ. బంధనిర్ముక్తశుకసక♦భావ యగుచు
నలపరాశరసుతుచంద♦మధిగమించు
మించునసఁబోఁడి చందంబు♦మేలుకనిన
వాఁడు తలపోయుగలలోని♦వార్తయయ్యె. 238

తే. కక్కసపువంకగోరులఁ♦దొక్కిత్రొక్కి
కఱకుముక్కున నందందఁ♦గఱచికఱచి
పూసయొకటియుఁ బోఁగునఁ బొందనీక
చెరిపె ముత్యాలపేరు♦వి♦చ్చికపుఁబులుఁగు. 239

క. బహువిధరచనోజ్జ్వలమగు
మహిళామణిమణిసరంబు♦మణు లన్నియు న
య్యహిశయనుసదనశరధికి
నహీనరత్నాకరత్వ♦మనుసంధించెన్, 240

క. శుకముఁ గొదవె నయత్న
ప్రకటితమణిరంగవల్లి◆పరికల్పనకో
రకితసుకృతానుకృతి దా
నికి మెచ్చెఁ బౌండరీక◆నిలయుం డాత్మన్. 241

క. గిరికానుమ స్తబుద్ధి ను
పరిచరులిం బోలుపోక్క◆పన్నగ మొకనాఁ
డురవడి నెచ్చటనుండియొ
మురమర్ద నుదివ్యభవన◆మున కేతెంచెన్. 242

వ. ఆసమయంబున. 243

క. యమదండచండమగుభుజ
గమునకు వెఱచఱచి యూఖు◆కన్యక కమలా
రమణాంఘ్రిఁ జేరె గుఱుభీ
తమతికి నాముక్తమాల్య◆దకు నెన యగుచున్. 244

క. హరిపదపీఠస్థితిఁగల
సరియను చిట్టెలుక దాఁగె◆సంవర్తహరిన్
దెరలి మృకండుసూనుఁడా
తురతం దజ్జఠరపేటిఁ◆దూఱి రభాతిన్. 245

ఆ. వె. పీడిపడినగాజు◆వెదకంగ వెదకంగఁ
బద్మరాగమొకటి◆పసిడి నహికి
దొరకె నెలుక దూఱె◆తొలఁగినతఱి రమా
కమనచరణకైత◆కప్రసవము. 246

చ. చరణసరోరుహప్రసవ◆శైవలినీనివసద్బిసాంకురా
హరణమహీమఁ జేరినబి◆సాశన శాబమొనాఁగఁ బొల్చు సా
గరశయపూజనాచరణ◆కైతకకోరకముల్ భజించె ను
త్కరవరకంకణంబు మిహి◆కాఘృణి రాహువు గప్పునొప్పునన్.

తే. మధురసుదిరారసామోద • మైత్రి నలరు
పొలఁతి సెమ్మోముపల పాను • భోగివోలె
హరిపదాబ్జమధూళిమ • యంబుఁగోలె
జాతి గేదంగి తావి భు • జంగభర్త. 248

క. అలరు నల రుచిరమత్కుం
డలముపయిఁ నిలిపె సవ్య • నఖరపదమునై
నలరునిజకంటకక్షత
విలసనమును విటునిమేన • వేశ్యయుఁ బోలెఁ.

సీ. సరసిజాకల్యాణ • సముమ్మార్గ జతులక్ష్మి
గలిగించుఁ బదనఖా • గ్రమునఁ దవిలి
తళుకొత్తుమిన్నేటి • తెలినీటి దెమలున
ముదురు చెందొవచాలు • మొలవఁ బెట్టు
సీమంత సీమాంత • సందూరరుచిఁ జేయు
మొక్క లేవనిచతు • శ్శ్రుతిసతులకుఁ
బీరపూపంబునఁ • బెట్టిన శేషుని
ఫణరత్నఘృణులకుఁ • బాఁకు వెట్టు
గీ. కైటభాంతకపూజనా • కైతకప్ర
సవనవామోదపారణా • సౌఖ్యముదిత
భుజగరాజస్ఫటాభోగ • భూరిమణిస
మాజరాజత్ప్రభాపుంజ • మంజిమములు. 250

క. వ్యాపించు తిమిరహరమై
దీపించుని జోత్తమాంగ • దివ్యమణిరుచిఁ
దీపావళిహరికిచ్చుచు
నాపుణ్యఫలానుభవము • నయ్యెహి గనిమెఁ. 251

క. ఆతటి నొకకందువ న
వ్వాతాశనశయను కేళి◆వనవసుమతి నుం
డే తెంచెఁ గరఘాసం
ఘాతము తమ పెరకుఁ గడువి◆ఘాతంబగుటన్. 252

క. కాయద్యుతి జిడ్డుకొనఁగ
నాయీఁగలమొత్త మాశ్రి◆తాఖిలదిశమై
యాయెడఁ దైలతటాక
న్యాయం బొనరించె జలధ◆రాధ్వంబునకున్. 253

శా. ఆమందోద్భవబీజషండరుచి స◆య్యాటించుచున్ మక్షికా
స్తోమం బాతతపక్షగుచ్ఛమగుచున్◆దోతేరగా శ్మశ్రులం
బై మిన్నొప్పు తదంగసంగతి మధు◆వ్యామోహముం జేయుదో
డ్తో మర్త్యాలికిఁ దద్విహారకలిత◆ద్రుస్కంధవీరుచ్ఛ్రుఖల్. 254

క. ఆమఘుమక్షిక లటఁ జని
దామోదరమందరాగ్రి◆తలగతనిర్ఝా
ల్యామోదామేదురమఘు
పేర్మిమాకులబుద్ధి మైఁజ◆రింప◆గ సంతన్. 255

క. అందు నొకసరఘ గ్రోలె ము
కుందపదార్ఘ్యాంబు బిందు◆గుంభితసుమనో
మందమకరందశీకర
ముం దీర్ఘస్వార్థముల్ స◆మున్నతి వెలయన్. 256

క. కలిగె మధుమక్షికమునకుఁ
దలఁపనితలఁ పస్మదాని◆ధార్యము గంగా
జలవలమానము యదుకుల
తిలకాంఘ్రిసరోజదివ్య◆తీర్థము గ్రోలన్. 257

ఆ. వె. దాన సంభవించెఁ దేనియయీఁగకు
సోమపానరతుల సుకృతఫలము
భాగ్యమొదవెనేనిఁ బ్రాపించు తనుఁదాన
పుణ్యలక్ష్మి నిధియుఁ బోలెఁ బురుషు. 258

సీ. జనియించె నేసాధ్వి జాతిస్మరత్వసం
పదకల్మి నిజకులాభరణమగుచు
వర్తించె నేపతివ్రత తాటిమీఁదటి
తపమైనతనువునఁ దాల్మిమిగిలి
నెలకొల్పె నేయపాంసుల మానసమునందుఁ
బరమవైష్ణవధర్మపాటవంబు
మెప్పించె నేసతి యవ్వాండరీకతీ
ర్థవిభు నిష్టాన్నవిశ్రాణనమున
గీ. నాసుశీలకు నక్కాక వ్యాంస చిత్ర
శుక భుజంగమ సరఘులు సురథ సులభ
సుముఖ సువ్రత సుకృతి నామములు వరుసఁ
దాల్చి జనియించె శుక్తిముక్తాలువోలె. 259

క. భూలేఖకులుం గేయే
కాలంబున నెట్టియెట్టి కర్మ మొనర్పం
బోలుం దత్తత్కృత్యము
లోలిం బిత్రకృత్యములయి గుణోన్నతిఁ బెనుపన్. 260

శా. శాణోత్తేజితరత్నలక్ష్మి గురుశిక్షావత్కిశోరాకృతిన్
రేఖత్రాళనశారిమూర్తి కలభశ్రీ దోర్విహారోద్యన్నవ
క్షోణీజపరిభ ముక్తకంచుకఫణిస్ఫూర్తిన్ సుధీబాంధవ
శ్రీణిప్రీణనకారణోజ్జ్వలకళోత్సేకాఢ్యులై రేపురున్. 261

క. ఆతటి నొకకందువ న
వ్వాతాశనశయను కేళి♦వనవసుమతి నుం
డే తెంచెన్ సరఘూసం
ఘాతము తమపెరకుఁ గడువి♦ఘాతంబగుటన్. 252

క. కాయద్యుతి జిడ్డుకొనఁగ
నాయీఁగలమొత్త మాశ్రి♦తాఖిలదిశమై
యూయెడఁ దైలతటాక
న్యాయం బొనరించె జలధ♦రాధ్వంబునకున్. 253

శా. ఆమండోద్భవబీజషండరుచి స♦య్యాటించుచున్ మక్షికా
స్తోమం బాతతపక్షగుచ్ఛమగుచున్♦దోతేరగా శ్మశ్రులం
బై మిన్నొప్పు తదంగసంగతి మధు♦వ్యామోహముం జేయుదో
ష్ఠో మర్త్యాలికిఁ దద్విహారకలిత♦ద్రుస్కంధపీరుచ్ఛిఖల్. 254

క. ఆమఘుమక్షిక లటఁ జని
దామోదరమందరాగ్ర♦తలగతనిర్ఝా
ల్యామోదామేదురమఘు
ప్రేమాకులబుద్ధి మైఁజ♦రింపఁగ సంతన్. 255

క. అందు నొకసరఘ గ్రోలె ము
కుందపదార్ఘ్యాంబు బిందు♦గుంభితసుమనో
మందమకరందశీకర
ముం దీర్ఘస్వార్థముల్ స♦మున్నతి వెలయన్. 256

క. కలిగె మధుమక్షికమునకుఁ
దలఁపనితలఁ పస్మ్రదాని♦ధార్యము గంగా
జలవలమానము యదుకుల
తిలకాంఘ్రిసరోజదివ్య♦తీర్థము గ్రోలన్. 257

ఆ. వె. దాన సంభవించె•దేనియయీఁగకు
సోమపానరతుల•సుకృతఫలము
భాగ్యమొదవెనేని•బ్రాపించు తనుఁదాన
పుణ్యలక్ష్మినిధియుఁ•బోలెఁ బురుషు. 258.

సీ. జనియించె నేసాధ్వి•జాతిస్మరత్వసం
పదకల్మి నిజకులా•భరణమగుచు
వర్తించె నేసతి•వ్రతి తాటిమీఁదటి
తపమైనతనువునఁ•దాల్మిమిగిలి
నెలకొల్పె నేయపాం•సుల మానసమునందుఁ
బరమవైష్ణవధర్మ•పాటవంబు
మెప్పించె నేసతి•యపుండరీకతీ
ర్థవిభు నిష్టాన్నవి•శ్రాణనమున
గీ. నాసుశీలకు నక్కా•కహంస చిత్రి
శుక భుజంగమ సరఘులు•సురథ సులభ
సుముఖ సువ్రత సుకృతి నా•మములువరుసఁ
దాల్చి జనియించె శుక్తిము•త్యాలువోలె. 259

క. భూలేఖకులు ల కేయే
కాలంబున నెట్టి యెట్టి•కర్మ మొనర్పం
బోలుం దత్తత్కృత్యము
లోలిం బితృకృత్యములయి గు•ణోన్నతిఁ బెనుపన్. 260

శా. శాణోత్తేజితరత్నలక్ష్మి గురుశి•క్షావత్కిశోరాకృతిన్
రేఖత్వాళనశారిమూర్తి కలభ•శ్రీ దోర్విహారోద్యన్నవ
క్షోణీజపరిభ ముక్తకంచుకఫణి•స్ఫూర్తిన్ సుధీబాంధవ
శ్రీణిప్రీణనకారణోజ్జ్వలకళో•త్సేకాఢ్యులై రేపురున్. 261

చ. ఒకఁడు నిగూఢకృష్ణరుచి◆యొక్కఁడు నిర్మలమానసప్రియుం
డొకఁడు ప్రయత్నయోగ్యఫలుఁ◆డొక్కఁ డనాదృతబంధకంచుకుం
డొకఁడు రసానుకూలమతి◆యుక్తుఁడు నై విలసిల్లి రంతఁ బు
త్రికులఁటె యొట్టివారలకుఁ◆దప్పునె? తొల్లిఁటిజన్మవాసనల్. 262

ఉ. లౌకికవైదికాచరణ◆లాలసులై హరిభక్తి నుత్తమ
శ్లోకులు వీరసంగరగి◆సూనృతలక్ష్మికిఁ బట్టుగొమ్మలై
లోకప సర్వభూతదయ◆లోఁ దమసొమ్ముగ దీనమానస
వ్యాకులతాపనోదనస◆నాథ్యులనన్ విలసిల్లి రేవురున్. 263

క. అన్నాలు నాలు నాలుగులనుగ
మొన్నఁదక్రియఁ గొలువొందు◆నెసఁగి కసితమా
నెత్తమ్ముక్రొంగొలిచెలువునఁ
దత్తసౌభాగ్యములన◆దాత్తంబయ్యెన్. 264

ఉ. కేసరిశాబశోభిగ్రహ◆కీర్తియు భానుమదంశవిస్ఫుర
ద్భాసకలక్ష్మిఁ బై భవము◆వారినిలగ్నసమగ్రవేల యు
ల్లాసముదాల్చి యొప్ప మహి◆శాతిలకంబు పవిప్రసాదవి
న్యాసముచేతఁ జేకుఱిన◆నందను లేవురు నందమందఁగన్. 265

తే. అఖిలకల్యాణగుణశీల◆ నాంశుశీల
పెట్టెఁ జేవిరాఁడుగా నేల్లి◆ చుట్టములకు
భక్తితోఁ గూడ ముత్తాటి◆పండుదిరిమె
నెత్తె ముసత్రగుల్లు◆ నెందఁ జేని. 266

ఉ. ఆనలినాయతాక్షి ప్రస◆వాపగమంబునఁ బండఁ బాఱుచున్
బాణివిభూషలాలసము◆పాఁకుడు లయ్యెఁగ నిల్చి మనస్సం
తాన మొనర్చుపోదిఁ జర◆దైన్యమునాఁగ నతీతవర్ష ను
ద్యానతరాషష్ఠివవహ◆దంబుసమీపనిరూఢిఁ గోలదే? 267

క. సకలాగమజ్ఞయుగువి
ప్రకులాంగన యొక్కనాఁడు • పలుకు నిజకుమా
రకులఁ గని మును మదాలస
శుకతుల్యులఁ గూర్చె యాత్మ • జులఁ బల్కెక్రియన్. 268

మ. అనుభూతాఖిలభోగ పోషిత సమ • స్తార్యం గృతానేకకాం
తనముఖ్యోచితదాన దృష్టిగతయు • ష్మత్క్షేమ జీవత్వతిన్
జనతామాన్య నశీతివృద్ధ సను నీ • సంసారదుర్వారబం
ధననిర్బంధమునందుఁ బాపుటకు య • త్నంబింకఁ జేయందగున్.

క. సభవజ్జనకంబుగఁ జని
ప్రభవజ్జగదండషండ • పరిపూర్ణతనున్
శుభదాయిం బౌండరీక
ప్రభు నారాధించి కాంతుఁ • బరమపదంబున్. 270

క. ఒకబుద్ధి వినుం డొండా
డక సకలాగమమతంబు • డక్కఁ దెలిసి మీ
కకుటిలమతి నెఱిఁగింతు జ
నకసనకశుకాదులెఱిఁగి • న తెరువుఁ దెలియన్. 271

సీ. అమితభోగాయత • నము దేహమనుసర్వ
ముగ్రికృత్యము లేల • యుడిగియుండు
ధాతుమయంబుగా • త్రిమనుధాత్రీధరం
బిదియేల రాగంబు • నవులఁదొఱియు
నిచితనానాగుణ • ప్రచుర మీతనువను
ఫల మేలచిరుగక • పదిలమొందు
సూర్మిపరంపరా • యుతమంగమనువార్ధి
యేజీవనభ్రాంతి • యేలయుడుగు

ఆ. వె. నార్జవంబు చాల♦దతికఠినాశయు
మెపుడు మైలవిడువ♦ దెందుఁజివుకుఁ
బటికిడొక్క దీనిఁ♦బాటింప రెప్పాట
లక్ష్యమేనియును ము♦ముక్షుజనులు. 272

ఉ. మాయయు జీవుఁడుం బెరసి♦మైత్రి యొకానొకఁడాచరించుచుం
బాయక యాఁడుఁ బాటు మగ♦పాటువడన్ వివిధత్వమొంది ప
ల్పాయలఁ బాంచభౌతికపుఁ♦బై రుదయించి తలిర్ప మ్రోడుగా
మేయు జరామయవ్యసన♦మృత్యునియుక్తకడంగరీయముల్.

శా. అంతర్వాణికి శేశయద్యుమణిఁ బ♦ద్మాక్షుఁ మదిన్ నిల్పి దు
ర్దాంతానంతభవాంధకూపతరణ♦ప్రౌఢిన్ దృఢస్థేమ భా
టింతుర్పెద్దలు తద్దనమ్మిక నుయిదాఁ♦ జేవానికిన్ జింతయా
కంత్రైనం గడమేనియుం గడమగా♦దా! యంచునూహించుచున్.

క. తల ముచ్చుట్టులు దిరిగిన
తలపోయఁగ నోరిలోని♦దయకడి యన్న
ట్టిల నే తెఱఁగులఁ దిరిగినఁ
గలుగదు గతి విష్ణుసేవ♦గావింపకయున్. 275

మ. పురుషశ్రేష్ఠులు గొంద ఱాత్మచరితం♦బుల్ జ్ఞానవైరాగ్యభా
స్వరముల్ గా విహరించుచున్ గురుకృపా♦సంపన్నులై సాధనాం
తరమంత్రాంతరదేవతాంతరములం♦దర్కించి క్షీరోదక
స్ఫురణంబొప్ప ముకుందలీసతనులై ♦ పొందర్పునర్జన్మముల్. 276

సీ. విషయాంకురము గిల్లి♦వేయనివారికి
నినుపకచ్చడమున♦ కెంతదవ్వు
తెగగొనికసటుగ♦ను గనివారికిని ద్రి
షవణంబునకు నెన్ని♦చాళ్ళపట్టు

చింతలన్నియు మాని • సేయనివారికి
బోడయాదలలకు • నేడ కేడ
యేనుతత్వంబులు • నెఱుఁగనివారికి
నెఱుకకు నేయూరి • కేది తెరువు

ఆ. వె. తమమొగంబు జూడు • తముఁజూడు మేనుంగు
మీఁదనున్నవాని • మేరమీరి
సున్నమడుగఁజూచు • చున్నారు హరిభక్త
గమ్యధామకాంక్ష • గర్మపరులు. 277

సీ. పరదారపరధనా • హరణాశైముఖ్యంబు
వశవర్తిగావించు • వారుదక్కఁ
బరగుణపరమాణు • పర్వతకరణంబు
నశ్రితముగాఁబాటించు • వారుదక్కఁ
బరుఁడైనఁ గొడుకైన • మరియాద చెడనమ
త్వమున శిక్షయొనర్చు • వారుదక్కఁ
బరమసంపదల నా • పద్వేళ సత్యంబు
వదలక భాషించు • వారుదక్క

గీ. దూరమగుకోర్కెఁ గోరని • వారుదక్కఁ
గ్రూరకర్మంబు లుడివోవు • వారుదక్కఁ
బూరుషార్థపరతఁ గాంచు • వారుదక్కఁ
దక్కువారెల్ల భవవహ్ని • దక్కువారు. 278

క. పలువేల్పులబడి నడవక
యిలువేలుపుగా భజింపుఁ • డీ! మీరలు వి
ట్ఠలు శిక్యగదధరసగం
ధిలకేశుం బాండరీక • తీర్థాధీశున్. 279

ఉ. మస్తకికిరీటహాటకస♦మంచితకుంభయుతంబు పీవరో
రస్తటిరత్నదీప్తిరుచి♦రంబు రమాసమసాలభంజికా
శస్తము నైనశార్ఙ్గితను♦సౌధము నెక్కి సుఖించు బుద్ధికిన్
నిస్తులభక్తిగౌరవమ♦నిచ్చెనయై చననిచ్చు మీఁదికిన్. 280

క. మీమనుగృహస్థధర్మము
మేరకుఁ దలమీఁటి చనక♦మిత్రామాత్యో
దారహిత దార దారక
వారకములతోడ దీర్ఘవాసపరులగై. 281

క. కోమలతులసీపల్లవ
దామాంచితవత్సలక్ష్మ♦ధాముఁ బయోద
శ్యాముఁ బదద్వయనుతసు
త్రామున్ మనపౌండరీక♦ధాముఁ గొలువుఁడీ. 282

క. అనుచుండ నర్కనిభమగు
ననిమిషయానంబు దెచ్చి♦హరిపార్శ్వచరుల్
కొని చనిరి సభర్తృకముగ
ఘనశీల సుశీల విష్ణు♦గాథాలోలన్. 283

తే. ఆవు నవనీసురుండు వా♦యసము నంచ
రాజకీరంబు పాము స♦రఘయు నిట్లు
ముక్తికేగినకథ విను♦భక్తతతికిఁ
బర్వతాగ్రశిలాబ్జసం♦భవముభవము. 284

వ. అని వెండియు నిందుధరుండు శతానందనందనునితో నిట్లనియె.

సీ. నీలమో కాలాభ్ర♦జాలమో బాలశై
వాలమో యాసిద్ధ♦వరునికాంతి
కెంపులో పవడంపు♦గుంపులో యారెండ
సొంపులో యామేటి♦జోగిజడలు

హారమో హారసీ•హార్దమో భూరిక
ర్పూరమోయీ యాది•పురుషునగవు
మెఱపులో వజ్రంపు•టొఱపులో శశిరేఖ
తఱపులో యీవటూ•త్తమునికోఱ
గీ. లసఁగ శార్ఙ్గికి నాదిక్కు•నందు నిలిచి
ప్రేతభూతనిశాచర•పీడ లడఁచి
క్షేత్రరక్షణదక్షుఁడై•క్షేత్రపాలుఁ
డుండు విభునాజ్ఞ తలమోచి•యోమునీంద్ర! 286

క. శిక్యావచూడు నాజ్ఞా
వాక్యార్థము సేయుభోగి•వలయు పరిభావా
ధిక్యంబు మీఱి యేరికి
శక్యమె! తత్క్షేత్రమునఁ బ్ర•చారమొనర్పన్. 287

చ. చెడుగుల విష్ణుభక్తినిర•సించు దురాత్ముల మోక్షలక్ష్మిచే
పడుటకుఁ గానిహీనులఁ బ్ర•భావతిరస్కృతలోకపాలుఁ డా
బుడిబుడితాల్పు డందు నొక•బూఁటయు నుండఁగనీక త్రోచిపో
నడుచుఁ గలంచు డెందముల•నారట పెట్టు మహోగ్రమూర్తియై.

ఉ. పువ్వను బూఁతపుట్టమును•భూషయు దివ్యములై చెలంగ లే
జవ్వను లర్థిఁగొల్వ నొక•చక్కనిఖేచరుఁ డొక్కఁడాడు ము
న్నవ్వనమాలిహాటకమ•యావసథోపరివీథి ద్రిమ్మరున్
గ్రొవ్వెసఁగన్విమానరుచి•కోకనదప్రియరోచి మెచ్చఁగన్. 289

ఉ. ఏదితయావనోత్థమతి•నెద్దియు మీఁదెఱుఁగంగ లేక వి
ద్యాధరుఁ డాతఁ డాత్మరుచి•నాకసముం గనకప్రసూనరా
జీధరణాభిరామముగఁ•జేయుచుఁ ద్రిమ్మర క్షేత్రపాలుఁ డు
త్క్రోధరసోగ్రమూర్తియయి•కోయనియార్చె నభంబుఁ జూ
చుచున్. 290

సీ. కనువిచ్చి చూచుట♦గాక దిగ్గున లేచె
నమితసమాధిస్థి♦రమునికులము
గుల్మలఁబొదువుమ♦క్కువలు దక్కుటగాక
పొదలాడెఁ జెట్లపైఁ♦బులుఁగుమూఁక
పులిమేయుతమకంబు♦దొలఁగుటగాక వి
హ్వలబుద్ధియై దాఁటె♦హరిణకులము
ప్రిజ గేలఁ గర్ణరం♦ధ్రములు మూయుటగాక
పవిశంక నరనుతి♦ప్రవణమయ్యెఁ

గీ. బద్మనాభగృహోపరి♦భాగసంచ
రిష్ణు ఖేచరదర్శనో♦ద్రిక్తహృదయ
కాలభైరవభైరవో♦ద్వేలకంఠ
కుహరనిష్ఠ్యూతరోషని♦ర్ఘోషవిహృతి. 291

ఉ. మాననికోప మిట్లుమది♦మల్లడిగొల్పఁగ మింటికిన్ మహా
శ్యేనముపోలె బిట్టెగసి♦యెక్కుడునుక్కున నుగ్రవిగ్రహుం
డై నెఱితగ్గ నగ్గగన♦యాయివిమానము ద్రొక్కి భగ్నముం
గా నొనరించుచుం ద్రిదశ♦గాయకరాయకుఁ డుర్విఁ గూలుడున్

ఉ. సోలుమసంగి మ్రోఁగి బలు♦గోలలుదీటుచు గ్రుడ్లుద్రిప్పుచున్
క్ష్వేళ లొనర్చుచున్ మొగము♦జేవురుముగ్ధవిధంబునన్ మహా
భీరముగాఁగ వ్యాళవిభుఁ♦బెన్బులుఁ గీడ్చినమాడ్కి నీడ్చె న
బ్బాలిశుఁ గాలభైరవుఁడు♦పైకుబుసం బొకపోరు వెత్తఁగన్. 293

క. ఈవడువునఁ బులి దొడికిన
యావుపసిగనుసుఱువోవ♦నాసన్నుండై
నావిద్యాధరు భైరవ
దేవాప్తుఁగాంచి వాసు♦దేవుఁడు పల్కెన్. 294

శా. నాగాకల్ప! యహో! పురే! నిలువిమా•నభ్రష్టుఁడై నేలపై
నీగంధర్వుఁడు కూలి దర్పముడివో•యెన్ జంపఁగాఁ గాదు గా
ఢాగఃకర్ముఁడేనియున్ జడువువాఁ•డై యుండ నర్థిన్ మహా
భాగుల్ చంపమి నీవెఱుంగుదువు గో•పంబాఁపు మీపట్టునన్.

క. అని శ్రీపతి యానతియి
చ్చిన మందల విడిచె నతని•సిద్ధవిభుఁడు వాఁ
డును గులగులలై లా వగ
లిన మై విదలించుకొనుచు•లేచెఁ గిదుకుచున్. 296

ఉ. లేచి యతండు గాంచెఁ గద•లీమృగులోరుయుగున్ హసన్ముఖున్
మేచకమేఘమూర్తి దిన•మిత్రసమానమరత్నభూషితున్
లోచనధిక్కృతాంబుజద•ళున్ శతకోటి సుధాకరాగ్నిరు
గ్వ్రాచిపరంపరోపమన•వీనతనుప్రభు యాదవప్రభున్. 297

వ. ఇట్లు సచ్చిదానందకందంబగు నచ్చిందంబుదాల్పు ననల్పాద్భుత
రస నిర్మగ్నుండై కనుంగొనుచు నవతీర్ణగర్వవిద్యాధరుండై
యవ్విద్యాధరుం డిట్లనివితర్కించు. 298

శా. ఈపుంగామణి యెవ్వఁడొక్కొ? హరియే•యిట్లుండెనం దేహమే
లా? పద్మాక్షుఁడె యంచులోఁదెలిసి యో•లక్ష్మీశ! యేఁదవ్విన్నా
పోపర్యభ్రచరద్విమానగుఁడనై•యుండుండి యిష్టాక్కయు
తోక్కపోదగుఁడు గూల్పఁ గ్రొవ్వటెఁగి కన్*గొంటిన్ సురేశున్
నినున్. 299

క. నిర్మదులకుఁ దోఁచినక్రియ
దుర్మదులకుఁ దోఁప వీ వె•దుట ననుచు మనో
మురుమ్రవాపిఁ బడి మనుజ
ధర్మభటుఁడు తత్పదద్వ•త యకృతమతియై. 300

స్రగ్ధర.

"పాపోహం పాపకోపః ప్రవణమతిరహం బాలిశోహం సుధీదు
ష్ప్రాపోహం దుష్టకష్టః ప్రకృతిరహ మహం పాపరాత్మాస్మినానా
రూపగ్రాహోపచారా ద్భవనిహితధియం క్రోధినం మామవ త్వ
చ్ఛ్రీపాదాసక్తియుక్తః శ్శివకర"యనుచున్ శిష్టుఁ గృష్ణున్ నుతిం
చెన్. 301

వ. అని మఱియును. 302

చ. యదుకులనాథ! యిప్పుడితఁ డాగ్రహవృత్తి నొనర్చునిగ్రహం
బిదియు ననుగ్రహంబ యగు నింద్రియరాజికి బంటు సేయు శ్రీ
మదమునణంచి నీయడుగు మానిసిగా ననుఁ జేసెఁ గాన సం
పదగలగర్వ నిర్మముని మాడ్కి నినుం గనికొల్వఁ జాలు నేఁ. 303

క. మూఢుఁడ ననుఁ బ్రోవు మహా
దీర్ఘకు నిఁక జోరక నామతి వెలయుత దయా
గాఢత్వాజ్ఞ విమానా
గూఢుఁడనై జగములం దిరుగువాఁడ హరీ!. 304

చ. సురసదనంబునందయిన క్షోణితలంబున యందునైన భీ
కరనిరయంబునందయినఁ గర్మవశంబున నుండునామదిం
బొరయనుగాతఁ గాతరసముద్ధరణోచితకార్యధుర్య! త్వ
చ్చరణసరోరుహద్వితయసంతతసంస్మరణానుషంగముల్. 305

క. అని వలగొని యాయదునం
దనునిరుపమదివ్యరూపదర్శనమున లోఁ
దనియుచుఁ జొక్కుచుఁ మ్రొక్కుచుఁ
జనియెన్ విద్యాధరుండు శతధృతితనయా!. 306

క. మధుమథనునాజ్ఞ నేమం
విధమహిమఁ దలిర్చుక్షేత్రవిభు భైరవదే

వు ధరాధో౽భువనస్వ
ర్గధామనుతుఁ గాంచి పిదపఁ గనఁదగుఁ గృష్ణున్. 307

శా. సాహిత్యాపరకాళిదాస! హరిపూజాగౌరవవ్యాస! గం
గాహల్లోహలవాగ్విలాస! రిపువర్గత్రాసకృత్ప్రాస! కాం
తాహర్షావహదృగ్విలాస! శుచిపద్యామోదితాభ్యాస! హే
మాహార్యోపమధైర్యధుర్య పదవిన్యాసా! విధేయారసా!. 308

క. షడ్దర్శనపారగ! కవి
రాడ్దత్తానుగ్రహాభిరమ్యసుధాంధ
ద్విడ్దంతిసింహ! మహిత
త్విడ్దశశతకిరణ! హృదయధృతహరిచరణా!. 309

మాలిని. వినయనయసముద్రా! విశ్రుతోల్లాసముద్రా!
జననుతగుణజాలా! శత్రురాణ్మ్రనజాలా!
ధనదసదసమానా! ధన్యధీభాసమానా!
ఘనవపురినరాగా! కావ్యదత్తానురాగా!. 310

## గద్య

ఇది శ్రీ పరమపదనాథనిరవధికకృపాపరిపాక
పరిచిత సరసకవితాసనాథ రామకృష్ణ
కవినాథ ప్రణీతంబైన 'పాండురం
గమాహాత్మ్యంబనుపరమ భా
గవతచరిత్రంబునందుఁ
జతుర్థాశ్వాసము.

---

శ్రీరస్తు.

# పాండురంగమహాత్మ్యము.



## పంచమాశ్వాసము.

---

క. శ్రీషణ్ముఖజననీమహి
భాషానిభనిజవధూశు•భప్రదలీలా!
భూషితకల్యాణోజ్జ్వల
వేషా! రామానుజేంద్ర•వేదాద్రీశా!. 1

వ. ఆకర్ణింపుము. 2

క. అని యీక్రియ నానతి యి
చ్చిన హెచ్చిన సంతసంబు•చిత్తముతోడం
బెనఁగొన ననిమిషముని యి
ట్లను నజ్జగదేకనిధికిఁ•బ్రాంజలి యగుచున్. 3

తే. క్షేత్రమాహాత్మ్యమును మహా•క్షేత్రపాల
దివ్యచరితంబు నందుండు•దేవదేవు
గుణకలాపంబుఁ బుండరీ•కునిమహిమయు
వింటి భవబంధముల వీడు•కొంటి దేవ!. 4

తే. ఎన్ని ద్వారంబు లయ్యాయి•యెడవసించు
ద్వారదేవత లెంద ఱా•స్థలమునందుఁ
బ్రబలు క్షేత్రాదిపుణ్యవై•భవము పేర
నొందుగలదేని యానతి•యిందు మఱియు. 5

క. అని నారదుండు ప్రార్థిం
చినఁ బద్మదళాయతాక్షుఁ జిత్తాంభోజం
బున నిల్పి యతనిఁ బలుకున్
మనసిజమర్దనుఁడు మధుర మధురారభటిన్. 6

క. సుఖమాలికాతరంగిణి
సఖియై భీమరథిఁ గూడి చనునెచ్చట స
త్సుఖకర మచ్చోటు చతు
ర్ముఖముఖనత మాదితీర్థమును నై వెలయున్. 7

క. పూర్వద్వారంబగు నది
దర్వీకరసార్వభౌమ తల్పునగరికిన్
సర్వసుపర్వార్చితపద
గీర్వనిత వసించు నచటఁ గృష్ణునియాజ్ఞన్. 8

క. శ్రీమహితము సిద్ధేశ్వర
నామాంక మపంకజలస నాథము లక్ష్మీ
కాముకనిహితము ఖచరా
లీమాన్యము నై నశంభు లింగముతోడన్. 9

క. తగు దక్షిణంపువాకిలి
నగధరునగరునకు భీమ నందనపొందుం
దగిలినయది యచ్చోటన
యగమ్యపుష్పావలీ మహానది యనఘా!. 10

క. దాన స్నానాదివ్రాతా
జ్ఞానానలదాహమైన సంగమతీర్థం
బానెలవున విఖ్యాతం
బై నది సురలుండుదురు శిలాకృతినందున్. 11

వ. అది భవదీయాశ్రమంబగుట నీవెఱుంగుదు వదియునుం గాక. 12

చ. కలఁ డొకబోయ తన్నికట♦కానన భూమి నతండు విల్లున
మ్ముల ధరియించి కల్మష స♦మూహము లెత్తిన మేనుబోలెఁ బే
రలుక వహించె నేని హృద♦యంబు గలంగు ధరాధరస్థలీ
నిలయవసత్కరీంద్రులకు♦ నిక్కమ తక్కు మృగంబు లోర్చునే?

చ. అడవికి వేటమై నరిగి♦ యూతఁ డొకానొకనాఁ డొకింతయున్
మెడ మలగింపలేక తన♦మే పొడలొందును రెండు నేకమై
పొడమఁగ బీదకన్నువడి♦బూడిద పండునుబోలె బూఁదుపా
రెడు నొకదుప్పికిం గవియఁ♦బ్రేలి భయజ్వరతప్తచిత్తమై. 14

తే. ఆచమూరువు యూథంబుఁ♦ద్రోచి పఱచె
వింట నమ్మెక్కి బోయ వె♦న్వెంటఁ దఱుమ
లోలజిహ్వాకరాళవి♦శాలముఖత
నోలి భీతేందుమృగశాబ♦మో యనంగ. 15

ఉ. ఆరుపు వీగతిం బఱచి♦యగ్రమహిం బడి లేచి వెండియున్
భూరిరయంబు సంజని వ♦పుర్వ్యథ సంగమతీర్థతీరవి
స్ఫారలతానికుంజములు♦ బల్వడి దూఱు నెడం గిరాతుఁడున్
గ్రూరశిలీముఖంబు దొడి♦గుండియ గాఁడఁగ నేసె నేసినన్. 16

సీ. ఆశరముఖవిభం♦బాశర మటుదాఁకఁ
బవనాభిహతిఁ దూలు♦బంధుజీవ
కుంజంబు పువ్వులఁ♦గూలించు విధమున
నవనవక్షతజ బిం♦దువులు దొరఁగఁ
జేయుచు వివృతాస్య♦సీమఁ బ్రాణానిల
ప్రస్థానపటహోగ్ర♦రవ మనంగ
నార్తనాదముగ్రమ్మ♦నది యేటి తెలినీటి
తేమలున నుఱికి దే♦దీప్యమాన

గీ. హాటకవిమాన మెక్కి విద్యాధరేంద్రుఁ
డగుచు లావణ్యపుష్పాస్త్రుఁ డగుచుఁ జంద్ర
సాంద్రతను కాంతియగుచు నతీంద్రమహిమ
గగనమున కేగెఁ దొలుమేను గానఁబడదు. 17

శా. చిత్తం బద్భుతమంద నమ్మృగవధాజీవుండు లోలోనఁ ద
ద్వృత్తంబుల్ బలుమాఱు మెచ్చి నిజదుర్వృత్తిన్ విసర్జించుచున్
దత్తీర్థాంబువు నాఁడి క్రోలి విగతాతంకాత్ముఁడై శుద్ధి ద
* ల్కొత్తన్ ముక్తశరీరుఁడై కనియె దివ్యుల్ మెచ్చ నుచ్చస్థితిన్.

క. కావునఁ దత్తీర్థంబున
సేవలనఁ బరాసులగు విహీనమతులకున్
గైవల్యసిద్ధియగు నన
నీవలె నతిశుద్ధమతుల కేటికి? నెన్నన్. 19

సీ. సంధ్యలు మూఁట నిచ్చనివాళులిచ్చుచు
బిరుదాంకమాలికల్ పేరుకొనుచు
లోచూపు దివుట నాలోకించి చొక్కుచుఁ
బులకాశ్రుగాద్గద్యములఁ బొరయుచు
శ్రుతులెట్టు లట్ల సంస్తుతు లాచరించుచు
వీనులఁ దత్కథావితతి వినుచుఁ
గరతాళగతులఁ జొక్కటముగా నాడుచు
నావేళ మూర్ఛల నలంతఁ గనుచు

గీ. విష్ణుసేవింతు రచట నవ్విబుధవల్ల
భాజనంబులు తత్కృపాభాజనంబు
లమ్మహాక్రీడనస్థలి నాచరించె
లంఘనాక్రీడనము దొల్లి లచ్చిమగఁడు. 20

మ. విను ముక్కా శౌరికినోడి సంగమమరు♦ద్విడ్ద్వేషి యెచ్చోటికిం
జని వెండిం జనుదెంచి యచ్చట శిలా♦సంఛన్న దేహాంబుతో
డ నిలాగర్భమునందు దాఁగఁ గని గాం♦ఢక్రోధుఁడై దేవకీ
తనయుం డాశిల గ్రొచ్చివైచి మెదిపెన్♦దద్దైత్యుఁ జూర్ణంబుగన్.

క. పువ్విలుతుతండ్రి యచ్చట
ముప్వంకమురువున మురళి♦మ్రోయించె మనం
బువ్విళులూరఁగ శ్రుతులకు
నవ్విధము తదీయపదయు♦గాంకము దెలుపన్. 22

క. మహి నేవంవిధచిత్రా
వహమగునద్దక్షిణంపు♦వాకిట మహిమన్
బహుముఖముల వినుతింపఁగ
నహిపతియుం జాలఁడనిన♦నన్యులవశమే?. 23

సీ. తనకటాక్షములు సం♦తానచింతారత్న
నిర్మాణ పరమాణు♦నికరమనఁగఁ
దనవిలాసంబు మ♦హైశ్వరిశంబర నిషూ
దనపాలితపురఃప♦తాకయనఁగఁ
దనమనస్సరసి సం♦తతచిదానందవై
భవమరాళముకున్కి♦పట్టనంగఁ
దనప్రసాదంబు భ♦క్తవరేణ్యదుర్గతి
ధ్వాళనోచితచంద్రి♦గోళి యనఁగ

గీ. వెలయు నేదేవి యాదేవి♦విద్రుమద్రి
కద్రినిర్భిద్రతనుకాంతి♦భద్రపరమ
మాయభువనేశ్వరి వసింప♦మధువిరోధి
ధామమునఁ గల్గుపశ్చిమ♦ద్వారమమరు. 24

ఉ. పోరత్రిశూలముల్ నిజాంఘ్రిగల♦బొట్టనవ్రేలుద మట్టిపట్టి మున్
చేరిత్రుదదంగమున్ మెదిపి♦పెట్టిన నెత్తురుబొట్టుఁబోలె జ్యో
తిరత్రయవీక్షణం బలిక♦దేహమునం గలదుర్గ స్వర్గదన్
వారణధారి యుత్తరపు♦వాకిటనిల్పినవాఁడు కాపుగన్. 25

క. తరణియు భైమియును బర
స్వర మచ్చటఁగూడినిగుడఁ♦బావనమగుత
త్సరిదంబువునం దాడిన
నరునకు నవ్వారి చరణ♦నఖమున వెడలున్. 26

క. ఎవ్వఁడు వ్యాధిగ్రస్తుం
డెవ్వఁ డుభయవిహ్వలాత్ముఁ♦డెవ్వం డధముం
డవ్వాఁ డచ్చటిదుర్గం
బువ్వులఁ బూజించి యిష్ట♦భోగములందున్. 27

వ. ఇన్నాలుగు నంతర్ద్వారంబులు. ఇంక బహిర్ద్వారంబుల ప్రకారం బాకర్ణింపుమని గోకర్ణకుండలుం డాకర్ణనవశంవదాశయుండగు కుశేశయాసనసూతి కిట్లనియె. 28

సీ. కలుకురక్కసుని నో♦క్కరుని జిక్కఁగఁ ద్రొక్కి
భద్రకాళిక యెందుఁ♦బ్రస్ఫురించు
నిం దుండువిధమున♦నెంకు నే వసియింతు
నలలేక కోటీశ్వ♦రాహ్వయమునఁ
బ్రవహించు నెందు స♦భ్రంకషోర్ములఁ బుణ్య
జలయునుజలధి యో♦షామతల్లి
నతజగత్త్రితయ శ్రీ♦నారాయణీ దేవి
వర్తించు నెందేని♦వార్తకెక్క
గీ. యట్టి యట్టాలతోరణ♦హట్టకుట్టి
మస్ఫురద్గోపురై డూక♦మణిమయోరు

హర్మ్యరమ్యంబు కరవీర♦మనుపురంబు
పశ్చిమద్వారమగుజగ♦త్పతినగరికి. 29

తే. క్షోణిఁ గృష్ణానదీతీర♦శూర్పలాఖ్య
తీర్థరాజాధివాసినై♦తీర్థచరణ
ధామమణిసౌధదక్షిణ♦ద్వార మేను
జాగరూకతఁ బాలింతు♦యోగివర్య!. 30

శా. గర్వోద్రిక్తతరంగసంఘములవీఁ♦కన్ బుష్కరిణ్యాపగా
వార్వేఁ ఖల్ దనయుత్తరంపుదెసఁ బ♦ర్వంగా గదాపాణినై
సర్వాలంకృతశాలినై వెలయుఁ గం♦సధ్వంసనాగారరా
ట్పూర్వద్వారమునంద్రివిక్రముఁడునై♦పొంగన్ బయోదచ్ఛవిన్.

క. కరనఖరదళితరక్షః
పరివృఢవక్షోరుణాంబు♦పరిచితదీప్త
త్స్ఫురు కేసరదోహదుఁడగు
నరకేసరి యుత్తరంబు♦నగవనిఁ గాచున్. 32

క. లో నాలుగు వెలి నాలుగు
నైన మహాద్వారభూము♦లపవర్గశ్రీ
నీనఁగ నీ వగ రాద్ధరు
శ్రీనగరగణిత విభూతిఁ♦జెందు మునీంద్రా!. 33

వ. అని మఱియు నక్కఱియవేల్పు ననల్పగుణప్రకటనపరుండై హ
రుం డిట్లనియె. 34

చ. అభిముఖతత్త్వశాలి సుకృ♦తాఢ్యుఁడునౌ చతురాస్యమానస
ప్రభవుఁడు శిష్యసంఘము ల♦పారముగొల్వఁగఁ దొల్లి యొక్కనా
డిభపురనాథుఁ గౌరవకు♦లేశ్వరు ధర్మజుఁ గానఁ బోవ భూ
విభుఁ డత డాతనిం దెలిచె♦వేయివిధంబుల సాధుపూజలన్. 35

క. అహితాహితకారణవి
గ్రహులును సదను గ్రహాప్ర♦గల్భులు నగు నా
గహన గృహావాసచర్యా
మహితతపోధనులనంగ♦మము పొగ డొందన్. 36

ఉ. తమ్ములుఁ దానునప్పుడుపృ♦థాప్రథమాత్మజుఁ డంతరంగముల్
గ్రమ్మినశోకవహ్నిహతిఁ♦గందుచుఁ గేలు మొగిడ్చి బ్రహ్మచి
త్తమ్మునఁగల్గునంయమివ♦తంసముఁ బల్కె ఖరాంశుతాపత
ప్తమ్మగు తేనియం జినుకు♦తమ్ములఁబోల సబాష్పనేత్రముల్.

క. ఏ భీరువనై వేఁడెద
నో భద్రవ్రత! ప్రసాద♦మొనఁగుము నాకున్
మీభావంబునఁబొడమని
దీభువనత్రయమునందు♦నింతయుఁ గలదే?. 38

శా. చింతాకంతయు వెన్కదియ్యక కురు♦క్షేత్రంబునం దాపసం
క్రాంతస్వాంతుఁడనై సుహృత్సుతపితృ♦భ్రాతాదులంజంపి యు
త్యంతద్రోహమొనర్చియుం దిరిగెదన్♦బ్రాణంబుతో మత్సముం
డంతర్వాణివతంస! యెవ్వఁడు గలం♦డాహా! వితర్కింపఁగన్.

క. వంగడపు వెదురుఁ గోపవు
టంగలమున నేర్చి కనిన♦యీసిరి నిందా
సంగతిఁ బొగచూరెను ద
ద్భంగురమౌక్తికము దీనఁ♦బసిమియుఁ గలదే!. 40

మ. అసిధారావధితాత్మబంధుభుజమ♦ధ్యస్వైరనిర్యద్వసా
మనస్రై పుట్టినయమ్మహాదురితముల్♦మన్నొట్టియున్ వాజిమే
ధసమిద్ధానలభూతిచే నుసిమియున్♦దప్పింపలేనైతి నీ
కన చెప్పాటఁదొలంగు నెట్టులగుదున్♦గల్యాణకల్యాత్ముఁడన్.

క. కర్మము కర్మాంతరహ
త్కర్మత మగు దానిఁబూనఁ గానము నిరయాం
తర్మజ్ఞానాభిముఖు నీ
దుర్మదుఁ బడనీక నిలుపు ద్రుహిణసంభవా! 42

క. మావంటివారలకుఁ బా
పావిలదృక్కులకు ధర్మ మారయని యస
ద్భావులకు భవాదృశులగు
శ్రీవైష్ణవవరులె దిక్కు చిత్పూర్ణమతీ! 43

సీ. అని యుధిష్ఠిరుఁడు పల్కిన సనందనుఁ డాత్మ
నలరి యిట్లను నమ్మహాత్ముతోడ
నీపాల శాంబరీగోపాలుఁడు గలాఁడు
పరమవైష్ణవధర్మపరత మెలఁగు
నీమోము గనుఁగొన్న నిఖిలాఘములుఁ బోవు
సెకదాఁకి యడఁగుతూలికలలీల
హరిభక్తియను గంగ కడ్డమే? కలుషపు
టిసుక చేఁగట్టిన యనదుఁ గట్ట
గీ. దురితరాశిమునింగి శ్రీవరునిభటుఁడు
తోయపద్మదళచ్ఛాయఁ బూయఁబడఁడు
రేయుఁబగలు వృథా చింత సేయునీవు
ప్రాకృతుండవె! భూలోకపాలవినుత! 44

ఉ. కర్తవుగావు హర్తవును గావభిరక్షివిగావు నీవు ప
త్కీర్తిధురీణ! యింతకును గృష్ణుఁడె మూలముగాన పుణ్యవిత్త
స్ఫూర్తియుఁ బాపవైకృతముఁ బూరుషుఁ బొందునె? యస్వతంత్ర
వర్తిలుచున్కిఁ ద్రష్టువకు వచ్చునె? పాకగుణాగుణావలుల్. 45

క. పరులకతంబున నేనియు
హరి నొకమరి దలఁప భద్ర♦మగుఖలులకుఁద
న్నిరతస్మరణాచరణ
స్ఫురణాఢ్యులు నిత్యపదవిఁ♦బొందుటయరుదే?. 46

తే. ధారుణీవల్లభులకం బెఁ♦దక్కుచోట
నశ్వమేధంబు నిష్ఫలం♦బగువిధమున
నర్థవంతంబుగాదు సత్యాకళతుఁ
సేవ కిలఁ బూనిసేయుపా♦చితముశతము. 47

క. భ్రాతృవధపితృవధాదుల
పాతకములు రావు విష్ణు♦పదభక్తులకున్
దైతేయసూను లిరువుర
యేతద్వ్యవహారసాక్షు♦లిభపురనాథా!. 48

శా. ఆకంసారిపరిశంస నీమదిసుదీ♦ర్ఘావిష్కృతిం దాల్పఁ జె
ల్లా కంపించి తొలంగుఁగాక నినుడా♦యర్ఘ నేర్చునే? పాతకా
నీకంబుల్ రవిఁ గప్పుచీఁకటుల నెం♦దేఁ గంటిమే? వింటిమే?
కామ్రాకాంతాధిప! లోకసంగ్రహమనీ♦షం జేసి తీపరిశ్నముల్. 49

క. అటులేనియుఁ జెప్పెద నీ
పాటిపాటితలపోఁతలెల్లఁ♦బోవ వడువు మా
రట ముడుగు నెమ్మనము నొ
క్కటిగా నొనరించి గట్టిగా విను మహిపా!. 49

సీ. తలఁపిమ్ము నేదేవు♦తనువునం దఖిలాండ
ములు పయోనిధిభంగ♦విలసనముల
నేదేవుమహిమకు♦నింతయు దంతింద్రి
పదమగ్నతదితర♦పదవహాన

ఈదేవునిజమాయ • నెవ్వాఁడు గడచన
నేరఁడు తన మేని • నీడపోలె
నేదేవుఁ డింతకు • నింతయై యంతకు
నంతయై గుఱి లేక • యతిశయిల్లు
గీ. నాజగత్కర్త దుష్టసం • హారణబుద్ధి
విట్ఠలుండన ధరనుద్భ • వించి క్షేత్రి
పాలుఁడును బుండరీకుండు • బలసి కొలువ
నుండు తీరంబునకు నేగు • ముదయకాంక్ష. 51

క. ఏగి మహానదివారిం
దోఁగి హరిం గొలువు నిఖల • దురిత శ్రేణుల్
కాఁగినయును మాఱిషమని
మూఁగికొనిన మక్షికాస • మూహంబులగున్. 52

తే. బ్రాహ్మణునిఁ దల్లిఁ దండ్రిని • భ్రాతదాత
గురుజనంబుల హింసించి • క్రూరుఁడైన
శిశుపానాభిరతుఁడు దు • శ్శీలుఁడైన
పాండురంగాధిపతిఁ గాంచి • పరమునొందు. 53

క. నావిని ధౌమ్యాదిమహీ
దైవతములుఁ దమ్ముఁగమియుఁ • దనుఁ గొలువఁగ శో
కావహమతి భవదగ్రజు
దీవనగొని చనియె నయ్యు • ధిష్ఠిరుఁడెలమిన్. 54

ఉ. ఆకుముదాప్తవంశవిభుఁ • డంతఁ గనుంగొనియెన్ వసుంధరా
నాకము నాకుపాకశుక • నానశుకాదికసన్మునిస్తుత
శ్లోకము శోకకర్దమవి • శోషణశ్లోకహితప్రభాస ము
త్సేకముఁ దాపవహ్నిజల • శీకరసేకముఁ బౌండరీకమున్. 55

లయగ్రాహి.

కంబువు నరాళిచికురంబులుఁ గటీకృతకరాంబురుహయుగ్మ
మళికాంబకము నగ్న
త్వంబుఁ బసి రొప్పవెదురుం బెరుగునుద్ధపాదలుం బదము
లం బలుకుచుంబాదలు మువ్వల్
జంబుఫలజిద్రుచిభరంబు మకరాకృతిం గరం బమరుగుండల
ములుం బరఁగఁ బంచా
బ్దంబులఁదలిర్చు నిసువుం బతి భజించెఁద్రిజగంబులకు రోహ
ణ నగంబగు నగణ్యున్. 56

క. పుష్కరిణిఁ దీక్షమాడియుఁ
బుష్కరదళనయనుమూర్తిఁ బూజించియు నా
విష్కృతశుభోన్నతియు నతి
నిష్కల్మషమతియు నయ్యెనృపతి మునిపతీ!. 57

క. దానంబునఁ బితృగురు సఖ
దానంబున్నైన కీడుదలఁగి హరికృపా
దానంబు నందెఁ గురుపతి
దానం బునరుద్భవంబుదానికిఁ గలదే!. 58

తే. ఆయతీంద్రుండు ఋత్విజుండయ్యె వేది
యయ్యె శ్రీపౌండరీక మహాస్థలంబు
పాపపశువుల విశసించి భక్తి చరువుఁ
బాండురంగాగ్నిలో వేల్చెఁ బాండవునకు. 59

వ. ఇవ్విధంబున నవ్విభువంశవతంసంబు కంసమర్దన సాక్షాత్కార
దర్శనంబు నాపాదించుటఁ గృతార్థుండై పౌండరీకవాస్తవ్యులగు
పుండరీకాది విద్వత్పుండరీకంబుల నొండొండఁ గీర్తించుచుం
బ్రవర్తించి కతిపయదివసపరిచారుండై యచ్చటనుండి నిజాను

జద్విజసనాథంబుగా గజపురంబునకుం జనుదెంచి సుఖంబుండె
నట్లగుటం జేసి. 60

క. అదియె మహాఫలమని తన
హృదయంబునఁ బౌండరీక • మెవ్వఁ డెఱుఁగఁ డా
మెదుక చనునిదియు ముక్తి
ప్రదమని పెరతీర్థమునకు • బహునిగమనిధీ!. 61

క. వాలినదప్పి వియజ్జర
కాలంబున నయ్యెద ప్రవ్వ • కుమతి గలిగినన్,
శ్రీలలనావిభుఁ డుండని
నేలయు క్షేత్రమని యరుగు • నీచుఁడు గలుగున్. 62

చ. మనసమునందునైనఁ బుర • మార్గమునంబడినైన నింటనై
న సకలగర్త్తస్థలము • నం ప్లవగేహమునందునైన నా
కసమున నీట నేలపయిఁ • గంకటిమీఁదనునైన మానవుం
డసువులఁ బాసి నిష్కలుషుఁడై • హరి దానగు నమ్మహాస్థలిన్.

క. విను పతితుఁడైనఁ గానీ
చని తత్క్షేత్రంబునందుఁ • జానోపి పున
ర్జననంబు గనఁడు గావున
జనులకు నాస్థలమునందుఁ • జనుదనువూడన్. 64

ఉ. అది భృదుత్తరాశ శత • హస్తమితావని నున్నవాఁడు బో
ధిదుమమూర్తియై నృహరి • తీర్థనివాసులఁ గాచుఁ పూర్ణి నో
ఛద్విచార! యాభువన • భర్తకు నుత్తరభాగ మూఁధి య
త్యాద సుఖోన్నతిన్ వెలయుఁ • గుండలతీర్థము తీర్థరాజమై. 65

క. వెండిఁ దనతోడుగు మణిమయ
కుండలయుగ మచటదాఁచెఁ • గోండగొడుగుగా

నుండునతఁ డనఁగఁ దద్గుణ
కుండలపరిపూర్ణకర్ణ • కుహరుఁడు నగుచున్. 66

సీ. ఆకుండలాఖ్య తీ • ర్థాంబుధారలనాడి
నరకేసరి భజించు • నరుఁడు రాజ
సూయఫలంబొందుఁ • జూవె యావేలుపు
టులికఁ జుట్టిరా • నేనుచేతు
లవెడల్పు నేల వా • లాయంబుగాఁగస
పూడ్చి యల్కి భుజించు • చున్నజనుల
చేతఁ బూజలుగొను • పూతనాభూతసా
రీహర్త బహుజన • శ్రేణులందు

గీ. వారు ముక్తులు ధర జీవ • వంతులయ్యు
వారిపితరులు తృప్తులై • వఱలువారు
వారు చరియించుచున్నయు • ర్వరయ తెల్ల
దీవి వారలపలుకులు • దేవకథలు. 67

తే. అన్నృకేసరి భజియింతు • రమరకన్య
లెన్నఁ బెక్కండ్రు హారతు • లిచ్చియిచ్చి
వారిఁ గొల్వక గర్వించు • వారుక్షేత్ర
మండలమున సుఖస్థితి • నుండలేరు. 68

ఉ. ఆనరసింహుమోల మ్రొతు • లై కులకోటిసమన్వితంబుగా
మానవు లూర్ధ్వలోకసుఖ • మగ్నతఁ జొక్కుదు రెల్లకాలమున్
దానికి గర్విమైన యయు • తప్రియపుత్రుఁడె సాక్షి యచ్చటన్
గాని తెలుంగులన్ మెలఁగు • కష్టమతుల్ నిరయైకసంగతుల్. 69

ఉ. పంకజపత్రనేత్రునకుఁ • బశ్చిమదిక్కున నుండునానవం
త్పంకమహాసనాద్యమర • శాల మలోలము పద్మతీర్థ మా

వంకవి దూర! కేలఁగల♦పద్మము నచ్చట దాఁచినాఁడు చ
క్రాంకుఁడు మున్ త్రిదంష్ట్రమను♦జాశననాశన హేతుకంబుగన్.

క. ఆతీర్థతనువునకు ల
క్ష్మీతరుణీవల్లభుండు♦జీవము వృజినో
పేతుఁడు ననవధినవనో
ద్భూతఫలం బందు నందు♦బొంది విడిచినన్. 71

ఉ. పాపదురాపరూపమగు♦పద్మసమాహ్వయతీర్థమాళి నీ
రే పురుషుండు గోలినొకయించుక యెన్నఁడు నేని వానికిన్
బాపము లభ్రపుష్పములు♦బంధనముల్ శశశాబశృంగముల్
తాపవికారముల్ మరుజ♦లంబులు పుట్టువు లశ్మతైలముల్. 72

క. ఒకఁడు సుశర్మాఖ్యుఁడు ఘా
తుకుఁడు గలఁడు కల్లుద్రాగుఁ♦డునుము ధరామ
ర్త్యకులుల నఱదలఁచుం గురు
నకుఁ గనకముదొంగిలు దినది♦నము నజపుత్రా!. 73

క. ఆవృషలీపతి యావ
జ్జీవంబుగ నంతనంతఁ♦జేసిన నానాం
హోవివరంబులు పటమునఁ
గోవలు వడ వ్రాసి చిత్ర♦గుప్తుఁడు దాఁచెన్. 74

శా. ఆనీచుం డొకనాఁడు వాఁడిమిఁ జతు♦ర్వ్యాధాన్వితుండై పెనుం
గానం దెర్వులుగట్టి యేగుపరిజలం♦గిట్టిండియై దోఁచిఁ నీ
రానన్ రోయుచునుండి దప్పిగొని మ♦ధ్యాహ్నాత పాపాతజ
గ్లానిం దత్సమయార్తకాసరమఁ బో♦లంజూచి యాదిక్కునన్.

ఆ. వె. అంతఁ గొంతకాల♦మరుగంగ మృత్యుగో
చరతఁనున్నయాసు♦శర్మకడకు

లిఖితతత్కృతాఘ౹లిపియైన పటముఁ దె
ప్పించి చిత్రగుప్తుఁ ౹డెంచిచూచి. 76

క. దురితశతకోటులం ద
క్షరమొకటియుఁ గానలేక౹కంపవికృతిభం
గురతాయుతుఁడై జముకడ
కరిగి తగం బలుక నతఁడు౹ప్రాంజలి యగుచున్. 77

ఉ. దక్కఁగవ్రాసితి న్మను పఁటమ్మునయందు సుశర్మపాపముల్
లెక్క యెఱుంగరాదు లవ౹లేశము దానికి నట్టివ్రాఁతయం
దక్కజ మిప్పుడొక్కటియు౹నక్షరరూపము లేదు దేవ! నేఁ
డక్కడితంబుఁ గట్టి యిడి౹నట్టులయున్నది కప్పుదేఱుచున్. 78

ఆ. వె. హతలతాంతమైన౹యారామమునుబోలె
విగతతారమైన౹విన్నుఁ బోలె
గళితవర్ణమగుటఁ౹గళితంబు దీనికి
మీఱె తెలియవలయుఁ౹గారణంబు. 79

క. అని పల్కు నమ్మహామతిఁ
గని జముఁ డిట్లనియె నీవు౹కవిలియ నీవ్రా
సినలిపి యున్నదొ లేదో
కనుఁగొను మీసారి లెస్స౹గా గణకవరా!. 80

ఆ. వె. అనుడు నట్లకాక౹యని చిత్రగుప్తుండు
దండధరుని యాజ్ఞ౹వెంశినేగి
పటము ప్రిత్రిపుటంబుఁ౹బరికించి యందు నీ
క్షించెఁ జక్రపాణి౹చేతివ్రాఁత. 81

ఉ. ఈతఁడుపద్మతీర్థమున౹కేగి యొకనొకనాఁడు తత్పయో
ధౌతనిజాంగుఁడై చనుక౹తంబున విప్రవధాదిపాతక

వ్రాతముఁ దొంటిపుట్టువులఁ♦బ్రాప్తములై నయఘంబులున్ మఱు
ద్ధూతఘనాఘనావలుల♦తో సరియై సరిపోయె నన్నియున్. 82

క. అనుసర్ధంబులు గలిపిఁ
గని సని జముఁబల్కు నతఁడు♦గానఁబడదు నే
మునువ్రాసినయది యన్యము
కనుపట్టెడు నేలిఖితమొ♦కాని వినఁదగున్. 83

సీ. అని యొప్పుకౌతుక♦జనకాక్షరశ్రేణి
వీక్షించి నచ్చితి♦విద్వదింద్ర!
యిది మీరలెఱిఁగింపుఁ♦జేనాట సకృదవ
గాహనంబున మహా♦కలుషరాశి
వలనఁ బూయుషుఁ జేరఁ♦దలఁగు పుణ్యపుఁదీర్థ
మేన్నఁడు గన విన♦నీమదుక్త
లిపిపఙ్క్తి నేకవా♦రపయోభిమజ్జన
మాత్రచే నణఁచిన♦మహిమ గలుగు
గీ. దివ్యతీర్థంబు వైభవ♦మవ్యయప్రి
సాదమేదురమానసో♦జ్జ్వల్యకల్య
వచనరచనల వివరింప♦వలయు నప్రి
పన్నదైత్యలతాలాత్ర!♦భానుపుత్ర! 84

వ. అనిన నప్పద్మమిత్రపుత్రుండు చిత్రగుప్తున కిట్లనియె. 85

శా. ప్రాశస్త్యంబువహించుదండకమహా♦రణ్యంబు పుణ్యార్థిపం
చాశత్కోటివిశాలభూమి ఖలము♦ష్ప్రిపప్రభావోదయ
శ్రీశుద్ధుల్ గను దాని గౌతమి గుణో♦త్సేకంబు కల్మిన్ హృషీ
కేశావాసము పౌండకీకనిలయం♦బీరెంటి గెల్పుం దుదిన్. 86

సీ. అర్కుండు మెలఁగుట♦యనిలుండు వీచుట
యింద్రుండు వర్షించు♦టిల జలముల

మునుఁగక తిరమాట • యును నెసంగు విష్ణు
నాజ్ఞాస్థిచే నెవ్వఁ • డఖిలజగము
బ్రహ్మయై సృజియించుఁ • బద్మాక్షుఁడై ప్రోచు
మదనారియై తుంచు • మత్స్యభృతుల
లోకపాలకుల నే • లోకేశుకరుణాక
టాక్షంబె యనైకృతి • యందునిలుపు
గీ. నావిభుం డెందునుండు మ • ర్త్యమునఁబుట్టి
భూతకోటి నను గ్రహం • బునఁ బెనుపుచు
నెందు గుంకి సుశర్మయుఁ • జెందె ముక్తి
దాని కెనవచ్చుతీర్థ మీ • ధరణిఁ గలదె?. 87

వ. అని పద్మతీర్థంబు తీర్థచరణవిహారణ చరితార్థంబగుదాని నానా గుణంబులు నగణితప్రభావంబులని కొనియాడి. 88

క. పెనుఁగృప సుశర్మఁ గనుఁగొని
తనువు నిమిరి యాదరించి • దండధరుఁడు చం
దురినిలీలఁ జల్లనగుచం
దన భూషణ వసన మాల్య • తర్పితుఁ జేసెన్. 89

క. ఈగతిఁ గృతాంతుకృపగని
సాగి చనియె నతఁడుగగన • చరయానమునన్
నాగ నర యక్ష సురప్ను
న్నాగానీకములుగొలువ • నాకంబునకున్. 90

మ. అమరాధీశుఁడు గౌరవంబెసఁగఁద • న్నర్ధాసనాసీనుఁజే
య మరుద్భోగములెల్లఁగాంచిధరయం • దగ్ర్యన్వయోద్భూతుఁడై
కమలావల్లభుఁ బౌండరీకపతి సా • క్షాద్బ్రహ్మముంగొల్చి ని
త్యముఁ దన్మందిరాడలంకృతియె చే • యం జాల నేర్చెన్ ధృతిన్.

శా. ఆపంచత్వముగాఁగ నిట్లు హరిగేహక్షోణిసమార్జనం
బాపాదింప ఘటిల్లుపుణ్యమునఁ జంద్రావాసముం జొచ్చి హా
ర్షాపూర్ణస్థితిఁ బెక్కుభోగములఁ బెక్కబ్దావళుల్ గాంచి ధా
త్రీపాలోత్తముఁడై సుకీర్తియన నుర్విం బెంపునం బుట్టుచున్.

క. అతఁ డధికభక్తితో నా
యతకీర్తిస్ఫూర్తి యై వెలసి జగ
త్పతి నుచితపూజనంబులఁ
బ్రతిఘనము దెలఁచు భక్తపరతంత్రుండై. 93

ఆ. వె. అతఁడు సన్యసించె నఖిలభోగంబులు
నిండువయసునాఁడ యుండియుండి
నందనందనాంఘ్రినాళీకసేవోప
యోగరాగభోగ మొకటిదక్క. 94

సీ. నిలువున నొలిపించె విలువంగడమునెల్ల
శరములయాయంబుఁ బారయు టుడిపెఁ
దగశబ్దమాత్రపాత్రము చేసె గుణలత
మ్రాఁకునఁ గట్టించె మౌలబలముఁ
గంచుకివశము గావించె సేనానాథుఁ
గట్టించె సహచరుఁ గటికియెండఁ
బ్రతిపక్షభావసంగతుఁ డనిహింతుఁ జూచె
వరకేతనముకీర్తిభరము డులిపె

గీ. ధర్మనిర్మలబుద్ధి సుశర్మఁ గదిసి
గెలువఁగాలేక చని కోపగించి మదనుఁ
డురక తనవారలతనికి నోడుమనిరె
పతికిఁ గీడౌట బంట్లపాపంబు గాదె! 95

క. ఆ రాజర్షి పదంపడి
క్షీరోదన్యాయమున వి॥చిత్రగతిఁ ల
క్ష్మీరమణుఁ గలసి యేకా
కారంబున నలరె ముజ్జ॥గంబులు వొగడన్. 96

క. విను మఖిలదురితకులభం
జనమజ్జన మమృతనిధివ॥శంబగుటకుఁ గా
వున సర్వజనోపాస్యం
బనూన మత్తీర్థరాజ॥మనుపమ మనఘా!. 97

ఉ. భూరిసుఖానుషంగములు॥పూరుషుఁ బొందవు సోమపానకై
దారజలోపయోగములు॥తత్కలనం బన రెక్క నెత్తికిన్
బేరు శిలాకృతుల్ జరర॥పేటిక కత్తెవులేల? యెందు నె
వ్వారికిఁ బద్మతీర్థపతి॥వారికిఁ జేరినఁ గల్గుసౌఖ్యముల్. 98

చ. కృతమున నేకదంష్ట్రుఁడయి॥క్రీడయొనర్చుచుఁ ద్రేత దంష్ట్రికా
ద్వితయముచే వెలుంగుచు మ॥దించి త్రిదంష్ట్రలతోడ ద్వాపరం
బుతఱిఁ జరించునొక్కదిశ॥పుత్రుఁడు వృత్రుఁడు వానిఁబోలఁ డ
ద్భుత జనకప్రతాపమున॥భూరిబలంబున మాయ పెంపునన్. 99

క. ‘‘ఆ హరిహయారి పార్ష్ణి
గ్రాహి యన హిరణ్యకశిపు॥గాదిలిసుతుఁడై
బాహాబలశిఖిఁ ద్రిజగ
ద్దాహం బొనరించె నేక॥దంష్ట్రయుఁ దానున్. 100

క. ఆయొంటిపంటివేలుపు
దాయం బొలియించె నృహరి॥దంభోళికిటు
చ్ఛాయలనూయలలూఁపు న .
ఖాయుధముల వఱదుఁజీరు॥వ్యాఘ్రముఁబోలెన్: 101

ఉ. వెండియు రావణాఖ్యఁ బ్రభవించెఁ ద్రిలోకహాలాహలాకృతిన్
మందుచు దంష్ట్రికాయుగమునం బెడఁగై యతికాయనామ మా
తండు ధరించి త్రేతఁ దలఁ దర్పఁ దనుగ్రనిశాటుఁ బట్టి వి
ష్ణుం డని రాముఁడై విలయసూర్యకరోగ్రశరాగ్రధారలన్.

ఉ. ఆపితబద్ధవైరమతి నంతటఁ బోవక వాఁడు వెండియున్
ద్వాపరవేళ నిద్ధరఁ ద్రిదంష్ట్రుఁడునా నుదయించి యాదిల
క్ష్మీపతిఁ బౌండ్రకవిభుఁ జేరి కనుంగొని పల్కి మిక్కిలిన్
గోపము పర్వఁగన్ గొలిమిఁ గూఁడుల యూఁదునఁ గన్నులుబ్బఁగన్.

ఉ. ఎక్కడ కేగుదెంచితి వహీనవిహార! చికిత్స నీకు నేఁ
జక్కనొనర్చెదన్ బెలుచఁ జంపితి దొంగిలి మున్ మదీయులన్
రక్కసులన్ నినుం బొదివి ప్రాణముఁ గొందుఁ గడంగి సాదవై
త్రుక్కఁడి యున్నఁ బోవిడువఁ దొల్లిఁటి త్రుళ్లికఁ జెల్లదిచ్చటన్

మ. అని సింహంబునకల్గునక్కక్రియ నిట్లాక్షేపముల్ పల్కి య
ద్దనుజుం డంతక దండ భీషణగదాదండంబునన్ వ్రేయ వం
చనఁ దూలించెఁ దదుగ్రసాధనముఁ గంసధ్వంసి తద్ఘోరతా
డనవేగంబున భగ్నమయ్యె కటివేల్లత్క్షుల్లకాశిక్యముల్. 105

శా. అత్తార్క్ష్యధ్వజుఁ డప్పు డాగ్రహసహస్యగ్రాత్ముఁడై దానవున్
మొత్తెన్ మొత్తనివీఁక దక్షిణకరాంభోజంబునం దాన న
మ్మత్తుండున్ గడతేఱె నెత్తురులుగ్రమ్మన్ ముక్కునన్ వాతఁ బెన్
మొత్తంబుల్ గొని ప్రస్తుతించిరమరుల్ మోదించి దామోదరున్.

క. ఆమెడ మదిక్కు చిక్కం
బో యతివర! కానవచ్చె యున్నదిభగ్నం
బై యిపుడు మంత్రివర్ణ
శ్రీయుతవక్షస్స్థలునకు జితదనుజునకున్. 107

ఉ. ఆకమలేక్షణుండు తన♦యక్కున దాల్చినసిద్ధమంత్రముల్
నాకెఱిఁగించినాఁడు మును♦నాయెడఁగల్గినకూర్మి పేర్మి నే
లోకమునందు నెవ్వరికి♦లోఁబడ నేరదు నాకె కాని త
ద్వ్యాకృతి నావుడుం బలుకు♦బాంజలియైయుతఁడిందుశేఖరుల్

చ. పశుపతి! మమ్ముఁబోలినప♦సన్నులపైఁ గృపచాలియున్కి త్వా
దృశులకు నైజమౌట వసు♦దేవతనూభవదత్తమంత్రముల్
విశదముగాఁగ నాకొసఁగ♦వే! నినువేఁడెద దాసఁజేసి దుః
ఖశరధిఁ ద్రెవ్వ నీదయ నఖండసు♦ఖస్ఫురణంబు నొందెదన్.

ఉ. నావిని శూలి పల్కు మని♦నాయక! యీమను వెందుఁ గోప్యమై
తా విలసిల్లు దీని దురి♦త ప్రవణాత్ములకున్ మురారిసే
వావిముఖప్రచారులకు♦వైష్ణవమార్గముగాని హీనవృం
దోర్వఁ జరించుసజ్జనవి♦రోధులకుం దగ దింత దెల్పఁగన్. 110

క. నీవు హరిభక్తియుతుఁడవు
గావున నాకెప్డుఁగూర్తు♦గావున విజ్ఞా
నావానపూర్ణబుద్ధివి
గావున వినిపింతు వినుము♦కలుషవిదూరా!. 111

శ్లో॥ స్వర్ణాద్యం సత్యనామాద్యం।షష్ఠషష్ఠం సదీర్ఘకమ్
షష్ఠం షష్ఠాదిసత్యాంతం।సమారంతం విదుర్బుధాః. 112

క. కృష్ణుఁడు ఋషిగాఁగ మహా
విష్ణుఁడు దేవతగఁ బ్రొల్చి♦వేమాఱులు త
న్నిష్ణాతబుద్ధిఁ బేర్కొను
వైష్ణవులకు నీమనువు ధ♦వస్థితి యొసఁగున్. 113

ఉ. ఎవ్వఁడు పౌండరీకమున♦కేగి మహానదిఁ దీర్థమాడి తా
నవ్విధులెల్లఁదీర్చి కమ♦లాక్షునకున్ బ్రణమిల్లి నూఱుమా

ర్లిన్వరమంత్ర మర్థిఁ బఠియించు నతం డఖిలాఘపంకముల్
దవ్వసనం గనంగలఁడు తత్త్వమహత్త్వము సత్వరంబుగన్.

క. విధివంతంబుగ విధుస
న్నిధి నిచ్చలు నేఁ బఠింతు నిఖిలభవతమో
వధవిధివిధువగు దీనిన్
విధినందన! తత్ప్రసాదవిభవాపేక్షన్. 115

వ. సిద్ధేశ్వరాహ్వయంబున సిద్ధలింగంబనై యెందేని నేనుండుదునా దక్షిణద్వారంబు నధిష్ఠించి యీమంత్రంబు ననుష్ఠించునిష్ఠాగరిష్ఠులకు నిస్తార్థసిద్ధి కరతలస్ఫటికఘుటికయగుట నిగమార్థంబూ తొల్లి తీర్థయాత్రాచరణనిపుణుండగు నీలాంబరుండు నిఖిలతీర్థంబులను దర్శించుచుఁ బౌండరీకంబుసొత్తెంచి యుత్తుంగతరంగడోలారూఢకలహంసకుల కలకలారావఘుమఘుమిత బ్రహ్మాండకుహరక్రోడంబగు భీమరథి నీరంబునం గృతస్నానుండై యున్నాన మహిమాభిరామంబగువాక్షేత్రంబునం గలవిచిత్రంబులు నేత్రప్రీణనంబుగా నాచరించుచు నచ్చోట సాక్షరుండగు పుండరీకాక్షు నీక్షించి వెఱఁగంది తదక్షరలక్షణంబు నెఱుఁగ నేరక యూరకుండె నంతయు నయ్యేకకుండలుండు చపలకారితనంబున నవ్వర్ణంబులు నిర్ణయింపనుద్యుక్తుండై. 116

మ. కరముల్ మీఁకిసాఁచి యూరుపులుబిగ్గంబట్టి యంతన్ రిపూ
త్కరముం బోవనదల్చి యట్టితఱిఁ బద్మంబట్లు మో మొప్పఁగాఁ
జరణాంగుష్ఠనఖానలంబనముతోఁ జండాంశుఁ గన్గొంచు భా
స్వరనిష్ఠం దపమాచరించెనొకమాసం బన్నవర్జ్యంబుగన్. 117

తే. దానఁ బ్రియమంది దానవధ్వంసి యొసఁగెఁ
గూర్మి యన్నకు ధర్మైకనిర్మలునకు

నమ్మహామంత్ర మాత్రండు•నంతనా
యదియ జపియింపఁదొణఁగె గా• ... ప్రోలె. 118

క. భూరిగుణరత్నరాశిఁ గు
మారుఁగనుంగొనఁగఁ దివురు•మమకారము లో
నారసి యొసంగె మున్నా
నీరజనాభుండు రుక్మి•ణికి నీమనువున్. 119

క. జపియించె నేనుదివసము
లుపవానపురస్సరముగ•నుగ్రలి నిష్ఠా
నిపుణమతిం బతిచే నిటు
లుపదిష్టంబైన మంత్ర•ముత్సుక మొదవన్. 120

ఉ. విన్ము మదీయనేత్రశిఖి•వేగమునన్ జముఁగూడఁ జన్న య
మ్మన్మథుఁ డిందుబింబసుకు•మారుఁడు భోజతనూజయందుఁ బు
ట్టె నమ్మథువైరిదెల్పినక•డిందిజపంబునెపంబునన్ బున
ర్జన్మమునొందె రాగరస•సంపద పెంపుయువద్వయీమతిన్. 121

సీ. ‘‘బలభిదారామసం•భవలతాంత శ్రేణి
బన్నుము నాకొక్క•చిన్నితేరు
కాళికెంగేని చి•లుకలరాజుఁ గొని తెచ్చి
నా వెంటఁబడివాగె•నడవఁబనుపు
గగనచరదాశి•గణవత్రిమకరంబు
బిరుదటెక్కెముగ వే•గిరమొనర్పు
మదనగోపాలుండు•మాతండ్రి చేనాకుఁ
జెఱకుచే మలిపించు•కఱకువిల్లు
గీ. వనజహితు వేఁడి తమ్మితూ•పునకుఁ దెమ్ము
దివ్యములఁగాని సాధింపఁ•దీర దీశు

నంబ! నీ""వంచు రుక్మిణి • నట్టునిట్టుఁ
దిరుగు శైశవచాపలా • ర్ద్రితుఁడు మరుఁడు. 122

చ. వలుచని లేఁత కెంజిగురు • బత్తళికం బెకలించి తేనియం
గొలిపిన బాన టంబుగల • క్రొవ్విరితూపుల నిక్షుచాపుఁ డే
గెలు పొనఁగూర్చె నాగెలుపు • కృష్ణునిపట్టపుదేవి రుక్మిణీ
లలన జపించు మంత్రము బ • లంబున నైన దిగా నెఱుంగుమీ. 123

క. సరసిజభవ భవ వాయు
స్ఫురితములై త్రిపురదహన • ములు త్రిజగముల్
బురికొని నీరసయవసాం
కురసఖముగ నేర్చె మున్న • కుంఠితశక్తిన్. 124

సీ. పెనుఁగంపతోడుగులీ • ఢ్చిన మొల్క-ససియయ్యె
గగనంబుతో రాయు • కాననములు
కడులావుమానిసి • కాళ్ళ రాచినచీమ
చాలయ్యెఁ బశ్వాది • జంతుపఙ్క్తి
బడెగండ్ల నొంటినై • బడినవిఘ్నేశవా
హములయ్యె హరిదంత • హస్తిపతులు
వనపాలు రదుసులోఁ • జనగుఱ్ఱుక్క-తాళీఫ
లాకృతులయ్యెఁ గు • లాచలములు

గీ. మృదులగోమయపిండస • మ్మిళితకార
వేల్లఫలబీజసమమైరి • వీక్ష్యప్రజలు
కమలసంభవ వరదాన • గర్వితాసు
రవరపట్టణనిర్భరా • క్రమణవిక్రమతి. 125

క. ఈకీతిఁ గొంతకాలము
కూ్రరగతిన్ పోఁకుమూఁక • కుడిదలయూళుల్

గారింపఁగ నేనంతట
వారింపఁగఁ గణఁగితిన్ భువనహితబుద్ధిన్. 126

చ. అపుడు పినాకముల్ పవని • భాస్త్రములుం గొని యే యఁబూనితత్
త్రిపురములొక్కటన్ నిటల • దృష్టికి లక్ష్యము చేయుచోట మ
ద్వపురుదితంబులై నశ్రిమ • వారికణంబులు డిగ్గజాతి యు
ర్విపయిఁగదుల్ వడిన్ దొఱఁగి • వెల్లువచూపి నదీత్వమొందుచున్.

క. మున్నేను మేననలఁదిన
పన్నిభసితంబు నణఁచి • శ్రమవారి కడున్
జెన్నెసఁగె మంచుమలసం
చున్నాచికొని ప్రవహించు • సురనదిపగిదిన్. 128

క. భీమాహ్వయమున వర్తిలు
నామేనం బుట్టువంది • నదియై వెలసెన్
భూమిన్ భైమియనందగి
భీమరథియనంగ మాఱు • పేరెసఁగంగన్. 129

శా. ఆభైమీనది విశ్వముల్ నిజకృపీ • టార్ద్రంబు గావించుచున్
శ్రీభామావిభుక్షేత్రమండలముడా • సెన్ డాసినన్ వీచిరే
ఖాభీలంబగు దాని పెంపుగని ము • న్నందుండుపాత్రుల్ మహా
క్షోభోద్విగ్నమనస్కులై పిలుచనా • క్రోశించుచున్ బెంపఱన్.

క. భూరిభయాన్వితులై చని
భైరవు మదరాగరుచికృ • పాపూరితదృ
క్కైరవుఁ బలుకుదు రమృతా
హారులు హరిఁ బలుకుక్రియఁ గృ • తాంజలులగుచున్. 131

ఉ. మిక్కుటమైనపంకముడ • మిన్నులగర్భముగాఁగఁ బొంగి నేఁ
డొక్కమహాస్రవంతి యిదే • యుత్తరదిక్కున క్షేత్రసీమపై

నిక్క లయూర్ధ్రి బోలె నిటు♦నిల్వఁగ నోపము నాగహార! మే
మెక్కడి కేగువార మిఁక♦నెద్ది తెఱంగిట మీఁద నావుడున్. 132

సీ. కాళరాత్రి స్తనాగ్రకృతావకాశమై
యురము వెల్మ్రిడి పూఁత♦యొప్పు వెనుప
శిథిలత్వ మొందిన♦చెంగావి జడముడి
చిలు కూడి నెలపువ్వు♦చెంపనంటఁ
గంకాళ మనుబుద్ధిఁ♦గరమున జందెంపుఁ
జిలువఁ బట్టిననది♦జలదరింప
“నెచ్చటఁ బ్రభవించె♦నేత్రెద్ది” యనిపల్కు
సరభసోక్తుల జగ♦జ్జంతులలుకఁ

గీ. బాణిపుటశీధుపాత్రంబుఁ♦బాఱవైచి
కుఱువుపై నున్న కిన్నర♦నుఱుకఁ ద్రోచి
యతిరహఃకేళి నుండియు♦నరుగుదెంచె
భూరిజయగౌరవుఁడు కాల♦భైరవుండు. 133

ఆ. వె. అరుగుదెంచి యమ్మ♦హానదీక్షించి
చేతులెత్తి బెట్టు♦చిట్టమిడిచి
ఘోరకోపవేగ♦ధీరోక్తులులియంగఁ
బలుకు నిట్లు క్షేత్ర♦పాలకుండు. 134

చ. నిలునిలు తుంగభంగ వగు♦నిన్నుఁ గనుంగొని సాధ్వసాతివి
హ్వలమతులైరి క్షేత్రతల♦వాసులు దానికిఁ గోపగించె నీ
వలమురి తాల్పు డింక నిటు♦వచ్చుటమానుము మచ్చకంటి! నా
నిలిచి నుతించు నన్నది వి♦నిశ్చితకార్యగతిన్ జగత్పతిన్. 135

సీ. జగదుద్భవస్థితి♦క్షయ హేతు వెవ్వఁ డా
దేవాది దేవుండు♦దిక్కు నాకు

గ్రాహనిగ్రహ మిరఁగి•కరిఁగాచె నెవ్వఁ డా
త్రిభువనాధీశుండు•దిక్కు నాకుఁ
దుదిపదంబునొసంగి•ధ్రువుఁగాచె నెవ్వఁ డా
దృఢనయామయమూర్తి•దిక్కు నాకు
ద్రౌపదిబన్నంబు•దలఁగించె నెవ్వఁ డా
దీనమందారుండు•దిక్కు నాకు

గీ. నెవ్వనిపదాబ్జమునజని•యించు జలము
మజ్జనకుఁ డైనశివుఁ డాత్మ•మౌళి నిలిపె
నమ్మహావిష్ణుఁ డాకృష్ణుఁ•డాగుణాఢ్యుఁ
దేవకీనందనుఁ డై యెందు•దిక్కు నాకు. 136

తే. శరణమవు గమ్మ మద్భయ•జ్వరము నుడుపు
భగ్నమతినైతి కుర్కుర•భగ్రకతన
నింక నెయ్యదిదిక్కు చ•క్రాంక! నన్నుఁ
బ్రోవుమని పల్కెఁ గృపఁబల్కె•దేవుఁ డేటి. 137

ఉ. రమ్మ గరమ్మ ద్రోచి మధు•రప్రియభాషిణి! నన్నుఁ గన్నమీ
దమ్మతియున్ భయమ్ముగల•దా? వల దాతురవృత్తిమన్నియో
గమ్మన నీపరిదేశమునఁ•గ్రిమ్మ నమజ్జనజన్మజాడ్యపా
శమ్ములఁ ద్రెంపు నింపు మని•శమ్ము శుభమ్ములుభూతకోటికిన్

క. అస్మత్క్షేత్రస్థితి భవ
భస్మాంగజ! గంగకతెఁ•బావనివగుచున్
భస్మీకరింపు లోకా
పస్మారపాపయదురిత•బాధాశతమున్. 139

చ. అని వనజాక్షుఁ డీకరణి• నానతియిచ్చినఁ దత్కృపారసం
బను పెనువాన నుబ్బినకి•యన్ రయమారఁగఁ దత్పరిదేశమున్

ధనువున నారియై నిగిడె•దానిశరంబు గరంబు దాఁకినన్
దునుఁగుఁ జిసుంగు వీఁగుఁ గడుఁ•దూలుజగజ్జనజన్మలక్ష్యముల్

క. ఎందుఁ బ్రవహించె నస్మ
న్నందన యత్తీర్థవిభువు•నరసింహాఖ్యం
జెంది యదునందనాత్మ
నందమగున్ బద్మగర్భ•నందన! వింటే.? 141

క. అదిమొదలుగను సరస్వతి
తుదగాఁగలతీర్థములకు•దొరయై నడుమన్
బొదలు ఋషివృషభసేవిత
పదుఁడగుహరి మెచ్చు తీర్థ•పతి మానిపతీ!.

క. సాక్షాత్కరించి పద్మద
ళాక్షుఁడు వేంచేసియునికి•న తీర్థకులా
ధ్యక్షము మసారతరళా
లక్షితముక్తావళీల•లంతిం బోలున్. 143

క. వెన్నుఁడు ప్రత్యక్షంబై
యున్నయెడకు దక్షిణాశ•నొకపులినతలం
బున్నది మిన్నదికడగను
నున్నది కన్నది శుభంబు•లొసఁగంబొసఁగన్. 144

ఆ. వె. ముందు నందగోపు•మందయందుఁ జరించు
రూపధన్య యోర్తు•గోపకన్య
విష్ణుభక్తము క్త•కృష్ణుఁడచ్చట నున్కి-
యెఱిఁగి యేగుదెంచె•నెలుకమించి. 145

క. విప్రవధూచితశుచివే
షపరిభితశరీరయయ్యె•జరిస్తని సా

భిప్రాయస్థితవికసిత
దీప్రనిజకపోలయుగుచు • దేవునిమ్రోలన్. 146

సీ. జలధరశ్యామకుం • తలకలాపమునకుఁ
బాటింపమియె నవ • ప్రసవకలన
దళితనీలోత్పల • దళచంచదక్షుల
కామిాలనంబె కాం • లాంజనంబు
కుంభికుంభస్థూల • కుచమండలికి జ్ఞాన
ముద్రాకరమె ముత్య • ములసరంబు
గగనసోదరవల • గ్నప్రదేశమున కో
డ్యాణబంధంబె యో • డ్డాణమిదుట
గీ. గాఁగఁ దపమాచరించున • క్కలువకంటి
యంగలతిక నిరాకల్ప • యయ్యు నమరె
శారదారంభవిమలాభ్ర • సరణికరణిఁ
బ్రకృతిమధురంబులకు వేష • రచన లేల?.

శా. లోకేశస్థితలోకవాసకృతి సా • లోక్యంబు నర్చింపఁ ల
క్ష్మీక్రాంతాంఘ్రియుగంబుఁ జేరుతమి సా • మీప్యంబు సద్భక్తిరా
ఢ్యాకారిందనరూపుగా నిలుపుటన్ • సారూప్యమున్ బుద్ధినా
కాకశ్శేఖరుఁ గూర్చియున్కి నతి సా • యుజ్యంబు నొందుంతుదిన్.

శా. స్నానానుక్రమవాసితాచలరుచి • సాంద్రాంబువుల్ ధ్యానసం
ధానాధీనవపుర్విలోకనునితాం • త పీత సారంగసం
తానంబుల్ మృదుపాదపల్లవతలో • ద్యత్కాంతిలాక్షాదుస
శ్రీనద్ధాచలతుంగశృంగములు మిం • చెందత్తపస్సంగముల్. 149

ఉ. ఆభగవంతుఁ డంతఁ గరు • ణార్ద్రమతిన్ నతిమ్రోల నిల్చె న
భ్రాభమదభ్రమభ్రమ మ • నంతము శాంతము కాంతివంత ము

క్షోభ మలోభ మప్రతిమ♦శోభనశోభియునైన మేనునా
నాభరణంబులంగుసుమ♦తామరభూజమునోజ రాజిలన్. 150

ఉ. ఆశరదిందుబింబసదృ♦శానన సూనశరాసకోటిసం
కాశు రమేశు రాగరస♦కశ్మలగాత్రియు స్రస్తనేత్రియున్
పేశలబంధకైశికయు♦భీతిముదశ్రునిపాతముఖ్యచే
ష్టాశబలత్వసక్తతను♦శంపయునై కనుమ్రింపు దాల్చుచున్.

తే. పృథులవిజ్ఞానరసపూర్ణ♦భృగుశుకాది
భావనాదీర్ఘికలయందుఁ♦బరిణమించు
జలజదళనేత్రుపాదాంబు♦జములు [illegible]ల
భీతమృగపోతలోచన♦బిగియఁబట్టె. 152

క. కరకలితనిజపదాబ్జయు
విరళతరత్రపయునైన♦విధుబింబముఖిన్
వరసంఛాదితఁ జేసెన్
గరుణాగుణహారి శౌరి♦కన్నుల నగుచున్. 153

సీ. తనుఁజూచి శిథిలబం♦ధశిరోజయగుటన
య్యతివకు ముక్తకే♦శాహ్వయంబు
దయచేసి తత్ప్రార్థి♦తములైన వరముల
నొసఁగి యప్పసిగాపు♦టసరబుద్ధి
చిఱుగుబ్బలాని త♦త్క్షేత్రరాజమునకు
నీశానదిక్కున♦నిరవుపఱిచె
వెన్నుఁడు తన సది♦(వేపల్లెలో రాక
తర్కించు దౌష్ట్యంబు♦దలఁచి నగుచు

గీ. దానికరములచేఁబిడి♦తంబులైన
పాండురంగేశుశ్రీపాద♦పల్లవముల

నంగుళీమధ్యతలరేఖ • లంటియుండు
గంగప్రవహించునీటిడొం • కలునుబోలె. 154

క. ఆముక్తకేశదర్శన
మామునికులసార్వభౌము • నొసఁగు న నేక
శ్రీమూర్తిదానఫల మాఁ
భామిని శ్రీమూర్తిగాఁగ • బాటింపఁదగున్. 155

తే. అనుడు వేలుపుదాపసి • యూసుశీల
పుత్రి లేచందమున మోక్ష • మునకుఁ జనిరి
ప్రియుతనందనుఁ డెవ్వఁడే • పగిదినతఁడు
నృహరికృపఁగాంచె ననఁ బల్కె • నీలగళుఁడు. 156

క. మునివర! విను మత్యద్భుత
జనకచరితమైన జనని • చనినపిదపఁ ద
త్తనయులు మురభిత్పదవ!
త్తనయులు గురువాక్యకరణ • తత్పరబుద్ధిన్. 157

శా. భైమీతీర్థనివాసు రానకుశలున్ • బద్మేక్షణున్ యాదవ
స్వామిన్ సామజవత్సలుం గొలిచి మై • శ్వర్యంబు నంబొల్చి వా
రామీఁదన్ సకళత్రపుత్రముగదీ • వ్యన్మూర్తులైత త్తనూ
గ్రామం బెక్కిరినావుడున్ మఱియునా • బ్రహ్మర్షి పల్కెన్ శివున్.

ఉ. హాళి మనంబునం బెరుగ • నాలయి బిడ్డయి బంటుబైదమై
మూలధనార్జనంబు నిలు • మ్ముంగిలిమై గళదఘ్నదర్పతన్
వాలినవారి కెట్టులపవర్గము • భర్గ! ముకుందుఁడిచ్చె నిం
కేల? కలాన మేల? జడ • లేల కమండలు వేల? దండమున్. 159

క. వారలటుగాక కారణ
పూరుషులై యట్టిపతికిఁ • బుట్టుటనొతుదిన్

జేరిరి గృహస్థులయ్యును
సారసదళనయను మేని • సాయుజ్యంబున్. 160

వ. అనిననాజగదీశ్వరుండు సురమునితో వెండియు నిట్లనియె. 161

ఉ. హారివిచార! నీవనిన • యట్ల పురాకృతపుణ్యసంపదన్
వారలకావహిల్లె ముని • వల్లభ! దుర్లభమయ్యు నయ్యమ
ర్త్యారివిదారిమేనఁ గలఁ • యంగలపూనిక వారి యేల! యె
వ్వారు గృహస్థధర్మదశ • పెట్టలు వారలసామ్యము న్గియున్.

సీ. పరిణతయగునింతి • ప్రతికూల గాదేని
తనయుండు తనయాజ్ఞ • దాఁటఁడేని
నిజసహోదరులు వి • నీతులై మనిరేని
కోడలోరుపుదక్కి • గొణఁగదేని
కూఁతు రీలువునంచుఁ • గొదవ చూపదయేని
ఋణమనుపాతకం • బెనయదేని
తేజోగరిమ పరా • ధీనతఁ జెడదేని
నిందాంధకారంబు • నెఱయదేని

గీ. న్యాయమున మొల్ల ములపెల్లు • డాయునేని
యతిథిసంతర్పణంబింట • నమరునేని
సముచితాచారమునుగొన • సాగునేని
కలదె? గృహమేధి ధర్మంబు • కంటె మేలు. 163

క. ఏనోహర మొక్కయుపా
ఖ్యానము గల చేతదస్థ • మదియును వినినన్
మానివర! నీమనంబున
నూనినజడ నుడుగుననుచు • నుగురిడు పలుకున్. 164

తే. వింధ్య మమరాది ప్రోటికి • వివిధతార
కములు మొలపూసలుగఁ బెరు • గ మదిఁదలఁచె

నెన్నఁ డటమున్ను కాశిలో♦నన్నుఁగొలిచి
ఘటజమగు తేజ మింపొందు♦నుటజమునను. 165

వ. అ స్త్రాభతపోధన భావవిజృంభితుండగు సకుంభసంభవునకును జ
సిష్ఠుశూర్ప్రిషా వికస్వరహృదయంబగు శిష్యసహస్రంబు గలదం
దుఁ | బయుతుం డనుమునితనయులయుత నియితులనువారలప్పా
రికాంక్షికిం బ్రేమాస్పదులయియుండి రంత నొక్కకాలంబున
నమ్మునిలోక పాకశాసనుండు నిజాంతర్గతంబున నిట్లని వితర్కించు. 166

శా. ఈనాశిష్యులలోన వీరిరువురుఁ♦హృద్యాసనద్యోదయ
జ్ఞానానూనవిచారవాగ్విభవతే♦జఃక్షాంతి శాంతి ప్రధా
సానాధ్యంబునఁ గానిపించెదరు మ♦త్సత్కాశయుల్ వీరి స
న్మానింపందగుఁ బా ణిపీడనవిధా♦నశ్రీల వాలాయముఁ. 167

శా. వాసోనిగ్రహ మెన్న రాఁకలియునీ♦ర్వట్టుఁ గణింప ర్గలల్
మాసెం గా యన రంగముల్ బడలినం♦శాటింప రట్లుండ నీ
యాసాయంబుగ వానిశాత్యయముగా♦నామ్నాయముల్ గ్రోల్చు
నాసీనుప్రచలాయితంబుయిన లే♦దాహా! వితర్కింపఁగఁ.[చోఁ

క. వీరలకుఁ దగినమగువలు
ధారుణిఁ బొరయంగ లేర♦ధాతృతనయ లు
న్నారఁట సకరగ్రహణలు
గాఁరట గొనివత్తు వారిఁ♦గమలజుచేతఁ. 169

వ. అని నిశ్చయించి యాసత్యవ్రతుండు సత్యలోకంబున కరిగి. 170

సీ. శశిరేఖఁ గైకొన్న♦సౌవర్ణగిరిపోలె
మినుకుఁజేడియఁగూడి మెఱయువాని
ననురేఖ్యఁ బాటించు♦హాటకాద్రియుఁబోలె
నంచచెంగటనుండ♦నలరువాని

శారదాభ్రములంటు♦భూరిశైలముఁబోలె
దెలుపుఁగ్రొన్నేఁతల♦వెలయువానిఁ
గళభంబులమీఁది♦కాంచనాగముఁబోలె
వెలితమ్మిగద్దియ♦వెలయువానిఁ
గీ. బాడవులన్నియుఁ దనయంద♦పొడమువానిఁ
గడయునడుమును మొదలు నే♦ర్పడనివాని
సచ్చిదానందకందమై♦హెచ్చువాని
నలువఁ జూళుకితస్వాంతో♦ధి♦ తెలచె నుతుల. 171

క. తెలచిన మొలచినకృపకుం
గలఁచినమదితోడ నతనిఁ♦గమలజుఁడగ్రి
స్థలిని నిలిపి పలుకులపస
ధళధళలు ముఖప్రఘూణ♦తలములఁ బొలయన్. 172

సీ. హుంకారములు లేవె? యుపపురందరహర్మ్యో
త్పాటనంబునకుఁ♦బాల్పడవుగాక
భ్రూభంగములు లేవె♦యూంభీలవింధ్యగ
ర్వస్తంభనమునకు♦రావుగాక
చులుకాకృతులు లేవె?♦జలరాశి నిశ్శేష
శోషణక్రీడకుఁ♦జొరవుగాక
జాఠరాగ్నులు లేవె?♦జటిలాపి వాతాపి
తనుదాహమున నెదు♦ర్కొనవుగాక
గీ. నిష్ఠ నీమాండ్కి లోకప్ర♦తిష్ఠగుత్రిచి
దుష్టనిగ్రహ శిష్టసం♦తుష్టిహేతు
రోషభీషణరేఖాని♦రూఢగాఢ
లీలఁ గ్రీడించుప్రోడలు♦లేరుగాక. 173

తే. భువనసంభవదుపసర్గ♦నివహశాంతి
త్వన్మఖంబునఁ జనఁ బెద్ద♦తనముతోడ
నిందుధరుఁడన హరియన♦నేననంగఁ
బొగ్రుగంటిమి మిత్రావ♦రుణకుమార!. 174

సీ. అని యాదరించి య♦మ్ముని వచ్చుటకుఁ బ్రియో
జనముఁ దద్విశదో_క్తి♦సరణిఁ దెలిసి
యీవర్థియగుటకు♦నిది యెంత యనిశతా
నందుండు మునొక్క♦నాఁడు నిఖిల
యువతిసృష్టికి నెక్క♦డవుగాక యని తన
యాత్మ నిర్మించి గా♦యత్రి యనియు
సావిత్రి యనియుఁ బ్రి♦శస్తనామములిడ్డ
కూఁతుల నొసఁగఁ గై♦కొని యతండు

గీ. వారి నటఁదెచ్చి తనకూర్చు♦వారిఁగూర్చి
యయుత నియుతుల కెఱిఁగింప♦నందు నయుతుఁ
డొల్లఁడయ్యె నిజోద్యోగ♦మొల్లకున్న
నియుతునకుఁ బెండ్లి సేసెఁ గ♦న్నియలదోయి. 175

క. తనయాజ్ఞగూడ శతధృతి
తనయామణిఁ గై_కొనని హ♦తనయాశయునిఁ
మునుచుట్టు వెడలనడిచెను
ముని కనలి కఠోరవర్ణముగఁ బలుకొలయన్. 176

సీ. కుటిలాలకములుచీఁ♦కటిపోగ్రులగు నైనఁ
జిచ్చందిగ్రకాఢ్యముల్♦చిత్రగతులు
మధురోష్ఠములురాగ♦మహితంబులగు నైన
భావముల్ వైరాగ్య♦బంధురములు

గురుకుచంబులు గర్వ♦భరితంబులగు నైన
హాతదుర్వికారంబు♦లాశయంబు
లలవోకనడలుమాం♦ద్యమయంబులగు నైన
నంతరంగములుబో♦ధాస్పదములు
గీ. పొగరుజూపులు చపలంబు♦లగుననైన
నిండుమనములు మిక్కిలి♦నిచ్చలంబు
లవుర! వీరలకన నొప్పు♦నతివలందు
నిలిపె సమబుద్ధి ప్రియమూని♦నియతమౌని. 177

క. ఈతఁడిటులుండ మునుపటి
యాతఁడు హ్యాల్లగ్న గురుక్రొ♦తానాదరుఁడై
శీతనగసవిధవసుధకు
నేతెంచి మనోగతమున♦నిటులూహించెన్. 178

చ. చిలుకలు కమ్మఁదెమ్మెరలు♦శీతమయూఖుఁడు దేఁటులాదిగాఁ
గల వనవిల్తుసాధనని♦కాయము వేలముపట్టు లంగనా
కుల మటుగాన దానివిడిఁ♦గొట్టక త్రొట్టక దొట్ట వీతరా
గులమని విఱ్ఱవీఁగెదరు♦కొందఱు బోడలునా నగండలై. 179

క. జడలంట చుట్టంగట్టం
గడవ సమంట మేనఁగప్పఁ♦గా పాయమంఁటే
యడవులనవయుతపస్వికిఁ
గడుసౌఖ్యమె? కోరునతికిఁ♦గలయికకున నే?. 180

సీ. 'ఉర్వీధరము లెక్కి♦యుఱుకనే? కుచకుంభ
యుగమెల్లఁగాక తా♦నుఱుకుమనిన
వాఁడికైదువులపై♦(వ్రాలనే! నిడుచూపు
వాలమ్ములఁగాక తా♦వ్రాలుమనిన

మున్నిటసుడివడి • మునుఁగనే? నతనాభిఁ
గనవోల్లఁగాక తా • మునుఁగు మనిన
బెడఁగాయకాలాహిఁ • దొడుకనే? నూఁగారు
తొడుసొల్లఁగాక తాఁ • దొడుకు మనినఁ

గీ. చెప్ప గురుఁడేమిపనిచినఁ • జేయలేనె?
కావె తనసొమ్ము ప్రమూపుకి • కాయకిర్మ
గతులు మొట్టో యనంగ లిం • గంబుగట్టి
జంగ మన సంగనలఁగూర్పఁ • జనదుగాక. 181

ఆ. వె. నెయ్యుఁడట్టిపనికి • నియుతుఁడ తగుఁగాక
గృహితకంటె వేఱె • కీడుగలదె
గురుహితంబునూఁది • యుఱిఁబడ నేనోప
ననుచు బ్రహ్మచర్య • మయుతుఁడొంది. 182

మ. సుముఖాంతఃకరణంబు మత్సరము నౌ • త్సుక్యంబునుం బాసి ధౌ
తమణీదర్పణరీతిఁ జెన్నుగఁ దదం • తర్లగ్నమై యాదిత
త్త్వముదీక్షింపఁ దపంబొనర్చు జటిల • వ్యాఘ్రిం బనాఘ్రాతపు
ష్పముచందంబగు మే ననూననియమభ్రా • ష్టాగ్నిఁదగ్గించుచున్.

క. సర్వాతిరిక్తధృతియగు
నుర్వీసురసార్వభౌము • నుగ్రతపమునం
బర్వ భయజ్వరదాహ ము
ఖరోద్ధతి నిఖిలభువన • గర్భములందున్. 184

క. మినుమినుకు మినుకుమనియెన్
వెనుమినుకులబరణి ధరణి • బిట్టూటాడెన్
వననిధులు విరిసె గురిసెన్
గనగనగనమనుచు నిప్పు • కలు గుప్పలుగన్. 185

ఉ. అత్తఱి నిప్పుడొక్కరుఁడు • తొందరఁ దేల్గొనినట్లు లావయు
న్వ్రేత్తుగ • డ్రావినట్లు విబు • ధేశుఁడు మాణవకాగ్రనిష్ఠురుఁ
జిత్తమునం దపించి యతి • శీఘ్రగతిం క్షితికేగుదెంచెఁ ద
ద్వృత్తము మానిపింతునని • వృద్ధమహీసురవేషధారియై. 186

సీ. జీర్ణైణకృత్తివే•ష్టితశాస్త్రశబళికా
వారసేటికలోకఁ•వటుపుపూనఁ
గంబళికట బుసీ • కాషాయకరకంబు
లొకఁడంతేవాసి • యుద్వహింప
నామ్లికాఫలసార • యవసక్తుతండుల
సూసాదులొకఁడు శి • ష్యుండు మోవ
సమిదాజ్యపూరకీ • చకకుచస్రుక్స్రువ
చయమొకఁడు ఛాత్రుండు • సంగ్రహింపఁ

గీ. దలుగుదామెనఁ బెనఁచిన • గళము తోడ
జంటవెన్నాడు క్రొవ్పుతోఁ • జాలనలసి
నడచు ధేనువు రొక చిన్న • వడుగులొప్ప
నయుతు నాశ్రమవాట మ • య్యతిథిఁడాసి. 187

క. శిరసువడంకఁగఁ దెల్లఁగ
సరసినగృహమేధినియును • నడచెఁ దదంగం
బిరవుకొని పట్టుచాలక
జర కొంత వినిగ్రమించి • చనుదెంచుకరియన్. 188

వ. ఇట్లు కుహనాహితాగ్నియై ద్వైధీకవేషాభినయనిపుణుండు నగు
నాఖరిడలుండు తపఃప్రభావతరంగితంబగు తదాశ్రమంబునఁ బట
కుటికామండప మధ్యంబున నధ్యాసించి మధ్యాహ్నిక క్రియా
చరణానంతరంబునం బ్రాణాగ్నిహోత్రప్రీణనంబు నమసంధిం
చియతి స్నిగ్ధవర్ణముగ్ధాకృతియుఁ జతురపదవిన్యాసధన్యాసికయునై

కవి కవితయుంబోలె నున్న హోమధేనువునకుఁ బథశ్రమంబునొ
వరించుచు నుచితగతి నొక్కించుకతడవు విశ్రమించి సచ్ఛాత్రుం
డై మెత్తమెత్తన చని యొండకండ క్రొవ్వదఱుఁగున త్తటి సరి
త్తీరంబునకు సాయంసంధ్యాసముపాసనార్థంబు నిర్గమింప నుద్యు
క్తుండై ముక్తసమాధియగు నయుతునికడకుం జనుటయు నతం
డతనికి నాతిథేయంబు ప్రియంబున నాచరించి సుఖాసీనుఁ గావించి
యాగమనకారణం బడుగుటయుఁ గృత్రిమముని ధాత్రీసురపుత్రు
న కిట్లనియె. 189

చ. అమృతభుగాస్పదంబు విశ♦దాప్సరముల్ నవపారిజాతము
ఖ్యమహిజరాజి రాజిత మ♦నంతఫలాయతనంబు నిత్యర
మ్యము నగునొక్కయాశ్రమము♦హైమనగోపరిసీమ నల్లసి
ల్లు మదధివాసమై మదము♦లోభముక్రోధము మొల్వ దచ్చటన్

క. శ్రీసఖులు సుగుణరత్నా
వాసులు సమవర్తన♦ప్రవర్తులు నయ్యున్
నాసరివారలు గనిమనఁ
గా సుఖినై యేనొనరుఁ♦గాపురమచటన్. 191

తే. అఖిలధర్మంబులందు గా♦ర్హస్థ్యమెన్న
నుత్కటంబని తన్నిష్ఠ నోర్పుగలిగి
జగతిఁ దీర్థాచరణ బుద్ధి♦సంచరింతు
ధ్రువతపోగామి! యా మీను♦ధ్రువముగామి. 192

ఉ. కంచి భజించి శేషగిరిఁ♦గన్గొని యాదిమ రంగధాముఁగీ
ర్తించి ప్రయాగమాధవు ను♦తించి గయాప్రియు శ్రీగదాధరున్
గాంచి కరిద్విషన్నగ♦శిఖామణికిన్ బ్రణమిల్లి వార్థినే
తెంచిన క్రొయ్యవేల్పుఁ గని♦దిక్కులతీర్థములెల్ల నాడుచున్. 193

ఉత్సాహ. వచ్చిపచ్చి కల్పకంబు•వంటి యొంటివానిఁ గ
న్నిచ్చవచ్చు గ్రిచ్చకాయ•లెంచి యూడువాని మో
విచ్చునచ్చగంటివాని•వింటి వెన్నముచ్చు న
ప్పచ్చవిల్తుఁగన్నతండ్రిఁ•బాండురంగవిట్ఠలుఁన్. 194

వ. విని యద్దేవాదిదేవు సేవింపంజనువాఁడనై పైజాడ సపరిచ్ఛదం బుగా నేగుదెంచితి నీవెవ్వఁడ వెద్దియభిలషించి భువనభయానకం బగు తపంబాచరించెదు వాచంయమవంశకంఠీరవంబ! యీశరీర సాదంబునకు నాదికారణంబగు నీహృదయం బనియుచ్చరించుట న నోరుపొక్కుచున్నయది యున్నయట్లనోడుపుమనుడు నవ్వడు విట్లనియె. 195

క. ప్రియుతుఁడనుమునికుమారుఁడ
నయతుండను వాఁడ నియుతు•నగ్రిజుఁడ గత
స్మయవిస్మయావహాతపో
నియతి వెలుఁగుకలశజన్ము•నికి శిష్యుండన్. 196

క. కులశిఖరినిభులు తనకుం
గలశిష్యులలోన నెల్ల•గారవమారం
గలశీసుతుండు కరుణా
కలశీతలదృష్టి బెరయఁ•గా మముఁజూచున్. 197

ఉ. దాతయు దైవముంగురుఁడుఁ•దల్లియుఁ దండ్రియునై యభేద్యవి
ద్యాతిశయంబు రాఁజొనిపి•యమ్ముని మున్నొకనాఁడుధాతృసం
జాతలసత్కృతాస్యజల•జాతల జాతలతాంతసాయక
ద్యోతల నొక్కయిద్దరుత•లోదరులన్ మముఁజూచియిట్లనున్. 198

క. మీకని కొనితెచ్చితి నా
లీకాసను వేఁడి యిన్న•లినదయనల విూ

రోకుట్టులార! పాణి
స్వీకృతి జ్యేష్ఠానుపూర్విఁ జేకొనుఁడనుఁడున్. 199

క. అవగుణగణశేవధులగు
ధవళాక్షుల కీడుదలఁచి దారాదరణ
వ్యవహృతికి మాఱుమొగమిడి
యుపుగాదని కొన్నిమాట లాడితినతనిన్. 200

క. ఆడినఁ గూడినకినుకన్
వీడినజడముడియుఁ బొగలు వెడలెడిచూపుల్
పోఁడిమిగొనునిట్టూర్పులు
వాడిన డెందమును మేన వడియుఁ జెమరునై. 201

క. శపియింపఁగఁదలఁచియు న
త్తపసియుడిగెఁ గఱవఁదలఁచి తానె యుడుగుపా
ముపగిది శిఖవిడినంతనె
విపులామరవిపులకోప విషముందిరుగున్. 202

క. నను వెడలనడిచి నాత
మ్మునికి వివాహంబొనర్చె ముని కనకవిభా
జనకతనుద్యుతివిభవల
వనరుహభవమానసోద్భవ వల నాకవలన్. 203

క. సలసలమనుకలశజువె
గ్గలపుంగినుకయను నెసటఁ గలపడివడి నా
దలయంటిచూచుకొని యే
నిలువెడలితి నాకుణంబ మొత్తినభీతిన్. 204

ఆ. వె. విషనిభంబులైన విషయాభిలాషంబు
లెల్ల జెల్లఁబెట్టి యేనుబ్రహ్మ

చర్యధుర్యవృత్తి♦నవరించుచున్నాఁడ
నుగ్రతపము మోక్ష♦మొందుకోర్కి. 205

క. అనుడు దరహాసరసమునఁ
దనవదనసరసిజద్వి♦ఘుండు తాఁ ...మునై
కొన వాండాంకోళనవే
ళనమున శిరమమర మాంచ♦ ... డిల్లి నియెన్. 206

చ. ప్రియుతుఁడు మస్సఖుం ... ♦పాపిభవమున్ భవమున్ సుధీజన
ప్రియజనకంబు లాఁగుణా గి♦రిష్ఠుని జ్యేష్ఠతనూజుఁడౌట మ
న్నయనయుగంబు హర్షసుధ♦నానె నినుం గనుఁగొన్న సాధుబో
ధయుత భవద్విరుద్ధచరి♦తంబు శ్రవఃపుటనూచి యయ్యెడున్.

మ కులధర్మంబెడలించి శ్రీగురునకున్♦గోపంబు పుట్టించి మి
త్రుల సౌభాగ్యశ్రీనివాసదేశముల నీ♦తోఁ బుట్టులం బాసి ని
శ్చలతన్ వేదెద వృక్షగట్టుకొని దు♦స్సాధంబుసుమిత్రస్మర
జ్వలనజ్వాలిక సోఁకనీక నిలుపన్♦జ్ఞానామృతస్యందమున్. 208

చ. చలనవిహీనవృత్తి సడి♦సన్నపరాశరుఁడాదిమైనయ
య్యలయులరాయివంటిహృద♦యంబులునీరుగఁ జేయు బోయపూ
విలుతున కెంతదొడ్డపని♦వెన్నెల బిట్టువికాసినంతలో
పలన కిరంగి పొంగు పసి♦బాలురచిత్తము మెత్తచేయఁగన్.209

మ.లలితాగారవిహారులై మణిమయా♦లంకారులై శీలవ
ల్లలనాలాలితులై యమూల్యమృదుచే♦లద్యోతితాకారులై
కలమాన్నప్రియులై సుగంధధరులై♦కందర్పనింబోనిభూ
తలనాథుల్ జనకాదు లొందిరికదా♦తత్వార్థగానందముల్. 210

మ.కలలోవార్తలు విప్పిచెప్పెడుక్రియన్♦గాథాపురాణార్థముల్
దెలుపన్ నేర్తురుగాని నేరరుసుఖా♦తీవ్రవ్రతాచారశ

ష్కులునై యుండెడు ముండధారులు సుము♦క్తుల్ డాయగాఁ జింత సౌ
యలకజ్జాయము తోయమింత చదరం♦బాతత్పరిష్వంగముల్.

మ. వరసారస్వత పట్టభద్రులు కవుల్♦వర్ణించి వర్ణించియుఁ
సరసావంతయుఁ గాన లేరు తుద యో♦షావిభ్రమాంభోధికిన్
విరసాంతఃకరణుండవై యెటులుగా♦నిందించె దో యయ్యా! త
త్సరసాకార ముదారమన్మథకళా♦సర్వస్వశృంగారమున్. 212

సీ. కీలారమున నుండి♦పాలింటికే తేర
బహుధాన్యములు చేలఁ♦బండియొరగ
నెడనెడఁ బెండ్లిండ్లు♦వడుగులు వాడమఁ గృ
తార్థులై యర్థించు♦నర్థులలరఁ
బరిచారకాకోటి♦పనిపాటుపాటింపఁ
జుట్టంపుసందడి♦నెట్టుకొనఁగ
గ్రామమెంతయు నిజ♦ప్రాభవంబున మన
సత్యనిష్ఠుఁడ దన్ను♦సాక్షి గోర
గీ. నిత్యనైమిత్తికములు♦నిర్ణిద్రబుద్ధి
నాచరించుచు హరిభక్తి♦మాతృభార్య
భక్తి నిడ భుక్తిగొనుచున్కి♦ముక్తిగాని
నిదురవంటిది జీవితం♦బిదియుఁ గాదు. 213

క. అని తను నీక్రియ బోధిం
చిన జరఠతపస్వి పలుకు♦చిత్తాభోగం
బునఁ బెనఁగనీక ప్రియుతుని
తనయుండ యుతుండు బిగివ♦దల కిట్లనియెన్. 214

ఉ. పుక్కిటి యోవరింజదువు♦పుత్తడిహత్తిన పెద్దవైన మీ
రొక్కొకవేళ పాటవము♦నొందమిఁ జెందినఁజక్కఁ బెట్టువా

రక్కట! యొక్కటన్ బెడఁకి♦యాడిన గీడన నెవ్వఁడోపుఁ జే
రుక్కున నేఱునిక్కుచన♦నొక్కఁడు వంకలునొక్కశక్తుఁడే?. 215

క. నిష్కారణముగఁ దన్నుబ
హిష్కారమునొందఁజేయు♦నిల్వలవైరిన్
శుష్కీభూతకరణహృ
త్పుష్కరుఁడితఁడనఁగ నన్ను♦దూఱందగునే?. 216

క మమకారదూరునకు మి
త్త్రములు కళత్త్రములు నన్న♦దమ్ములు ననుబం
ధములపరిష్వంగము ధ
ర్మమె మైకొన యఘుఁగు నగము♦మైలయు నగమే. 217

తే. గాఢవిజ్ఞానమయమనో♦గూఢమైన
నిర్మమునిధైర్య మతనుండు♦నేరఁడు గొన
దానధారాకరాళకాం♦తారదంతి
కుంభముక్తాహరణమొనఁగూడునెట్లు. 218

క. అకుటిలగుణవాసన తో
నకలిగి మరువంపులేఁగొ♦నయుఁ బోలినశ్రీ
శుకు నెన్నరేమి? సారె జ
నకు నెంతురు పరముఖోప♦నతవిజ్ఞానున్. 219

చ. మునిజనభాగధేయమగు♦మోక్షముపక్షములేక పల్కు నీ
వనఘవిచార! సారె గొని♦యాడెదు బూడిదబొట్టువోని యీ
చెనఁటిగృహస్థధర్మ మది♦చిమ్మెట సింగమె? గాజురత్నమే?
కనకశిలాటుకాధమము♦కల్పఫలంబె?చలంబు లేటికిన్. 220

ఉ. సంపదచేతఁగాని కొన♦సాగవుసువ్వె గృహస్థధర్మముల్
సంపద పూర్వజన్మవిక♦సత్సుకృతంబునఁగాని చేర దా

సంపదచేరియుఁ బ్రమరవం౹శంవదుఁజేయు మహాత్మునేనియుఁ
జంపకు నన్నుఁ గన్నుసిమి౹చంపుడు మ్ముంపుఁడు బోధగాథలఁ.

శా. కందర్పాస్త్రములందు సంచితతటి౹త్కాండంబులందుఁ సుధా
మందస్యందములందుఁ గాంచనలతా౹మ త్తల్లులందుఁ సుధీ
బృదంబుల్ ధ్వనినిందలందెగడునీ౹బింబోష్ఠులం దెల్లనా
నందాభాసమె కాక భాసితచిదా౹నందంబు పెంపొందునే?. 222

చ. కురులసిరుల్ మెఱుంగుఁజను౹గుబ్బలనిబ్బరముల్ మొగంబువి
స్ఫురణము లిందునీలమణి౹భూధరశృంగ కురంగలాంఛనా
దరవశదృష్టిఁ జూచెదవు౹తాపసవంశవతంస తజ్జరా
భరమున వచ్చు తెల్పుఁబడు౹పాటు వళీవలనంబు నుండఁగన్. 223

క. కులమెల్ల గోత్రమెల్లన్
గలకంతులనొల్ల నొల్లఁ గలుములు బాధా
నలహుతదుర్భవబాధా
నలమతినై కందునొక ధ ౹ నము చేననుచున్. 224

క. ఒకటికిఁ బదియుఁ బదింటికి
నొకనూఱునుగాఁ గదనదు ౹ యుక్తులకుఁ జలిం
పక నొడుపువడువు దృఢని
ష్ఠకు నలరియుఁబలుకుఁ గపట ౹ సంయమి కినుకన్. 225

సీ. పందకుఁబోటులో౹భగన్నస్తునకు నీఁగి
బోయకుఁ గరుణన౹పుంసకునకు
నంగనాసుఖమునె౹ఱిగించు తెఱఁగయ్యె
నాబుద్ధి నీయందు౹నాటకునికి
నెట్లైనఁగదుర్కు నీ౹విది వోలు నిదివోల
దని తెల్పఁ దెలియునే౹యసదుబోడువ?

నిమ్నాభిముఖమైన • నీటినెవ్వాఁడోపు
త్రిప్పి యొప్పగుచోటఁ • దిరుగఁజేయ
గీ. సలమి గుడిమ్రింగువానికి • దలువులప్ప
డములు గాకుండు నే? యగ • స్త్యమునిపనుపు
మీఱి యూరకిగుర్వన • మిన్నుముట్టు
నింత మేటికి నామాట • యెంతపాటి?. 226

ఉ. వ్యాససుతాదులందలఁచి • వాసికి మంగలకత్తిమ్రింగె దా
సాసల నట్టుచాఁచె దదె • యందనిపంటికి బొందితోన కై
లాసము జేరఁజూచెను చ • లంబదియేమి? ఫలంబటంచు నా
భూసురుఁడీసువెంచి ముని • పుత్త్రకుఁబాసి తొలంగి వెండియుఁ. 227

తే. కామధేనుముఖంబునఁ • గార్యసిద్ధిఁ
బడయ నూహించి మాయలు • వన్నిచనియె
విను మునిశ్రేష్ఠ! తపముగా • వించువారిఁ
గనినఁ దలయెత్తఁగాదె! యాఁ • ఖండలునకు. 228

సీ. ఉద్యదుత్థాసన • ముద్యోగమాత్రావ
శిష్టచేతస్స్మర • దష్టదర్భ
కుతికృదుగ్రధ్వాంక్ష • తతినివారణవిధా
త్వరమాణవాలాగ్ర • దంశపిహిత
నాఘ్రాతాధశ్శయ • నారంభవిస్రంభ
గళకంబళాభోగఁ • గాతరాక్షి
నేకపార్శ్వస్థితి • స్వీకారనిర్భగ్న
చరమోరుకరశల్య • సాంద్రబాష్ప
గీ. దుగ్ధసేవాసమయబోధ • ముగ్ధవత్స
పీడితాపీనపర్యంతఁ • బృథులదామ

వేష్టితగ్రీవ నట చూచె విస్ఫురిఁదోర్క-
యర్జు నినిజోటజపరిఘా ణాంతరమున. 229

క. చూచి యిది యల్ల మొన్నటి
వాచంయమువేల్మిగిడ్డి పడు వాఁడెదు నీ
నైచికికి నెట్లొకో యీ
నీచత వాటిల్లె నిన్న నేటనె యనుచున్. 230

చ. మతిఁ గృపగ్రమ్మ బాడబకుమారశిరోమణి యుద్ధరించె భూ
పతితఁ దపస్విరోహిణి నపాయపరంపరఁ బాచి సాఁకి యూ
ర్జితబలఁ జేయఁగాఁ దలఁచి శిష్టహితన్ గలికాలజాతదు
స్థితఁబడుధర్మదేవత శతచ్ఛదలోచనుఁడెత్తుకై వడిన్. 231

క. పడబడఁబాఱుచు గడగడ
వడఁకుచు మొద వింతనిలిచె వనజాక్షుఁడు మున్
వెడలింపఁగ జలనిధి వెలు
వడి యించుక దెలియు పుడమి పడఁతియుఁ బోలెన్. 232

చ. పదములకొంకు వోఁ బసికి ప్రిక్కలు ప్రక్కడలించి దంశవం
శ దమనవృత్తి నింపొసఁగి సాస్న నఖంబుల దువ్వి నెత్తురుల్
చిదికెడుగండ్ల భూరజము చిల్కి ముఖస్థతృణంబుఁ దోఁచి య
మ్మొదవు మృదుక్రియన్ నడిపి ముంగిటఁ బందిటి రాటఁ గట్టుచున్.

క. చేతోజహాయచ్ఛాయా
పాతానహమైనమంచి పచ్చికయు విని
ర్ధౌతకలధౌతదండవి
ఘాతులితజలంబులం దపసి ప్రియ మెసఁగన్. 234

సీ. పడఁబడనెత్తఁ బా ల్పడియున్కి నాసనా
ధ్యాసనైపుణశక్తి పట్టువదలె
నులపాంశురము లేర్చి యులువవట్టెడుపూన్కి
గుశపల్లవాహృతి కుంటువడియె

నడలంగ మెడరజ్జు • గడువడి నిడుతమి
 నక్షసూత్రావృత్తి • యావులఁ జనియెఁ
బొలయూష్చి తినుటకుఁ • బొలయుపుల్లుల బోవ
 నదలించు హుంకృతిం • జెదరె మంత్రి
గీ. మాసలన్నియు మొదలంటఁ • గోసి యున్న
 గోఁచికట్టున కటువంటి • గొడవ గడవ
 రాక మెడఁజుట్టుకొనియె నూ • రకయకార్య
 కరణశీలుర కెప్పాటఁ • గలదె? సుఖము. 235

చ. విబుధతపోధనేంద్ర! విను • వేయువిధంబుల నాతఁ డేద నే
చి బలవిభేదినై చికి వి • శృంఖలమై ఖలమైత్రిఁ బోలె వే
గ బలవిహీనతా ర్తి యుడు • గం గడుఁగ్రొవ్వున నివ్వటిల్లి బీ
దబలిసి బందికాఁడగువి • ధంబునఁ ద్రిమ్మరు నమ్మహాటవిన్. 236

ఉ. గుండువలెన్ బలీయమగు కోడియతోడఁ జరింప నారఁగాఁ
బండినబల్లువంటి పసి • భాసిలు మైసిరిచూడ్కి కెంతయున్
బండువొనర్ప నల్పగతి • పాల జనింప సమాంసమీనకున్
వెండియునిల్చెఁ జూలు దధి • వీచి మణీఘృణి చొచ్చుచాడ్పునన్.

ఆ. వె. వత్సయుతయు గర్భ • వతియునై మాహేయి
 పతివ్రతంబు నణపఁ • బాస్చి యుండెఁ
 గంజగర్భతర్క • కయుజగద్గర్భయు
 నై నయసురుఁజెఱపు • టాపుఁబోలె. 238

క. లోచనవికృతి ముకురమున
గోచరమగుపగిదిఁ గపట • గోచరితము దన్
మోచినవాచంయమిసుతుఁ
డేచిననెవ్వగలఁ బొగిలి • యిట్లూహించెన్. 239

సీ. వత్సనాభీగంధ • వహమయ్యె నీయావు
 పెగాలినీవార • పాకములకుఁ

గళితకుద్దాల వ • క్త్రములయ్యె నీజన్న
మునుడెక్క లక్కంద • మూలములకుఁ
జటులదవానల • చ్ఛటయయ్యె నీగిడ్డి
కటుజిహ్వాబర్హి • ర్శిఖాయములకు
నారణోచ్చారణో • ద్ధతులయ్యె నీతొఱ్ఱి
కంఠహుంకృతులేణ • గర్భిణులకు
గీ. నాకు మొగమోడి యాఁగాద • నరుతపస్వ
లేల! యీమైలపూయక • దూలదీని
వత్సయుతముగ నీవనీ • వాటమునకు
లాడిగావింతునంతఁదొ • లంగుదూఱ. 240

ఉ. దండమెకీనివాలన్ని సు • ధానిభవాఃకరకంబె దీనియా
కుండపొదుంగు దీనిముకుఁ • గ్రోళులు భూమిబిలాంతరంబులే
గండపటంబె దీనిమెడ • కంబళమంచుఁ ద్యజించె రోసి య
క్కొండొకబ్రహ్మచారి మది • గూకులువత్తులునై యసద్గతిన్
తే. క్రేపు నాపోవఁబట్టి లం • కియకుఁదార్చి
తోలవియఁగొట్టి మెడనొక్క • తుండుగట్టి
గిడ్డి వెడలించెఁ దలతాఁడు • చేలఁదొట్టి
మారి వెడలించువడువున • మాణవకుఁడు. 242

క. ఆధేనువు తత్కృతబహు
బాధల సక్రోధయగుచుఁ • బరతత్వసము
ద్బోధకబోధ కలిత్ముడగు
వాధూలమునీంద్రుఁ డుండు • వనమునఁ బడియెన్. 243

క. పులియున్న పొదరు మొసలికిఁ
నెలవగుబలుమడువు దాఁచు • నిల్చినవల్మీ
బిలమన నమ్మునివనమె
వ్యాలనం జొరఁ జనదు శ్వాస • వపుర్భృత్తులకున్. 244

శా. ఆమాయూగవి మట్టె నట్టడవిలో•నత్యుద్ధతిఁ జేసి మ
ధ్యేమార్గంబున నభ్రగర్భితసురా•ద్రిం బోలి వల్మీకరే
ఖామగ్నాకృతినున్నయున్నతతపః•కౌశల్యశల్యుం గత
వ్యామోహుం జిరజీవి దేవతులితుం•వాధూలవాచంయముం.

ఉ. మట్టిన బిట్టు మిట్టి పడి•మౌని సముత్థితుఁడయ్యె మేనిపై
పెట్టినపుట్ట నెట్టవిసి•బీఁటలువాఱ శిరశ్శకుంతముల్
చట్టుప లెత్తి ముందఱికి•సాఁగఁ దలంప జటాచ్ఛటాచ్ఛవిన్
దుట్టెలుగట్టి నిద్రిలుమ•రుద్భగధీశకులంబు మేల్కనన్. 246

మ. కనవుంబీవలు దావపావకశి•ఖాఘుంబుల్ ప్రకాశింప వె
క్కసమైతోఁచినకొండచందమున దీ•ర్ఘశ్మశ్రుప్రచంచచ్ఛటా
విసరక్రోధరసోగ్రమూర్తియగుచుం•వృద్ధవ్రతిశ్రేష్ఠుఁడా
త్మసమీపస్థితు హస్తముక్తసురభిం•దద్దృష్టి వీక్షించుచున్. 247

ఉ. ఓరిదురాత్మ యోరివిన•యోజ్ఝిత! యోరిమదాంధ! యెందు నే
వారికిఁ జేరరాదు మను•వారికి నావన మీవు చొచ్చి జం
భారికృతోపఘాతశత•హార్యముగాని మదీయఘోరదు
ర్వారసమాధిగౌరవము•వమ్ముగఁ జేసితి వాసురక్రియన్. 248

తే. వృద్ధుఁ బ్రణిధానవిర్మగ్ను•బుద్ధిబలవి
హీను నన్నిట్టు చేసితి•గాన నీవు
నిట్టిప్రాయంబు నీరూపు•నీవిధ బు
ంనదటునుడివోయి శేకంబు•వగుమనపుడు. 249

శా. ఆపృథ్వీసురసూతి తత్పదసరో•జానతుఁడై యిట్లనున్
గోపాటోపమడంపుఁ డీరలిగినన్•గొండల్ వడున్ వారిధుల్
రూపేదున్ ధర వ్రయ్యు మిన్నొరగు మం•దూప్రపంబునా నెంత? ని
ష్ఠాపదాత్మవన! లెస్సగాఁ దెలిసినన్•శాపాగ్ని చేఁగ్రాఁపవే?. 250

క. తఱుఁగ నిలయశిఖవని నిను
నెఱుఁగుదు వాధూలమునికు•లేశ! నిజముగా

నెఱిఁగి యెఱిఁగి తనయాదల
కొఱవింగొనిగోఁక దివురు • కుమతియుఁ గలఁడే?. 251

ఉ. ఉద్ధతిదక్కి యొక్కయెడ • నూరకయుండఁగ నీని కంధరా
బద్ధమహాహి నీకపిలఁ • బాపఁ దలంచితి నొండులేదు దీ
నోద్ధరణాతిసాంద్ర కరు • ణోదధివీచిసమృద్ధమైన నీ
బుద్ధికి జేర్పఁగాఁదగునె? • భూరిదవానలకీలఖేలముల్. 252

వ. అని మునితనయుండు ధేన్వాగమనాది తదుచ్చాటనాంతంబుగాఁ గల తనవృత్తాంతంబు విన్నవించుటయు నూహించి యత్తెఱంగు చిత్తంబున యథార్థంబుగాఁ గనుంగొని. 253

మ. భ్రుకుటీభీషణఫాలభాగుఁడు తను • ప్రోద్భూతఘర్మాంబుబిం
దుకుఁడున్ బ్రస్ఫుటదోష్ఠపల్లవుఁడు చే • తోభీతికృల్లోలతా
రకఘూర్ణన్నయనుండు గాక శమసాం • ద్రస్మేరుఁడయ్యెం దప
స్వికులగ్రామణి చిచ్చుచందుప్రోడవై • చెన్నొందుచందంబునన్

క. సప్రణయుఁడగుచు మునిలో
కప్రవరుండాదరించెఁ • గనికరమున న
వ్విప్రకుమారుఁ దృణాంచల
విప్రియములుగావె యవని • విబుధాగ్రహముల్. 254

ఉ. ఆవసుధామరప్రభవు • నమ్ముని యిట్లను వత్స! వినుమ్మ నా
భావపథంబునన్ నిను న • పాపునిఁగాఁ గనుఁగొంటి నాగ్రహా
వ్యావృతచిత్తవృత్తి నిటు • లాడితి మీఁదరయంగ లేక నా
యావచనంబు దప్ప దన • యం బెద మూర్ఖతనన్ను మోచుటన్

చ. వగవకుమన్న! దైవగతి • వచ్చినకీడుదలంచి నెమ్మదిన్
బొగులకుమన్న! కర్మముల • పోకకు భోగమె హేతువన్న! వి
శ్వగురుగిరీంద్రవత్సలుది • వానిశమున్ దలపోయుమన్న, మే
లగు హరిభక్తియుక్తులకు • నాపద రాదుగదన్న! యెన్నఁడున్. 257

సీ. జలధరంబన నెద్దిపొలపంబు పుట్టించు
నిల్లాలిమెఱుఁగులకు మొల్లములకు
మున్నీరనఁగ నెద్ది మొలచుట కావాల
మాఁశిఫ్రూసలువోని యాత్మజులకు
నీడమ్రాఁకన నెద్ది నిలువనీడ తోఁచు
నాఁకటనుండుద్వి జావళులకుఁ
దాఁపన నెద్దియాధారమోదివిబ్రాఁకు
పిత్రృవర్యులకుఁ గుంటి పిచ్చుకలకు

గీ. నట్టిగృహమేధిధర్మంబు నందునీవు
గుత్ససేయుట నీకీర్తి గొడవ యొదవె
నొప్పుగతినొప్పు గనఁగల్గ దుద్ధతులకుఁ
గసరిపైవచ్చు తాళ్ళపై గాలిమైన. 258

క. ఏనింతవాఁడ నేనయి
పూనుదునఁట యెద్ది గాక పోయెదు ననిసుం
తైన ఫలమందఁ దీరదు
మానవులక కాదు వినుము మర్త్యులకైనన్. 259

సీ. మునులనుష్టుభమునఁ దనుఁ గొల్వఁదగువానిఁ
బ్రహ్లాదుఁ బ్రోవఁ బొల్పడినవాని
ద్వాత్రింశ దురుభుజా స్తంభాఢ్యుఁడగువాని
నశ్వత్థమూర్తి యొయ్యలరువాని
చక్రంబు చేక్షేత్ర జనముఁ బ్రోచెడువాని
వివిధాయుధంబుల వెలయువాని
నలఘుదివ్యాకల్ప ములఁజూడఁగలవాని
భీమరధ్యాపగా సీమవాని

గీ. వివిధకథలవాని వివిధరూపంబుల
వాని నిలిచికొలుచు వానివాని

శ్రీనృసింహదేవు • సేవింపు • భేకంబ
వై తదంఘ్రిమూల • మధివసించి. 260

తే. దర్దురాంగనయందుసం • తానసిద్ధి
నీకు నగుఁగొంతకాలంబు • నిర్గమింప.
దాన నీదుపితౄణంబుఁ దలఁగి శాప
మోక్షసంప్రాప్తియును గల్గు • నాక్షణంబ. 261

వ. అని యివ్విధంబున వాధూలుండు శాపావధినొడివి యవ్వటువు నాశ్వాసించి విశ్వాద్భుతజనకంబుగ నంబురుహప్రియమండలంబుభేదించికొనుచుంజని యపవర్గసామ్రాజ్యసింహాసనాసీనుండయ్యె నిచ్చటవిఖచ్చరభేనువునేలినవానిపని సఫలంబుచేసి ఫలోదయంబునలంకరించె. ప్రయుతసుతుండును విఫలప్రయత్నుండై యయత్నసంప్రాప్తంబగు నిజవ్యసనంబున ననురుసురయ్యును సాయంసమయకుముదంబు చందంబునఁ గొంతకొంతతచ్ఛాంతివచనంబు లవడధైరినవాఁడై జగత్త్రితయపవిత్రీకరణంబగుపాండురంగక్షేత్రంబునకుంజని. 262

క. భీమరథిదోట్టితీర్థ
స్తోమంబుల నెల్లఁ దనువు • దోఁగించి ముని
గ్రామణి కుహనాభీరశి
ఖామణిమణిసౌధరాజ • గర్భాగతుఁడై, 263

సీ. సురతరుప్రసవరిం • ఛోళి. మాళివినీల
జలదంబులోని క్రొం • దళుకు లెసఁగ
మొగము వెన్నెల యేటి • మొగ రేటిమగమీల
గతి పక్ష్మలాక్షియు • గ్మకము మెఱవఁ
గజియనెమ్మేనుచీఁ • కటిమాఁకుబ్రాఁకుబం
గరుతీఁగక్రియఁదూలఁ • గదుప్రశాటి

యుదుపధంబునజాఱుఁనురురత్నతతిభాతి
మెడహారముల పెనఁపుడమిఁదాఁ క
గీ. నచ్చరలువీవనలువీవఁనంగరాగ
వాసనలు భూషణార్చులఁ సేసలెసగఁ
బిఱిఁదిదెసనున్నరమవిూఁదఁనొరగి ధవళ
చలదళచ్ఛాయనుందువింట్లలునుతించు. 264
ఉ. ఫాలము చుక్కనంక నెలపైఁ వెలుఁగొందెడులోహితాంగునిన్
బోలఁగఁ గంబుగర్భమునఁ బొల్పగునీలములీలఁగంధసా
కాళిమ యుల్లసిల్ల విధుఖండము కెంజడకెంపుఁదమ్మిలో
బాలమరాళమట్లురఁభాసిలు శూలిలలాటపట్టికన్. 265
మ. నలనాసన్నలినాసనాననపురాఁణస్థానముల్ డాయ ని
మ్ముల బల్పాయలబోరుతల్పులధరంఁబుల్ గెంపువాచూరులున్
గలవిద్వద్వదనాంతరాళ నవరంఁ గక్షోణిరాణించును
జ్జ్వలవజ్రివ్రజశంఖసంఘనిభభాఁషామోషజిహ్వాస్థలిన్. 266
సీ. లలితకుంతలశైవఁలము ముఖైందవబింబ
మధరాధరప్రవాఁళాంకురంబు
చపలస్వభావలోఁచనమహామీనంబు
కమనీయకంధరాఁకంబుకంబు
గరిష్ఠస్తనకనఁత్పర్వతాభోగంబు
విశదత్రివళిభంగఁవిలసనంబు
మధ్యవృంతావగ్రఁమహితంబుకటితటి
ద్వీపంబుపృథులోరుఁదివిజకరటి
గీ. కరము పదకూర్మపృథుకంబుఁ గ్రిమ్మనఖఁ
మణికలాపంబునగుచు నేఁ మగువరూపు
భూరిసౌభాగ్యసంపదఁ బోలుఁదంష్ట్రి
నాసుధాంభోధి పుత్రిబాఁ హాంతరమున. 267

మ. సితకీరస్ఫటికాక్షమాలికలు గెం◆జేదోయి సంధించి భా
రతి వామాంకతలంబునన్ సతతమున్◆రంజిల్లఁ గల్లోలసం
గతహంసోత్తమఫేనపఙ్క్తియగు గం◆గావాహినిం దాల్చుదై
వతశైలంబనఁ దేజరిల్లునల వి◆శ్వస్రష్ట నాభిందగన్. 268

తే. రత్నసందర్భగర్భయీ◆రత్నగర్భ
చరణపీఠంబుగానున్న◆సకలభువన
మయుని నినుఁగంటి దేవ! నా◆భయములుడిగె
నని తపసి ప్రీతిఁ గంసాభి◆యాతిఁ బొగడి. 269

క. అటఁజ నివటువుత్తరది
క్తటమునఁ గనుఁగొనియెఁ దరళ◆తరతరుమూర్తిన్
బటునఖరశైత్యమున నా
రబముశిపి సురారినేలు◆రసికు నృసింహున్. 270

క, శాశ్వతకలుషాంబుధి న
వ్విశ్వవిభుంగనుటఁగాలె◆విప్రుఁ మది మా
నీశ్వర! శాపవికారమ
నశ్వరదుశ్చేష్టితాభి◆నయమొనరింపన్. 271

శా. నీరప్రాంగణకర్కటీబిలములన్◆నిద్రింపమృత్స్నామయా
హారంబున్ గబళింపఁ బెల్లుఱవ ని◆ట్టట్టుం బ్లుతంబుల్ గొనన్
దూరాయాస్యదహీంద్రభీతిహతిగొం◆దుల్ దూఱఁగోరున్ మదిన్.
సారాపేతమనోబలంబగుభవి◆ష్యద్భేకముత్సేకమై. 272

క. ఈవడువున శాపవ్యస,
నావేశము గదిరియును మ◆హాద్ధైర్యముతో
నావిప్రుఁడు సుప్రతిభా
దేవేజ్యుఁడు ప్రస్తుతించు◆దితిసుతశత్రున్. 273

ఉ. ఆసభ నుక్కుఁగంబమున◆నాకిృయ నుద్భవమంది యాసురా
గ్రేసరహృద్విదారణము◆కించిదుదంచితహాసకృత్యముల్

గా సమకట్టియుం బెనుపఁ • గాఁగత మేమి? పునర్భవస్వ ప్రహా
నీసటలెవ్వ రేఁ దెలియ • నేర్తురె? మర్త్యమృగాధినాయకా!. 274

ఉ. మిమ్మిట్టి నైనవాఁడిపవి • మిత్రములై వెలుఁగొందనీనఖా
గ్రిమ్ములకుక్ మృదుప్రకృతి • గల్గుట కొ్రొత్త రమాకుచాద్రిపా
ర్శ్వమ్ములయందునందుఁగల • సారగతుల్ నఖరాభిపాత సా
ధ్యమ్ములుగామిఁగావలయు • నట్లగుటల్ దితిపుత్రశాత్రవా!.275

ఉ. కోపవికారమంచు నొక • కొందఱు గొందఱు భక్తలోకర
క్షాపరతంత్రతాజనిత • సాంద్రకృపాగుణమంచుఁ గొందఱు
ద్దీపితవీరసింధువిహృ • తిస్ఫుటఖేటనికారమంచు నీ
చూపులరక్తిమం బొగడు • చుక్ నుతియింపుదు రీశ్వరేశ్వరా!.

చ. హరికిరిదంష్ట్రనాటుపడి • యైందవరేఖదలిర్పఁబూర్వభూ
ధరశిఖరంబసంగనుతి • దాల్చుకుచంబునఁ బొల్చుభూసతిక్
బరిహసనంబొనర్చురమ భావముసిగ్గున మ్రొగ్గఁజేయవే!
నరమృగరాజ!నీనఖము • నాటినఁ బొల్చునురోజకుంభముల్.277

సీ. పరిపూర్ణచంద్రబిం • బమునందుచక్కిలోఁ
గొనసాగువిద్రుమాం • కురమనంగఁ
గన్నెగేదఁగిఱేకు • కత్తులబోనులోఁ
జికిచినయౌర్వాగ్ని • శిఖయనంగ
వెండికంబములతో • వియ్యంపుఁబొత్తెత్తు
యమునాతరంగసం • ఘములనంగఁ
ప్రాలేయగిరివెన్క • భారంబువహింౘు
పవనపారణకుల • ప్రభువనంగ

గీ. మొగమునకుబిగి గావించు • మిగులుఁగన్ను
దంష్ట్రికాంతరజిహ్వయుఁ • దఱచుఁగేల
నలుఁగులుఁ బిఱుంద వాలమ్ము • గలుగు నిన్నుఁ
గొలుతు దితిపుత్త్రచేత్తఃకు • కూలదహన. 278

తే. అనిస్పృహార్యక్షవర్యున♦ర్యమసహ్యాస
దివ్యజేజఃప్రవాహుఁగీ♦ర్తించియతఁడు
తత్పదద్వంద్వమునకు వం♦దనమొనర్చి
తపసిత్తిట్టునఁబ్లవమయ్యెఁ♦దక్షణంబ. 279

క. ఆశమము నావివేకం
బాశుద్ధియు నాతపంబు♦నాబహునిగమ
ప్రాశస్త్యము నటులయ్యెము
నీశునకును దైవఘటన♦లిట్టివి తలఁపన్. 280

ఆ. వె. అస్మదాదిమాన♦సావాలవలయ ప
కాశభక్తియుక్తి♦కల్పలతకు
మూల మనగఁగ నొప్పు♦నాలోకవిభునంఘ్రి
మూలమాశ్రయించి♦జాలిమాలి. 281

ఉ. ముత్తియము ల్ప్రవాళదళ♦ముల్ గన నాకృతిఁగూడినట్టులై
కొత్తగు నౌర!వీనియపు♦రూపపురూపిదియంచు విస్మయో
దాత్తమనస్కులై సకల♦తైర్థికుల్ గొనియాట భేకలోకో
త్తమమొప్పఁ జితప్రవు♦రుజ్జ్వలమై జలజాసనోద్భవా. 282

సీ. కమలాప్తుఁ డుదయింప♦కయమున్నబుటుకున
మునుఁగు సంగమతీర్థ♦మునకునేగి
వినుసైకతనిషణ్ణ♦మునివేదనినదంబు
తగుచోటనుండి లేఁ♦బగటిదాఁక
మధ్యాహ్నవేళ సం♦ప్రాశించుబ లిపీఠ
గతపులాకంబులు♦మితముగాఁగ
సందెప్రొద్దుననుండి♦సవరేయి గడనన
సమ్ముఖమ్మునఁగొల్చి♦సంవసించు
గీ. శ్రీనృసింహుండు పెనుఁబాప♦సెజ్జమేను.
చేర్పఁ దద్దివ్యచరణరా♦జీపమూల

భూబిలంబున నధ్యాత్మ•పూర్ణబుద్ధి
జాగరము సేయు శాలూర•చక్రవర్తి. 283

ఆ. వె. రత్నరంగవల్లి•రచనకుఁ దనమేను
పువ్వుగుత్తికరణి•పొలుపునిలుప
నంబుచరము పాత్ర•రారంభవేళల
నృహరియగ్రవీథినిలుచునఘ!. 284

క. హరిదాసమనుచుఁ దనునె
ల్లరుపేరిడి పిలువఁగలిగి•ప్లవపతి గడపెన్
జిరకాలము పూర్వజనన
చరితజ్ఞంబగుచు మోక్ష•సౌఖ్యాపేక్షన్. 285

ఆ. వె. ఇటులుకొన్నియేండ్లు•లేగంగ నొకనాఁడు
పౌండరీకనాథు•పర్వమునకుఁ
గన్యకుబ్జవిభుని•కన్యాశిరోమణి
పాణిసఖులు గొల్వ•నరుగుదెంచె. 286

తే. ఆత్మవాహనములనుండి•యవతరించి
నారసింహాఖ్యతీర్థంబు•నకుఁగుఱఁగట
భైమి చెంగట నిడిసిరి•పద్మముఖులు
విరహిహృద్దాములడు మారు•శరము లనఁగ. 287

ఆ. వె. మార్గఖేదశిథిల•మతు లంగనలుచొచ్చి
భీమరథిఁగలంచు కేమిక్రొత్త
వారి గోరువెచ్చ•వక్షోజముల కాంతి
లవము ముజ్జగములఁదవిలి కలఁప. 288

సీ. గంధవాహమున క•గారంబులివియంచు
వీజనంబులఁజూచి•వెగటుగదరి
మరుబాణములసహో•దరవర్గమిదియంచు
నలరుమొగ్గలఁజూచి•యులఁతనొంది

కమలారినామంబు♦గైకొన్నవివియంచుఁ
బుల్లదీఁగలఁజూచి♦పుల్లసిల్లి
శుకయుగంబులఁదాము♦నొకచాయవివియంచు
నవశుకంబులఁజూచి♦నవముగదిరి

గీ. కన్యకుబ్జేశకన్యపైఁ♦గలుగుచెలువు
భావములఁ బెంపు నొఱపులు♦మోవఁజేయ
బలిమి నిజధైర్యములు చిక్కఁ♦బట్టియున్న
మును లొనర్పుదు రొకరీతి♦ముఖ్యవిధులు. 289

తే. వనజనాభునియభిషేక♦మునకెగాని
కనకగర్భామలకుఁ బొందు♦కొనఁగ రాని
తీర్థకుండాళినికరంబు♦తెఱవపిండు
గబ్బిచనుజక్కవలచేతఁ♦గప్పఁబడియె. 290

తే. జాఱునలరులతేనియ♦గారయిచ్చి
గాడ్పుసంఘించునయకాని♦యూడ్పవెఱచు
నెందునయ్యాఁకవిరితోటఁ♦నిందుముఖుల
నగవు నునుమంచుసొనవోలె♦నయముదఱుఁగ. 291

ఆ. వె. అవసరంబుగాచి♦యల్లంతదప్పల
నుండి సురలు మునులు♦దండములిడ
నొప్పుముక్కనంబు♦నూరువుగలవేల్పుఁ
గొమ్మలంటి రాట♦బొమ్మవోలె. 292

మత్తకోకిల. జాలిదక్కి మతాంతరాళవి♦శాలవేదులయందుఁ గో
నాలగొందిఁ దీపంబుసల్పుజ♦నంబు తాల్ములు దూలుఁద
ద్వాలికాకులనిస్తులస్తన♦పాళికామృగనాభివా
తూలికాహతిఁబక్వశాల్మలి♦తూలికాశకలాకృతిః. 293

శా. డోలారోహణసాహసోద్యమముఁ జా♦టుపొ్రిఢినర్మోక్తి వి
ద్యాలాలిత్యముఁ బుష్పసాయకనప♦ర్యాచర్యయుః మున్నుగా

హాలాపానవిహారము న్నడపి రు♦ద్వ్యత్పి ప్రతిఁబదేమ్రక్షణల్
పోలుంబోలము లింతయెన్నక మహా♦బోధిద్రుమచ్ఛాయలన్.
ఆ. వె. జవ్వనంబు మదము♦సౌందర్యమదమును
ధనమదంబు మనసుఁ♦బెనుఁగుదుళ్ళఁ
బొదలనంత శీధు♦మదముఁ దోడ్తోఁ బ్రోది
యగుచు నిగిడె నమ్మృ♦గాక్షులందు. 295
సీ. దామోదరుఁడు యశో♦దాస్తన్యమానెడు
నని మొక్కి విరిగుత్తి♦నలిభ్రమింపఁ
బ్రొద్దుటచొచ్చెఁ గ♦ద్రూదేవికిపుడని
ప్రియమందు వేణుగ♦ర్భిణి గుటించి
పావనిగద నొచ్చె♦ఫణికేతు తొడలని
యడలు నేనుఁగుచేత♦నరఁటులొదుఁగ
బడబాగ్ని జడధివె♦ల్వడియెడునని చూపుఁ
గానఁబూచినకింశు♦కము చెలులకు
గీ. శేషవృత మేరుశిఖరమ♦నీపఁబొగడు
నంచకౌఁగిటనున్న హే♦మాంబుజంబు
పూర్వమగువిన్కి మదివెడ♦పొడము దేర
మధుమదక్షీబయగునొక్క♦విధునిభాస్య. 296
సీ. సుథయొల్కనెఱివేణి♦సోమార్ధమునుబోలి
చెమరించె దుగ్గలేఁ♦జెమరునొసలు
కుర్కరభర్తదృ♦గ్గోళంబు శీధుస్న
సేవనంబునుబోలె♦జేవురించె
విష్ణు నన్యాసక్తు♦వీక్షించుటనుబోలె
ముక్తకేశికిబొమ♦ముడి జనించెఁ
ద్వరితనిశ్వాసవే♦దనవోలెఁ గంపించె
విజయునివదనార♦విందదళము

గీ. పరమపావనమైన త♦త్పౌండరీక
పుణ్యతీర్థావకాశ మ♦పూర్వసిద్ధిఁ
బెనఁచునృపకన్యకాసక్తి♦జనులవివిధ
విలసనంబులజనియించు♦నలుకననఘ!. 297

క. పొడగనిరి పడఁతులయ్యెడఁ
బొడలపొడలయొడలితపసి♦పుట్టువుఁగప్పక్
జడభరతనిభము నరహరి
యడుగుఁబుడమిసరియ వెడలి♦యట చనుదేరన్. 298

చ. కనకముపేరిరోహణన♦గంబొవసుధాంబునిధానగర్భమో
యనిమిషకార్ముకంబుదయ♦మయ్యెడునొప్పగునొక్క దీనిపు
ట్టినకడ యంచు విస్మయము♦డింపక చంపకపుష్పనాసికల్
చొనిపిరి వాలుఁజూపు వల♦చుట్టును దర్దురపట్టభద్రినిన్. 299

తే. కందుఁకముగాదు కేళిశు♦కంబుగాదు
పల్కువీణియగాదు ద♦ర్పణముగాదు
వర్షపిశునంబుఁ బట్ట బ♦ల్వరుసఁ జనిరి
చంచలాక్షులు చపలప్రి♦చారలెందుఁ 300

తే. యువజనంబులఁ దనయురిఁ♦దవులుపఱచు
కీలుగలిగినయొకనీల♦నీల వేణి
తురుమువిరిదండయురివారి♦చరముఁజిక్క
వఱపనేరక మదిఁజిక్కి♦వడిమెఁదాన. 301

తే. చొచ్చిచనఁ బట్టుటకునొక్క♦మచ్చెకంటి
మ్రొలఁబఱచిన జేలది♦ర్దురము దాఁటెఁ
దొంటివుట్టునఁ దనయంటు♦నంటువారి
మీఁది మమకారనది దెప్పె♦నీఁదుకరణి. 302

క. ఆవర్షాభూవిభునకు
హావళి దఱచయ్యె బిసరు♦హాక్షులచేతన్

రావణునకు వైకుంఠపు
రావాసస్త్రీలచేతి • యలజడివోలెన్. 303

ఆ. వె. పూర్వజన్మకుంభ • భూశిష్యముఖ్యుండు
భేకరూపకూప • బింబితుండు
పరియుతసుతుండు దవులు • పడడయ్యె భూపాల
తనయసఖులచేత • ధాతృతనయ. 304

క. నరనాథపుత్రి యత్తఱి
నురుకుచకచజఘనభార • యుతయయ్యు మదిన్
ధరియించెం గార్యభరమున్
గిరిగహనద్వీపసహిత • క్షితిధృతిం బోలెన్. 305

ఉ. పన్నిదమొగ్గియే నిడుఁడు • పట్టెదఁ జూడుఁడు దీని నంచు నా
కన్నియ చిన్నినవ్వొలయఁ • గా జెలికత్తియలం దనూద్యమ
చ్ఛన్నమనస్కలం దెగడి • చంచలకాంచికలాపవాగురీ
సన్నహనంబునన్ సలిల • జంతులలామముఁ బట్టె నుబ్బుచున్.

తే. సర్వతీర్థపరిదేశప్ర • శస్తమతికిఁ
గాంచి దవులుట దనకర్త్వ • మంచునొక్క
తవులువడియుండె వరుణదం • తావళంబు
పడతియురిఁ జేసె మెడచుట్టు • పసిడిరశన. 307

సీ. పులుఁగునాడించుచో • ఫ్ఫున మించునాడించు
మించునసకిననా • డించినట్టు
లారామచిత్రశా • లూరంబు మదహాస
కౌముదిపరిషిక్త • గండఫలక
యుగుచు నించుకవడి • నూడించి కప్పకు
వెఱచినయొకవృద్ధ • విప్రుమీఁద
వైచి తచ్ఛాపంబు • వలననక్షీజనం
బులు దానుదద్భేక • మువకు భార్య.

ఆ. వె. యమ్మునిట్లుతనకు♦ననురూప తనురూప
శీలములఁ దలిర్చు♦వాలిపిండు
గలుగుటయును నయుతుఁ♦డలఘుసంసారాబ్ధి
నీఁదుతొంటి యీఁత♦యినుమడింప. 308

తే. అధిపతనయకు మును బహిః♦ప్రాణములగు
చామ లెవ్వారు వారెల్ల♦సతికిదాయ
లైరి మండూకసార్వభౌ♦మార్థతనువు
లైనదినముల సాపత్న్య♦మంతకీడు. 309

ఉ. నున్ననిమోము మీసముల♦ నూగుఁను జెన్నఁటిగాకమున్న యీ
యన్నువుగా గృహస్థులకు నగ్రణి♦వై మనుమంచు మున్న వే
గన్నుల వేల్పుదెల్ప నది♦ గాదని వాదముసేయు ధైర్యసం
పన్నుఁడు దేర్పఁగాఁదొణఁగె ♦ పాదనతిం గుపితప్రియాతతిన్. 310

గీ. విషమశరుఁడేయు దూపుల ♦ వేట్లనెన్న
వాఁడు వాధూలమునిశాప ♦ వర్ణతతుల
రాతికొడుకైన యిల్వలా ♦ రాతిచట్టు
మనసుగరఁగించి మమతలఁ ♦ బెనఁగెఁగాన. 311

గీ. స్వాతిమేఘంబుచినుకులు ♦ వనధిశుక్తి
వితతిమయ్యాడునై మౌక్తి ♦ కత వహించు
కరణి నయుతునిప్రేమత♦త్కాంతలందు
నిలిచెఁ బర్యాయపాత్రతా♦నియమసరణి. 312

క. మునిపతికి రాజసుతకును
దనయుఁడు జన్మించె నంతఁ♦దచ్చాపపుటి
ర్లను విరిసె జ్ఞానచంద్రుఁడు
గనుపట్టెన్ విష్ణుపదము♦గానఁగవచ్చెన్. 313

వ. నలపితుండగుట మందపాల సమశీలుండగు ప్రయుతనందను చరి
త్రం బద్భుతరసైకపాత్రంబయ్యె నిట్లు. 314

క. గృహమేధిధర్మవర్మా
సహమతియగుకుమతి యయుతు • చందమున సుదు
స్సహదుఃఖగ్రాహానన
గుహఁ బడునని వింటి మును ము • కుందునిచేతన్. 315

ఆ. వె. విష్ణుభక్తులై వి • వేకులై తృష్ణావి
దూరులై స్వకుక్షి • పూరణంబు
సమయసంభృతార్థ • సంతృప్తిగాఁ గోరి
నడచువారు భవము • గడచువారు. 316

సీ. అని పార్వతీనాథుఁ • డమరపంయమిఁజూచి
పరమభాగవతప్ర • వర్తిగలుగు
నీవిష్ణుప్రార్థింప • నిఖిలోన్నతములగు
దైవతక్షేత్రతీ • ర్థముల మేళ
నం బెఱింగించితి • నానాకథా నిధా
నంబగుదానినెం • న్నఁడును దీని
వైష్ణవధర్మప్ర • వర్తనం బెడలిన
యసదుల కెఱుక సే • యకుము నీవు

గీ. గుప్తముగఁ జేయు మనుడు భ • ర్గునకు మ్రొక్కి
ముని మునిధ్యేయ! నీకతం • బున దురాప
రూపతత్క్షేత్రరాజస్వ • రూప మెఱుఁగఁ
గంటి గరిగంటిగానిసౌ • ఖ్యములు గంటి. 317

చ. భయము నదల్చి దుఃఖములఁ • బాచి సుఖంబులఁబ్రోదిచేసి త
ద్దయుఁ దిలకించి నీయుడుగుఁ • దమ్ముల్లఁ నిమ్ముల గొల్చి నిత్యస

శ్రియు మొనరించునాకిఁక న♦సాధ్యము లేదిది యట్లయౌను ని
ర్భయభవసాగరో త్తరణ♦వాదికులాదిమవైష్ణవాశ్రితుల్. 318

క. అని పౌనఃపున్యంబుగ
వనజాసనసూతి మ్రొక్కి♦వలగొని హరు నీ
డ్కొని పౌండరీకమునకుఁ
జని భైమిం దీర్ఘమాడి♦చక్రి భజించెఁ. 319

క. భజియించి తత్ప్రసాద
వ్యజనానిలశమితతాపు♦డై యిప్పుడు స
బ్జజసూతి దక్షిణద్వా
రజగతి నున్నాఁడు సుస్థి♦రప్రమదమునన్. 320

క. అని కథకుఁడు శౌనకముఖ
మునులకు హరిదివ్యచరిత♦ములు దురితతమో
దినకరకిరణాయితములు
వినిపించెఁ గళావతీశ!♦వేదాద్రీశా!. 321

శా. దిగ్దంతావళకర్ణచాలన సము♦ద్వేల్లన్మరుత్పల్లవ
ప్రసగ్దీప్తిప్రకటప్రతాపశిఖిసం♦ఛన్నాఖిలాశాంత! స
మ్యగ్దానాధరితామరద్రుమ! రమా♦ప్రాణేశ భక్తప్రియా!
పాగ్దిక్కేసరిపీఠికాధిప! సభా♦పద్మాకరాహస్కరా!. 322

క. విద్వత్కుముద నిశాకర!
విద్వేషి వరూధనాథ♦వేశంత మదాం
ధద్విరదకీర్తి సంవృత
సద్వీప! దిలీపభూప♦సదృశాటోపా!. 323

మాలిని. సరసగుణరతీశా!♦షట్సహస్రవ్రయేశా!
నిరవధికగుణాబ్ధీ!♦నిత్యసత్యోపలబ్ధీ!

హరిహయసమభోగా! యాచమానానురాగా!
కరగతనిగమాళీ! కావ్యకృత్పద్మహేళీ!. 324

## గద్య

ఇది శ్రీమత్పరమపదనాథనిరవధికకృపాపరిపాక
పరిచిత సరసకవితాసనాథ రామకృష్ణ
కవినాథ ప్రణీతంబైన పాండురం
గమాహాత్మ్యంబనుపరను భా
గవతచరిత్రంబునందుఁ బంచ
మాశ్వాసంబును సర్వంబును
సంపూర్ణము.

